ఆంధ్రప్రకృతిధర్మపరిషత్ - 4

# ప్రకృతి గృహవైద్యము



ప్రకృతి, ఇండియన్‌నాచురోపాత్ పత్రికాసంపాదకులును; సునిశిత వైద్యము,
తొట్టివైద్యము మొదలగు సుప్రసిద్ధ గ్రంథరచయితలు నగు
**పుచ్చా వెంకట్రామయ్య గారు, ఎన్. డి.**
గ్రంథకర్త.

ప్రకాశకులు:
ప్రకృతికార్యాలయట్రస్టు, బెజవాడ.

# ప్రకృతి గృహవైద్యము

## విషయసూచిక.



# ప్రకృతి గృహ వైద్యము

## పీఠిక

ప్రకృతివైద్యము నేర్చుకొనదలచిన వారికీ గ్రంథమునందు ప్రారంభపాఠము నేర్పబడును. ప్రకృతివైద్య పట్టముబొంద దలచిన వారికి గాక సామాన్యగృహస్థుల కందఱకును ప్రకృతివైద్యవిద్య, యేగ్రంథముల జదువుటవలన అందుబాటులో నుండునట్లు చేయవచ్చునా యను అలోచన కిది ఫలితము. ఈ పాఠములు చదువుటవలన సామాన్యప్రకృతి వైద్యజ్ఞానము లభించును. అందువలన గృహములందు ఎవరి కుటుంబములకు వారు చికిత్స చేసికొన వీ లగును. ప్రకృతివైద్యమునందు తరిబియతు నొందదలచినవారి కపాఠములు చదువుటవలన శిబిరములందు శిక్షణబొందుటకు అవసరమగు ప్రారంభజ్ఞానము గలుగును. ప్రకృతి వైద్యపట్టణములు బొంది వృత్తిగా వైద్యము చేయదలచినవారు, లధ్యయనము చేయుటకు వారికి వేరేఉద్గ్రంథములు వ్రాయబడియున్నవి. వానిని చదివి మాశిబిరములలో శిక్షణ బొందవచ్చును. లేదా వైద్యజ్ఞానము నలవఱచుకొనవచ్చును. ఇప్పుడు వ్రాయబోవు 24 పాఠములకును చివర ప్రశ్నలను జేర్చుచున్నాము. అందువలన విద్యార్థులు తమకు లభించిన జ్ఞానముయొక్క పరిమితిని పరీక్షించుకొన వీలగును. వారాప్రశ్నలకు సదుత్తరముల వ్రాసి మాకుపంపిరేని అందలి లోపములను దిద్దిపంపెదము. ఇట్లు దిద్ది పంపుటకు పాఠము ఒకటింటికి రు 0-3-0ల చొప్పున మేము ఫీజు తీసికొందుము. ప్రకృతి పత్రికా చందాదారులు కానివారికి మేము తప్పులు దిద్దిపెట్టజాలము. ఈ పత్రికయందు 24 పాఠములు పూర్తియగువరకును క్రమక్రమముగా ప్రచురించుచుందుము. పాఠప్రశ్నలకు వ్రాసిన ఉత్తములనుదిద్దుటకు పంపువారు వానిని ప్రకృతిపత్రికా కార్యాలయమునకు పంపవలదు. అందువలన ఆలశ్య మగును. కాన వానిని డా॥ పుచ్చా వెంకటామయ్యగారు యస్ డి; డి. యం., దంతలూరు అగ్రహారం. పిడపర్రు పోస్టు, (Via) దుగ్గిరాల - అనే చిరునామాకు పంపవలెను.

—సంపాదకుడు.

## ఉపోద్ఘాతము

ప్రియపాఠకా !

నీవు ఐచ్ఛికముగా 'విద్యార్థి' వగుటవలన మాకు గురుత్వమును, నీకు శిష్యత్వమును లభించినది. గొప్పవా రెల్లరు నిట్లు యింటివద్దనే యుండి తమ జ్ఞానమును వృద్ధిబొందించు కొనిరి. నీవును వారివలెనే ఒకస్వతంత్రమైన వృత్తికి అవసరమగు జ్ఞానసముపార్జనము జేయనారంభించితివి. విద్య కళాశాలలద్వారా సంపాదించుటసాధ్యము కానప్పు డిట్లే పోస్టుద్వారావిద్యను సంపాదించి అనేకులు జాతీయ వాదులుగను, న్యాయవాదులుగను, ఇంజనీయర్లుగను, వైద్యపరులుగను తమ జీవితముల గడిపితిమని స్వీయచరిత్రములలో వ్రాసికొని యున్నారు. అట్టి విద్య వారికి జీవనాధార మయినది.

అనేక సంవత్సరములు కళాశాలల యందును, తపాలాద్వారాను విద్యార్థులకు ప్రకృతివైద్యమును నేర్పిన అనుభవజ్ఞులగువారే యీ పాఠములను రచించియున్నారు. ఇది వారి యనుభవముయొక్క సారమై యున్నది. ఈ పాఠములు చదివి అనుభవములోనికి తెచ్చుకొందురేని రోగులకు సేవజేసి పుణ్యమును గడించుకొనవచ్చును. ధనములేనివారు వృత్తిగా నవలంబించి కుటుంబముల పోషించుటకును సామర్థ్యమును గడింపగలరు.

ఈపాఠమును శ్రద్ధతో పఠింపవలయును. మీరు తగినంత శ్రద్ధను వహింతురేని మాసామర్థ్యమునంతను వినియోగించి మిమ్ములను ప్రకృతివైద్యులనుగా తరిబియతు చేసెదము. మాబిడ్డలకు బోధించునట్లు మీకు బోధింతుము. మీరు మేము చెప్పినట్లు నడచు కొందురేని మిమ్ములనుగూడ ప్రకృతివైద్యులుగా తరిబియతు చేసెదము.

ఇప్పుడంతటను ప్రకృతివైద్యులయొక్క ఆవశ్యకత గోచరించు చున్నది. ఆంధ్రదేశమునందు కొలది మందియే ప్రకృతివైద్యు లున్నారు. ప్రకృతివైద్యము కావలసినవారు అసంఖ్యాకులుగా నున్నారు. అనేకులు మందులచేతను, ఆపరేషనులచేతను తమ వ్యాధులు నివారణగాక విసుగెత్తియున్నారు. ఎక్కడనైనను ప్రకృతిచికిత్సను శాస్త్రీయముగా చేయగలవారున్నారా యని యెదురుచూచు చున్నారు. మీసాయమును వారు సంపూర్ణ ఆమోదముతో ఆహ్వానింతురు. మీరు ప్రకృతివైద్యమునందు జ్ఞానము గడింపవలయునన్న మానవ దేహముయొక్క నిర్మాణమును, అందలి అవయవములు, అవి చేయు క్రియలు, ఆక్రియలకు ఆటంకము గలిగినప్పుడు గలుగు వ్యాధులు మొదలగు విషయముల నెఱిగి యుండవలయును. శారీరకశాస్త్రమును గురించిన ఈ మొదటిపాఠముతో మన వైద్య విజ్ఞానమును బోధింప నారంభించెదము.

ఒ క ట వ పా ఠ ము

# అస్థినిర్మాణము - శరీరశాస్త్రము

మానవుని దేహమునందలి అస్థులను (ఎముకలను) సంగ్రహముగా నిట్లు పేర్కొనవచ్చును. మొదటసంగ్రహవిభాగము చేసి తరువాత విపులముగా వివరించెదము.

౧ తల. ౨ కబంధము లేక మొండెము 3 చివరలు - ఈమూడే దేహమునందలి ప్రధాన భాగములు.

### త ల

౧ కపాలము - కపాలముయొక్క యెదుటి భాగము వెనుకవైపు.

౨ ముఖము - కపాలమునందు ఎదుటివైపున దిగువగా నుండుభాగము; ఇందు కనులు, ముక్కు, నోరు గలవు.

3 మెడ.

### క బ ం ధ ము

౧ ఉరము - ఇది కబంధము[illegible] పైభాగమున నుండును. దీనికి లోపలగా శ్వాసాశయములు, పెద్ద వగు రక్తనాళములు, శ్వాసనాళము, అన్నవాహికలో కొంతభాగము నుండును.

ఉదరము - ఇది ఉరమునకు దిగువగానుం ను. ఇందు జీర్ణావయవములు, మూత్రపిండ ులు, ప్లీహము గలవు.

కూపకము - ఉదరమునకు దిగువ నుండును. మలాశయము, మూత్రకోశము, జననేంద్రి సంబంధమగు లోపలి భాగములు నుండును.

చివరలు

పైన-భుజము, బాహువులు, మోచేయి, దండ చేయి, మణికట్టులు, చేయి.

దిగువన——నడ్డి, తొడ, పిఱుదులు, మోకాలు, పిక్క, చీలమండ, పాదములు.




దట్టెము




వెన్నెముక

దేహమునందలి యెముకలను దట్టె మందురు. దినినే అస్థిపంజర మనియు నందురు. అనగా యెముకలగూడు. ఎములను ఈక్రిందివిధముగా విభజించియున్నారు.

దేహమునకంతటికిని వెన్నెముక ఆధారముగా నుండును. పైనున్న శిరస్సును, కబంధమును ఇది భరించును. బాహువులకు సైతము ఇదే ఆధారముగా నుండును. వెన్నుపూసలను పేరు-26 ఎముకముక్కల కూర్పే ఈ వెన్నెముక.

ఉ ర ము

౧ ఉరః శల్యము - దీనికే ఉరోస్థి అనిపేరు.

౨ ప్రక్క ఎముకలు.

౩ వెన్నుపూసలు ౧౭.

కూపకము

౧ అనామకాస్థులు (మలుగుఎముకలు) రెండు. క్రిందివి - కాలులోను, పాదములోను మొత్తము ముప్పదియొక్క యెముక లున్నవి. పైచేతులు — బాహువు, హస్తములలోనున్న యెముకలమొత్తము ముప్పదిరెండు. దేహమునందలి సూక్ష్మాతిసూక్ష్మమైన సంపూర్ణమైన భాగమునకు కణ మనిపేరు. దేహమునం దిట్టి కణములు కోట్లాదిగా నున్నవి. కొన్నికణములు కలసి ఒకధాతు వగును. కొన్నికలసి వివిధము లగు అవయవములుగా నగును. వివిధములగు భాగములుగాను ఏర్పడును. ఈకణములు వివిధ పరిమాణములలో నుండును. కాని సామాన్యముగా ఒక చతురపుఅంగుళములో అయిదు వందలకణము లిమిడి యుండును.

ప్రతికణమునకును మధ్యభాగమున నొకమూలశక్తి యుండును. ఇది గుండ్రముగానుండును. దేహమంతయు కలిసి యేపనిని జేయుచుండునో ఒకకణముగూడ అదేపనిని జేయుచుండును. కణ మొకసూక్ష్మమగు దేహమని చెప్పవచ్చును. ప్రతికణము ప్రాణవాయువును, ఆహారరసమును జీర్ణించుకొనగలదు. మాలిన్యములను నెట్టివేయగలదు. పునర్నిర్మాణము చేయగలదు.

ప్రతికణమునకు స్వతంత్రమగు మనస్సుగలదు. అందలిమూలశక్తి మన దేహమునందలి మెదడు, నాడీశక్తి - వీనికి తుల్యముగా నుండును. సహజపరిజ్ఞానముతోను, వివేచనముతోను మనము ఆలోచించి పనులు చేయుచున్నట్లే ప్రతికణమునందలి మూలశక్తియును, కణమున కంతకును యాజమాన్యము వహించి కణమునందలి పనినంతను చేయుచుండును. కణము ధైర్యముగా ప్రవర్తించుటయు, పిరికి తనముతో ప్రవర్తించుటయు గలదు. దేహములు ఎట్లు భయము, క్రోధము మొదలగు ఉద్రేకములకు వశములై యుండునో యీకణములును అట్లే ఉద్రేకముల బొందుచుండును. కనుక ఒకమానవుడు ధైర్యవంతుడగునేని వానిదేహమునందలి కణములును ధైర్యము గలవైయుండును ఆతడు పిరికివాడగునేని వానిదేహమునందలి కణములును పిరికితనము గలవిగా నుండును. దేహమారోగ్యవంతముగను, బలముగను, శక్తివంతముగను, ఉత్సాహవంతముగను నుండవలయునెడల మనదేహమునందలి ప్రతికణము నందును నీ గుణము లుండవలయును మన మానసిక వృత్తు లెట్లుండునో కణముయొక్క మనస్సు గూడ నట్లేయుండును. కాన కణములు సరియైనస్థితిలో నుండవలయు నని కోరెదమేని మనస్సునుగూడ సరియైన స్థితిలో నుంచుకొనవలయును.

[వేఱొకపాఠమున మానసిక చికిత్సనుగురించి మీకు బోధించెదము].

ఒకానొకక్రియ (Function) ను జరుపుటకు కొన్ని కణములుగలిసి ఒక ధాతువుగా నేర్పడును. దిగువ వివిధధాతువులయొక్కయు, వానియొక్క క్రియలయొక్కయు వివరము గలదు.

౧ చర్మము - పైపొరలకు సంబంధించిన ధాతువు. ఇది దేహముయొక్క పైభాగమును కప్పియుండునట్టి సన్ననిపొర. వెలుపలి గాలితో సంబంధము గలిగిన పైపొరలన్నియు నీ విభా

గములో చేరును. జీర్ణావయవములు, మూత్రావయవములు, శ్వాసావయవములు - వీనియందలి లోపలిపొరలకును బయటిగాలి యేదో విధముగ చేరునుగాన వీనికెల్ల చర్మమని పేరు. ఇందు ఆమత్వచముగూడ చేరును. ఏవిధముగను బయటిగాలి తగులనిపొరకు లోపలి పొరలని పేరు.

౨ సంధిధాతువు: సంధిబంధనములు, స్నాయువులు, నాళములు, అవయవములు మొదలగు బలమైనట్టియు, బిరుసైనట్టియు ధాతువు.

3 ఉపాస్థి: ఇది యెముకలకన్న మెత్తగానుండును. కాని ఇతరకండరములకన్న గట్టిగా నుండును. ఇట్టిది సంధులయం దుండును.

౪ ఎముకలు:—లోహలవణములయొక్క కూడికవలన ఎముక లేర్పడును.

౫ నాడీసంహాతులు:- ఒకగుండ్రని కణమును, దాని కనుబంధముగా రెండు ఉబ్బియుండు తంతువులును కూడియుండు నాడీమూలపదార్థముండును. వీనికి కణములని పేరు. ఇట్టికణములు కొన్ని కలిసి ఒకసంహతి యగును.

౬ రక్తము:-ఇదియును నిజమునకొక కుటికయే. అది ద్రవరూపముగా నుండును. అనగా ద్రవరూపమగు కుటికలు. ఇందు తెల్లనైనట్టియు, ఎర్రనైనట్టియు కణము లుండును. రసమనునది రక్తముయొక్క ఒకానొకదశ.

౭ గ్రంథులు:-గ్రంథులు రెండురకములు.

౧ నాళములు గలవి; ౨ లేనివి. నాళములు గ్రంథులయందు— నాళములచుట్టును చర్మసంబంధమగు కణములుండును. అవి రక్తమునుండియు ఇతరధాతువులనుండియు రసములను తాము స్వీకరించి లోపలనున్న నాళములలోనికి చేర్చును. ఈదిగువ అట్టి గ్రంథులనుగూర్చి వివరించెదము.

౧ యకృత్:-దీనికే పైత్యకోశమనియును పేరు గలదు. జీర్ణక్రియకు అవసరమగు పిత్తరసము ఇందు ఊరును. తియ్యని పదార్థముల నిది జాంతవశర్కర (Glycogen) గా మార్చును. మూత్రికామ్లమును మూత్రలవణము (Urea) లుగా మార్చును. జీర్ణక్రియవలన నేర్పడునట్టి విషములను, వ్యర్థపదార్థములను నశింపజేయును. దేహమునందు చెడిపోయిన కణములను నశింపజేయును.

౨ వృక్కకము:—ఇదియును జీర్ణావయములలో నొకభాగము. ఇందు తియ్యనిరసమూరును. అది యొక నాళముద్వారా ఆంత్రమూలమునకు జేరును. ఇందుండి యి కొక రస మూరును. అది రక్తముతో కలియును. అందువలన దేహమునందలి ఆంతర్యక్రియ (Metabolism) క్రమపఱచబడును.

3 మూత్రపిండములు: ఇందుండి మూత్రము ఊరును.

౪ క్షీరస్రోతస్సులు: ఇవి స్త్రీలయం దుండును. ఇందుండి పాలు ఊరును.

నాళములులేని గ్రంథులు.

౧ ప్లీహము:- తెల్లనిరక్తకణములు తయారగును.

౨ థిరాయిడు:-ఇది కంఠమునందుండి మెదడునకుబోవు రక్తమును అదుపులో నుంచును. దేహమునందలి క్రొవ్వుయొక్క ఉత్పత్తిని క్రమపఱచును. ఈ గ్రంథిని వయోగ్రంథి యని పిలువవచ్చును.

3 మూత్రపిండ సమీపగ్రంథి (Adrenal): -ఇది మూత్రపిండమునకు పైగా నుండును. దీని

వలన రక్తచలననాడులును, రక్తపీడనము అదుపులో నుంచబడును.

౮ శ్లేష్మగ్రంథి (పిత్యూయిటరీ:)- ఇది మెదడు యొక్క పీఠమువద్ద (దిగువగా) నుండును. అనిచ్ఛానాడులను యెముకలపెంపును అదుపులో నుంచును.

౯ అండములు:-ఇవి పురుషులయందు వృషణములుగను, స్త్రీలయందు గర్భాండములుగను నుండును. దైహిక మానసిక క్రియలయొక్క వృద్ధియు, గతియు వీనిపై నాధారపడియుండును.
౮ థైమస్:- ఈగ్రంథి రొమ్ములో నుండును. దేహముయొక్క పోషణ, వృద్ధి - వీనిని అదుపులో నుంచును.

౭ శోషరసగ్రంథులు:-ఇవి సరియైన గ్రంథులు గావు. ఇవి శోషరసముండు కుటికలయొక్క సమూహము. శోషరసము ప్రవహించు నాడులకు ప్రక్కగా నుండు వానియందలి వ్యర్థమైనట్టియు, అపాయకరమైనట్టియు పదార్థములనివి వేరుచేసి నశింపుజేయుచుండును.

అ వ య వ ము లు

దేహమునం దనేకరకములగు క్రియలు జరుగుచుండును. ఒక్కొక్క అవయవమునందు ఒక్కొక్క విధమగు క్రియాకలాపము జరుగుచుండును. ఒక్కొక్క అవయవమున ఒక్కొక్క విధమగు కణము లుండును. ఒక్కొక్క విధమగు ధాతువు ఉండును. రొమ్మునందును, ఉదరమునందును, కూపకమునందును ఉండెడి కొన్ని అవయవముల వివరము లీక్రింద వ్రాయబడుచున్నవి.

రక్తప్రసరణమండలము: - హృదయము, రక్తవాహికలు.

జీర్ణమండలము - అన్నవాహిక, జీర్ణాశయము ఆంత్రమూలము, చిన్నప్రేగులు, ఆంత్రము మలాశయము, యకృత్తు, చేదుకట్టు.

వృక్కకము - శ్వాసమండలము - శ్వాసాశయములు, శ్వాసనాళములు.

మూత్రికావయవములు - మూత్రపిండములు మూత్రనాళములు, మూత్రకోశము.

నాళరహితగ్రంథులు - ప్లీహము, మూత్రపిండ సమీపగ్రంథులు, థిరాయిడ్, థైమస్, శ్లేష్మగ్రంథులు.

పురుషజననేంద్రియములు - లింగము, వృషణములు, ఉత్థాపకగ్రంథి.

స్త్రీజననేంద్రియములు - భగము, గర్భవివరము, అండములు.

జ్ఞా నే ం ద్రి య ము లు

కన్నులు - కన్నులు, మెదటితో కలుపునట్టి కంటినాడి (దృజ్నాడి)

చెవులు - వినుట కుపయోగించును. మెదటితో చెవి (శ్రవణ) నాడితోడ కలుపబడి యుండును. ప్రతిచెవియును 3 భాగములుగా వివరింపబడినది. బయటిభాగము, మధ్యభాగము, లోపలి భాగము.

నాసికారంధ్రములు - వాసనచూచుట కుపయోగించును. వాసనను ఘ్రాణనాడిద్వారా మెదటికి జేరును.

నాలుక - రుచిచూచుట కుపయోగించును.

చర్మము - దేహమునకు పైభాగమున నుండెడి కప్పు. స్పర్శను తెలుపును.

## మండలములు

హముయొక్క గతికి అవసరమగు క్రియలు ఉన్నవి. ఒక్కొక్కమండలము ఒక్కొక్క ్రియను నిర్వహించుచుండును. ఒకటికన్న నె ్కవ క్రియలను నిర్వహించు మండలములును ొన్ని గలవు. ఒక్కొక్క మండలమున కొన్ని ్వయవములును, కొన్ని ధాతువులును ఉండును.

6 మండములను క్రింద పేర్కొనుచున్నాము.

౧ నాడీమండలము
౨ జీర్ణమండలము
౩ రక్తప్రసరణమండలము
౪ శ్వాసమండలము
౫ మూత్రమండలము
౬ జననేంద్రియములు



సిరలు



ధమనులు

## నాడీమండలము

మెదడు, వెన్నుపాము, స్వతంత్రనాడులు నిందు చేరును. మెదడు కపాలములోపల నుండును. వెన్నుపాము వెన్నుపూసలలోను ఇమిడియుండును. కపాలనాడులు మెదటిలోనుండి బయలుదేరి

కన్నులు, ముక్కులు, చెవులు, నాలుక వీనిలోనికి వ్యాపించియుండును. అందువలన చూచుట, వాసన తెలిసికొనుట, వినుట, రుచిచూచుట మొదలగు పనులు జరుగుచున్నవి. కొన్నినాడులు ముఖము, కంఠము, రొమ్ము, ఉదరములలోని [illegible] వ్యాపించియుండును.

వెన్నుపాములు స్వతంత్రకండరములను, స్వతంత్ర నాడీగుచ్ఛములను కలుపుచుండును. కంఠము, రొమ్ము, ఉదరము, కూపము, వీనిలోపలమాత్రమే స్వతంత్రనాడు లుండును. అచ్చటనున్న ఆశయములను కదలించుట మొదలగు పని యంతయు స్వతంత్రనాడులవలననే జరుగుచుండును.



జీర్ణ మండలము

జీర్ణనాళము:- నోరు, సప్తపథ, అన్నవాహిక, జీర్ణాశయము, చిన్న ప్రేగులు, పెద్ద ప్రేగు, మల కోశము, ఆసనము.

అనుబంధములు:- దంతములు, నాలుక, లాలాజలగ్రంథులు, యకృత్, చేదుకట్టు, వృక్కాకము.

జీర్ణక్రియ యాంత్రిక మనియు, రాసాయనిక మనియు రెండువిధములు. స్వతంత్రమైనట్టియు, అస్వతంత్రమైనట్టియు, కండరములచేత కలిగింపబడు క్రిమిచలనమువలన ఆహారపు పైనుండి క్రిందికి గెంటివేయబడును. ఈక్రియ యాంత్రిక మనబడును. ఈక్రియకు అయిదుదశలు గలవు. నమలుట, మ్రింగుట, కలుపుట, క్రిమిచలనము, మలవిమోచనము.

కర్బను హైడ్రిజములు, మాంసకృత్తులు, క్రొవ్వు పదార్థములు మార్పుబొంది రక్తములోనికిని శోషరసములోనికిని జేరదగిన పలుచని ద్రవ పదార్థములుగా మారుట రాసాయనిక జీర్ణక్రియయగును. ఇట్లు జరుగుటకు తినిన పదార్థమునందు మండము గలుగుటయు, కొన్ని జాఠరరసములు అందు కలియుటయును గలుగును. ఆహారపదార్థమును నమలునప్పుడందు క్షార స్వభావముగల ఉమ్మినీరు కలియును. టైయాలిన్ అను నొకపదార్థము ఉమ్మినీటియందు గలదు. అందువలన తినిన పిండి పదార్థము చక్కెరగా మారును. నోటినుండి ఆహారమును జీర్ణకోశమువరకును జేర్చు క్రియకు 'మ్రింగుట' యని పేరు. మొదట ఆహారమును నాలుకచే సప్తపథ లోనికి నెట్టివేయబడును. సప్తపథ సంకోచము నొందుటవలన నది అన్నవాహికలోనికి చేరును. అంగిలి యుండుటవలన నది యాహారమును ముక్కులోనికి పోనీయదు. ఆహారము తిరిగి నోటిలోనికి రాకుండ

నాలుక అడ్డుకొనును. అన్నవాహిక యందు గలిగిన సంకోచమువలన ఆహారము జీర్ణాశయము లోనికి చేరుకొనును.

జీర్ణాశయమునందు చేరినపదార్థము అచట మథింపబడును. స్వాతంత్ర్యములగు జీర్ణాశయ కండరములలో కొన్ని, తినిన ఆహారమును క్రిందుమీదులు చేసి, జీర్ణాశయమునందు ఊరునట్టి జాఠరరసముతో కలియునట్లు చేయును. ఈక్రియకు 'సమ్మేళన' (Constriction) మని పేరు. ఇట్లచట నది కొంతవరకు జీర్ణమై చిన్నప్రేగులలోనికి నెట్టివేయబడును. ఇట్లు ఆహారము నెట్టివేయబడు పని క్రిమిచలన మనబడును.

జీర్ణాశయమునందు ఆహారమును జీర్ణముచేయునట్టి రసమునకు జాఠరరస మని పేరు. ఇందు రెండువిధములగు మండమును గలిగించుద్రవములు (Enzymes) ఉండును.

ఒకటి పెప్సిన్, రెండవది రెన్నిన్. జాఠరరసమునందు ఒకటింట 500 వ భాగము 1/500 హైడ్రోక్లోరికామ్లము ముండును అందువలన జీర్ణక్రియ యందుఆహారమును ముగ్గిపోనీయకుండ ఆపును. పెప్సిన్ వలన మాంసకృత్తులు పెప్టోన్ అనుపదార్థముగా మారును. రెన్నిన్ వలన త్రాగినపాలు కుదపలుగా తోడుకొనును. తరువాత నది పెప్సిన్ తోను హైడ్రోక్లోరికామ్లముతోను బాగుగా కలియుటకు వీలుపడును. ఇట్లు జాఠరరసముతో కలియుటవలన కొంతభాగము జీర్ణమైన ఆహారమునకు పాక (Chyme) మని పేరు. ఈపాకము జీర్ణాశయముయొక్క సన్నని చివరనున్న కవాటము (ఆంత్రముఖకవాటము) గుండ చిన్న ప్రేగులలోని మొదటిభాగమగు ప్రథమాంత్రము (Duodenum) లోనికి త్రోసివేయబడును. మనము తినిన ఆహారము యొక్క స్వభావమును బట్టియు, పరిమితిని బట్టియు, యింకను యితరకారణముల వలనను అది జీర్ణాశయములో 2 మొదలు 5 గంటలవరకును జీర్ణకోశములో నిలువయుండును. కొంత పరిమితిగల ఆహారము జీర్ణమగు వరకును వేచియుండి తరువాత ఆంత్రముఖకవాటము ఒకతూరి తెరచుకొనును. తరువాత సరిపడినంత పదార్థము జీర్ణమగు వరకును ఆగి తిరిగి తరువాత తెరచుకొనును.ఇట్లు జీర్ణాశయము నందలి ఆహారమంతయు జాఠరరసముతో కలిసి వెడలిపోవువఱకును అది అప్పటప్పట తెరచుకొనుచుండును.

చిన్నప్రేగులలో ఆయాహారము సమగ్రముగా జీర్ణమగుటకు 3 రకముల జీర్ణరసము కలియును. 1 పైత్యరసము, 2 మధురరసము, 3 ఆంత్రరసములు. పైత్యకోశమునందు చేరైన పైత్యరసమూరును: ఇది కుళ్లును గలుగనీయదు. మధురరసమున 3 విధములగు మండము గలిగించుద్రవములున్నవి ౧ ట్రిప్సిన్:—ఇది మాంసకృత్తులను పెప్టోనులను అమెనోఆమ్లములుగా మార్చును. ౨ అమెలిప్సిన్:-ఇది పిండిపదార్థములను, మధురపదార్థములను సులభముగా ఇంకునట్టి పలుచని పానకముగా మార్చును. 3స్టియాప్సిన్: క్రొవ్వు పదార్థములను చమురు ద్రావకములుగాను గ్లేయసిన్గాను మార్చును.

చిన్న ప్రేగులలోగుండ ఆహారము పెద్దప్రేగు వరకును నడుపబడును. ఈచలనమునకు క్రిమిచలనమని పేరు. పనికిరాని పదార్థమును, జీర్ణముకాక మిగిలిన పదార్థమును పెద్దప్రేగు లోనికి నెట్టివేయబడును. అది యచటనుండి మలముగా వెలువరించి వేయబడును. గుదమునుండి యీమలమును వెలువరించుటలో

స్వేచ్ఛాకండరములును, అనిచ్ఛాకండరములును పనిచేయును.

జీర్ణాశయమునందును చిన్న ప్రేగులలోను యిట్లు జీర్ణక్రియజరుగుచున్నప్పుడుఆహారసారమురక్తము లోనికి పీల్చుకొనబడుచుండును. జీర్ణరసముతో కలిసి ఆహారపదార్థములు సూక్ష్మములగు పదార్థములుగా నగును. తరువాత పలుచని ద్రవపదార్థములుగా నగును. అప్పుడది ద్రవరూపములగు లవణములు,చక్కెర,మాంసకృత్సారములుగాను తయారగును, జీర్ణాశయమునందును,చిన్నప్రేగులలోనికి వ్యాపించియున్న కేశనాళికలచే నీరసములు స్వీకరింపబడి, తరువాత పెద్దనాళములలోనికి చేరును. అందుండి జాఠరసిర (Portal vein) వెంట పైత్యకోశములోనికి జీర్ణమైన క్రొవ్వుపదార్థములు చిన్న ప్రేగులలోనుండి శోషరసవాహికలలోనికి గ్రహింపబడును. అట్లు పైత్యకోశములోనికి చేరినసారము బృహత్సిరవెంట హృదయములోనికి చేరును. అందునది ప్రాణవాయువుతో గలిసి రక్తమగును శోషరసవాహికలలోని సారము దేహమంతటికినివ్యాపించి యెక్కడెక్కడ చమురు కావలెనోఅక్కడనున్న భాగములకు పంచిపెట్టును·రక్తము దేహమంతయు నభిసరించి దేహమును పోషణ చేయుచుండును. ఈక్రియకు పోషణక్రియ (Anabolism) అని పేరు. చెడిపోయినభాగములందలి మాలిన్యములను బయటికి మలములుగా వెలువరించివేయుచుండును· ఈక్రియకుశుద్ధిక్రియ (Katabolism) యనిపేరు ఈరెండుక్రియలకును కలిసి సమష్టిగా జీవనక్రియ (Metaolism) యనిపేరు. రక్తము ద్రవరూపమైనది. దేహమునందున్న రక్తవాహికలగుండ అభిసరించుచుండును. ఇవి జీర్ణావయవములయందు పిండుకొనబడిన ఆహారసారమును దేహమునందలి భాగముల కన్నిటికిని పంచిపెట్టును. ఇంకొక పనిగూడ

## రక్తము




చేయును. శ్వాసకోశములలోనికి పీల్చబడిన ప్రాణవాయువును సమస్త దేహభాగములకును జేర్చును, దేహమునందలి మాలిన్యముల నెల్ల స్వీకరించి వాయురూపములగు మాలిన్యములను శ్వాసావయవముల లోనికిని జలరూపములగు మలములను మూత్రపిండములలోనికిని, ఘనరూపములగు మలములను ఆంత్రములలోనికిని, మిగిలిన మలములను చర్మమునకును చేర్చును. కొన్నిమలములు పైత్యకోశములోనికి చేరును. అన్నివిధములగు మలములును ఆయా అవయవములనుండి వెలువరించి వేయబడును·

హృదయకోశమునుండి దేహభాగములకు పోవు నట్టిరక్తము ధమనిరక్తమని పిలువబడును. ఈ రక్తము ప్రతిఅవయవములోనికిని, ప్రతికణము లోనికిని చేరును. ఇది యెఱ్ఱని యెరుపురంగుగా నుండును. సిరలయం దుండు రక్తము హృదయ మువంకకు వచ్చుచుండును. అందు కర్బనుద్వి యమ్లజనిదమును, ఇంక నితరమాలిన్యములును చేరియుండును. హృదయమునుండి ఆరక్తము శ్వాసకోశములలోనికి పిండబడి అచటనుండు ప్రాణవాయువుతో గలసి శుద్ధిబొంది యెఱ్ఱని యెరుపురంగుగల దగును. సిరలలోనుండి శ్వాస కోశములోనికి చేరులోపల ఆరక్తము నీలిరంగు గలదై, నల్లని యెరుపురంగు గలదిగా నుండును. రక్తమునందు అయిదింట మూడుపాళ్లు 3/5 ప్లాస్మా అను పేరుగల ద్రవపదార్థ ముండును. మిగిలిన 2 భాగములును రక్తకటిక లను పేరు గల ఘనపదార్థ ముండును. వీనికి రక్తకణము లని పేరు. ఎఱ్ఱరక్తకణము లనియు శ్వేతరక్త కణము లనియు నవి రెండువిధములు.

ఎఱ్ఱరక్తకణములు ఒకఅంగుళములో 1/3200 పరిమితి గలిగియుండును. ఇందుమూలశక్తి (Neucleus) గాని కణమునకు ఆవరణముగాని యుండదు. ఒక ఘనమిల్లిమీటరు రక్తము నం దిట్టి కణములు 5,000,000 సంఖ్య గలవి యుం డును.

శ్వేతరక్తకణములు అంగుళములో 1/25000 పరిమితి గలిగియుండును. ప్రతికణమునకును ఆవరణ యుండును. ప్రతిదానియందును 1, 2 మూలశక్తులుండును. ఒక ఘనమిల్లిమీటరు నందలి ఇట్టి రక్తకణములసంఖ్య 8000.

శోషరసము:-దీనినే రసమనియు వాడెదరు. ఇది యును ఒకవిధమగు రక్తమే. ఇది శోషరసవాహి కలనుండి రక్తవాహికలలోనికి స్వీకరింపబడును. దేహమునందలి ప్రతికణమునకును చుట్టుకొని శోషరసవాహికలు వ్యాపించియుండును. శోషర సము శోషరసవాహికలగుండ తిరిగి హృదయ మునకు జేరుకొనును. రక్తము దేహముయొక్క ఉష్ణధర్మమును క్రమపరుచును. నాళరహితగ్రం థులలో నూరినరసములను గ్రహించి సూక్ష్మ జీవులను నశింపజేయును.

రక్తాభిసరణము.

దేహమునం దున్నరక్తమును, శోషరసమును ఎట్లు ప్రవహించుచున్నవి? హృదయము, రక్త వాహికలు, శ్వాసాశయముల వలన నిది జరుగు చున్నది. ఈమూడుసంస్థలు రక్తాభిసరణమునకు ప్రధానములై యున్నవి. కండరములతో గూడిన హృదయ మను పీడన యంత్రము (Pump) రక్తమును బలముగా రక్తవాహికలలోనికిత్రోసి వేయును. హృదయము యిట్లు ఒకతూరి ముడు చుకొనుచు, వెంటనే తెఱచు కొనుచుండును.

ఇట్లు సామాన్యఆరోగ్యముగలవానిహృదయము ఇట్లు నిమిషమునకు 72 తూరులు స్పందించును. హృదయము ముడుచుకొనుటకు అరసెకను పట్టును. దీనికి సంకోచమనిపేరు. తెఱచుకొనుట కు 3/10 సెకనులు పట్టును. దీనికి వ్యాకోచమని పేరు. హృదయస్పందనములు గలుగురీతి యీ క్రింద వివరింపబడును.

శ్వాసక్రియయందు రెండుపనులుజరుగును. దేహ మును ఎడతెగకుండ ప్రాణవాయువుతో పూరిం చుచుండుట, దేహమునందు తయారు అయిన కర్బను ద్వియమ్లజనిద మను పేరుగల చెడు గాలిని వెనువెంటనే వెలువరించుచుండుట. ఉర స్థలము వ్యాకోచము బొందినప్పుడు అవకాశము (Vacuum) ఏర్పడును. అప్పుడు వెలుపటిగాలి




## శ్వాసక్రియ

లోనికి చొచ్చుకొని వచ్చును. అప్పడు పీడన (Pressure) సమస్థితికి వచ్చును. వాయువునందు ప్రాణవాయువుగూడ నుండును. అది శ్వాసకోశ ములలోనికి చేరుకొనును. అది రక్తముచే నాక ర్షింపబడి దేహమంతటికిని వ్యాపించును. అందు వలన శ్వాసకోశములు సంకోచము నొందును. అప్పుడు లోపలిమురికిగాలి బయటికి గెంటివేయ బడును. దేహమునందు నశించినట్టియు, చెడి పోయినట్టియు పదార్థముల సంబంధమగు మాలి న్యములు ఈ గాలితో వెడలిపోవును.

## కండరములు

కండరములు రెండుతరగతులు: 1 స్వేచ్ఛాకండ రములు; దేహముయొక్క వెలుపలిభాగమున నుండి మనయిష్టానుసారము కదలింపవీలుగా నుం డును. అనిచ్ఛాకండరములు; మనయిష్టముతో నిమిత్తములేకయే దేహము నందలి లోపలి భాగమునందలి కండరముల గదలించుచుండును. కండరములు మెత్తగాను స్పంజివలె చిక్కగను నుండి మెరిగ నుండును. కంఠము, కబంధము దేహముయొక్క చివరలు మొద లగు వానియందు ఈకండరము లుండును. అనిచ్ఛాకండరములు మూడువిధములు. రక్తవాహికలలోపలనుండు కండరములు రక్తవాహికకండములు. అంతరవయవము లను కదలించునవి అంతరవయవ కండర ములు. హృదయమును కదలించుకండర ములు హృదయకండరములు.



కండరములు.

## పొరలు

రక్తమునందలి వివిధద్రవము లీపొరలచే వడియ కట్టబడును. అట్లు వడియకట్టబడిన ద్రవ్యములు కొన్ని అవయవములకు చమురుగాను, జారుదల గలిగించు పదార్థముగాను, పోషకపదార్థముగాను ఉపయోగపడును. ఈపొరలు ౩ రకములు ౧ శ్లేష్మపుపొర - బయటిగాలితో సంబంధము లేకుండ మూసియుండునట్టి ఉదరము, పుప్ఫుసము మొదలగువానిలోపల రసితోనేర్పడిన యిట్టిపొరయుండును. ౨ నోరు, ముక్కు, శ్వాసనాళములు, జీర్ణాశయము, ప్రేవులు, మూత్రపిండములు, మూత్రాశయము మొదలగు అవయవములలోనికి బయటిగాలి చేరు చుండును. అట్టివానియందు ఆమపుపొరయుండును. ౩ సంధులయందుండు కండరముల కప్పియుండు పొరకు సంధిబంధపుపొర అని పేరు. ఈ పొరలను త్వచలని వాడుదురు. శ్లేష్మత్వచ, ఆమత్వచ, సంధిత్వచ లని వీనికి పేరు.

ఈ పాఠములోని విషయములనే ముందు పాఠములో ఇంకను వివరముగా బోధించెదము.

## ప్రశ్నలు.

౧ మానవదేహమునందలి ప్రధానమైన ౩ భాగములు ఏవి?

౨ కబంధమునందలి అవయవములను పేర్కొనుము. సంగ్రహముగా నవి చేయుపనిని వివరింపుము.

౩ కణ మనగా నేమి? దేహమునందడిసూక్ష్మాతిసూక్ష్మమగు సంపూర్ణభాగ మగుటవలన నెట్టి ప్రాధాన్యము దానికి గలదు?

౪ ధాతు వన నేమి? వివిధధాతువులను ఉదాహరింపుము.

౫ దేహమునందు ప్రధానములైన ౬ మండలముల బేర్కొనుము?

౬ జీర్ణక్రియకు సంబంధించిన అవయవముల నన్నింటిని పేర్కొనుము. కవాటములను గూడ వివరింపుము?

౭ రక్తమునుగురించిన విషయమంతయు సంగ్రహముగా వివరింపుము. అది చేయుపని, అందలి వివిధభాగములు, ఆహారమునకు రక్తమునకు గల సంబంధములను వివరముగావ్రాయుము.

౮ జ్ఞానేంద్రియము లేవి?

౯ శ్వాసక్రియ యెట్లు జరుగుచున్నది?

౧౦ మూడుతెరగతుల త్వచలను పేర్కొని అవి యెచ్చట నుండునో వివరించునది.

---

N. B. కాగితమునకు ఒకవైపుననే సిరాతో వ్రాయవలెను. విడికాగితములుగా నుండవలెను. వానిని గుండుసూదితో కుట్టవలెను. ప్రశ్నసంఖ్యలు వేసి జవాబులు వ్రాయవలెను. సరియైన తపాలబిళ్లలు అంటించి మఱి పోస్టులో వేయవలెను. ప్రశ్నపత్రములు దిద్దుటకును, తిరుగు పోస్టేజీకిని కలిపి 3 అణాల ఖరీదుగల తపాల బిళ్లలను పంపవలెను.



# ప్రకృతి గృహ వైద్యము

## రెండవ పాఠము.

## అస్థినిర్మాణము

౧ వ పటము చూ. దంతములు మొదలగు చిన్న ఎముకలుగాక మానవదేహమున దాదాపుగ 200 ఎముకలు లేక అస్థులు ఉండును. అందు కొన్ని పొడవుగను, కొన్ని పొట్టిగను కొన్ని వెడలుపుగను, నింకను కొన్ని నిర్ణీతమైన రూపము లేకుండను ఉండును.




1 కపాలము
2-7 మెడపూసలు
3 జత్రువు
4 అంసఫలము
12 వెన్నుపూసలు
5 భుజాస్థి
6 తుంటియెముక
7 మణిబంధాధారాస్థి
8 కూర్పరాస్థి
9 త్రోటిక
10 మణికతములు
11 కరాంగుళ్యాధారాస్థులు
12 కరాంగుళ్యస్థులు
13 ఊర్వస్థి
14 మోకాలిచిప్ప
15 జంఘిక
16 జానుక
17 చీలమండయెముకలు
18 పాదాంగుళ్యాధారాస్థులు
19 పాదాంగుళ్యస్థులు

### అస్థిపంజరము (దట్టైము)

భుజాస్థి, ఊర్వస్థి, జంఘిక, జానుక, మణిబంధాధారాస్థి, కూర్పరాస్థి, మొదలగు కాలునకు, పాదములకు, బాహువులకు, హస్తములకు వ్రేళ్లకు సంబంధించిన యెముకలు పొడవుగా నుండు నెముకలలో చేరును.

ఈ పొడవుగా నుండు నెముకలు దేహము

నకు ఆధారముగా నుండును. కదలికయందును నీ యెముకలు ఉపయోగించుచుండును. ఈ ఎముకలకు మధ్యభాగమున నిలువుగా మూలుగుఅను పదార్థ ముండును.

వెడల్పుఎముకలలో అంసఫలకము, అనాముకాస్థి, ప్రక్కటెముకలు, కపాలాస్థులలో కొన్నియును జేరును. తక్కువస్థలములో ఎక్కువ భారమును వహింపవలసిన భాగములం దెల్ల నుండు నెముకలు పొట్టిగా నుండును. ఇట్టివి మణికట్టు, చీలమండ మొదలగు చోటులందుండును.

వెన్నుపూసలు వివిధపరిమాణములలో నుండును. త్రికాస్థి, త్రోటిక మొదలగునవి నిర్ణీతముకాని పరిమాణముగల యెముకలలో చేరును. కపాలమునందును కొన్ని యెముక లిట్టివి గలవు.

## వెన్నుపాము

వెనుకటి పాతమున దేహమున కంతటికిని ప్రధానమైన మధ్యభాగము వెన్నుపామనియు, అది 26 వెన్నుపూసలయొక్క కూడికయనియు; అది దేహమునందలి ఉరమును, ఉదరమును, శిరస్సును చేతులను నిలువబెట్టుచున్నదనియు వ్రాసియున్నాముగద ! ఇట్లు దేహమునుభరించుభాగము గనేగాక దేహక్రియలలో ప్రధానమైన క్రియలకీవెన్నుపామే ముఖ్యాధారమైన భాగము. వెన్నుపాముయొక్క ప్రాముఖ్యము నెంతవర్ణించినను అతిశయోక్తి కానేరదు. దానినిగురించి తెలిసికొనిన కొలదిని అది సృష్టిచిత్రములలో నెల్ల అత్యద్భుతమైనదని గ్రహింతుము. ఈ వెన్నుపామునకు మధ్యగా నొక కాలువ యుండును. మెదడుతో చేరిన యీ కాలువగుండ నాడీశక్తి ప్రవహించుచుండును. ఈనాడీశక్తియే దేహమునందలి వివిధములగు చలనముల కెల్ల హేతువై యున్నది. ఈనాడీశక్తితో సంబంధము లేకుండ దేహమునం దెట్టి స్వల్పమగు కదలికయును గలుగదు.

మెదడునుండి నాడీతంతువులు (తీగెలు) ఈ వెన్నుపూసలలోనుండి ప్రవహించు చుండును.




2వ పటము.

మెడపూసలు, వెన్నుపూసలు, నడ్డిపూసలు, ముడ్డిపూసలు.

ప్రతి వెన్నుపూసలో నుండియును రెండేసి నాడీతంతువులు శాఖలుగా చీలి దేహముయొక్క కుడి యెడమలకు వ్యాపించును. అచట నుండి యవి కోటానుకోట్లగు శాఖలుగా చీలి దేహమునందలి ప్రతిభాగమునకు వ్యాపించును.

వెన్నుపామును ముందు వెనుకలకును ప్రక్కలకును త్రిప్పునపుడును, వలయాకారముగా త్రిప్పునప్పుడును, మెలివేయునప్పుడును ఆ నాడీ సంహతుల కెట్టి ఆపదయును కలుగకుండునట్లు వెన్నుపూసలు నిర్మింపబడియున్నవి.

ఇచటనే వెన్నుపూసలు తమతమ స్థానములలో సరిగా నిమిడియుండక పోవుటవలనను మాలిన్యములు చేరుటవలనను, చుట్టుప్రక్కలనుండు ధాతువులయందును అవయవములందును సరియైన సమరసత (సామరస్యము) లేకుండుటవలనను అనేక వ్యాధులు గలుగును.

వెన్నెముకయొక్క వెనుకభాగము పృష్ఠభాగమనియు ముందుభాగమునకు పురోభాగమనియు పేర్లు. వెన్నుపూసలయొక్క పృష్ఠభాగము వ్రేళ్ళతో స్పృశించి తెలుసుకొన వీలుగానుండును. వ్రేలికి తగులునట్లు ఎత్తుగానున్న భాగమున వెన్నుపూసలయొక్క మెత్తైన భాగముండును. అవి ఒకదానితో నొకటి కలిసి వెన్నుపాము అగును. అందులో గలుగు నెగుడు దిగుడు కలయికవలన వ్యాధులు గలుగును. వానిని చేతితో తడవి తెలిసికొని చక్కజేయవచ్చును. ఈవిసరములు వేరొకపాఠమున మీకు బోధింతుము.

ఈ భాగమును శ్రద్ధగా చదివి జ్ఞాపకముంచుకొనిన వెన్నెముకను సరిజేసి రోగములను కుదుర్చుట (కశేరుకాసమీకరణ చికిత్స) నేర్చుకొనుటకు వీలుగానుండును.

వెన్నుపూస నొకదానిపై నొకటి పేర్చినట్లును, అందులో కొన్నిటి పల్లములలో, వేరొకదాని మెరకభాగము లిమిడియుండునట్లును నిర్మింపబడియున్నవి. అవి యుపాస్థులచేత గట్టిగా కట్టబడియున్నవి. వానిమధ్యసందులున్నవి. ముందుకు వంగినపుడవి పెద్దవగును. వెనుకకు వంగినపుడు అవి సంకోచమునొందును. ప్రక్కలకు వంగుటకును, వలయముగాతిరుగుటకును వెన్నుపూసలలో సావకాశము లున్నవి. అవి క్రొత్తవాడు తెలిసికొన జాలడు. అలవాటుపైని ఆసందులను కనిపెట్టవచ్చును.

వెన్నుపూసలకు మధ్యభాగమున పైనుండి క్రిందికి ఒకరంధ్రము మున్నది. అది వెన్నుపాము మొత్తమున కంతటికిని కలిసి పైనుండి క్రిందికి వ్యాపించియుండును. మెదడునుండి ముడ్డిపూసవరకును పైనుండి క్రిందికి ఈరంధ్రముగుండ మజ్జానాడి వ్యాపించియున్నది.

ప్రతివెన్నుపూసకును ప్రక్కలను సయితము రంధ్రములున్నవి. వీనికి మజ్జాంతర్నాడులని పేరు. (Intervertebral foramen). వానిగుండ మజ్జానాడినుండి చీలిన శాఖలు దేహమంతయు వ్యాపించియుండును. ఇట్టివి 31 జతలున్నవి.

మనిషియొక్క పొడుగును బట్టియును, మానవుని యొక్క కబంధముయొక్క పొడుగునుబట్టియు వెన్నుపాముయొక్క పొడుగేర్పడి యుండును. అనగా వివిధమానవులయందు అది వివిధపరిమాణములలో నుండును. బాగుగా నెదిగినవారి వెన్నుపాము ౨౪ మొదలు ౨౮ అంగుళముల నిడివి యుండును.

ప్రతి వెన్ను పూసలోనుండియు మెదటినుండి మజ్జానాడి క్రిందికి వ్యాపించియుండుట వలనను, అందుండియే వెన్నుపూస కొకటింటికిని రెండేసి నాడులచొప్పున దేహమున కంతటికిని నాడులు వ్యాపించి యుండుటవలనను ఈ భాగమే మానవదేహనిర్మాణములో మిక్కిలి ప్రధానమైనదని గ్రహింపవలెను.

### క పా ల ము.




3 వ పటము – కపాలము.

1 లలాటాస్థి, 2 శిరఃపృష్ఠాస్థి, 3 స్ఫీనాయిడ్ భాగము. 4. సీమంతాస్థి, 5 జిహ్వాస్థి.

కంధరపూస(Atlas): దీనినే మేరుపూసఅందురు. ఇది సన్నముగా మొన దేలియుండును. ఇది వెన్నుపూసలలో నెల్ల పై భాగమున నుండును. దీనిపైన కపాలముయొక్క క్రింది భాగము నిలిచి యుండి, వలయాకారముగను, ప్రక్కలకును క్రింద మీదులకును త్రిప్పననువుగా నిమిడిక గలిగియుండును.

కపాలము రెండుభాగములుగా నుండును. ౧ పుఱ్ఱె ౨ ముఖము. ఈ రెండు భాగముల లోను కలిసి ౨౨ చిన్నయెముక లున్నవి. (3 వ పటము చూ.)

లలాటాస్థి: నుదురుగా నేర్పడిన వంపుగలిగిన యెముక ౧

సీమంతాస్థి: చెవులకు పైనుండు వెడలుపైన యెముకలు ౨

శిరఃపృష్ఠాస్థి: కపాలముయొక్క వెనుకభాగమున దిగువగానుండు యెముక. ఇందుండియే వెన్నుపాము ప్రారంభమగును. అందుకు తగిన సావకాశమిందున్నది.

కర్ణాస్థులు: చెవి మొదలగు అవయవము లిమిడియున్న యెముకలు ౨

స్ఫీనాయిడ్, ఎథ్మాయిడ్ (జల్లెడయెముక) అనే యెముకలును ఇవి పుర్రెలో నున్నవి.

ఇక ముఖమునం దీక్రిందియెముక లున్నవి.

పైదవుడయెముకలు ౨.

క్రిందిదవుడయెముక ౧.

దవుడయెముకలు ౨.

అంగిలి యెముకలు ౨.

నాగలియెముక (Ploughsarebone) ౧

జిహ్వాస్థులు ౨.

నాసారంధ్రపు టెముకలు ౨.

కన్నీటియెముకలు ౨.

### కూ ప క ము.

తుంటియెముకలు: వీనికే అనామకాస్థు లని పేరు. ఇవి రెండును, త్రికాస్థి, త్రోటికతో కలిసి కూపక మగును. ఇవియన్నియు అస్థిపంజరమున స్పష్టముగా చూడవచ్చును. మగవారి కూపకము ఆడవారికూపకమునకన్న బలమైనదిగా నుండును.

### ఉ ర ము

దీనినే ఱొమ్ము అందురు. కబంధము నందలి పైభాగమున నుండు పక్కటెముకలును, ఉరోస్థి (రొమ్మెముక) వెన్నుపూసలు (Dorsal vertebrae) ఈ భాగమునందుండును. వెన్నుపామునుండి వెన్నుభాగమునందు కుడివైపున పండ్రెండు ప్రక్కటెముకలును ఎడమవైపున

పండ్రెండు ప్రిక్కటెముకలును ముందునకు వ్యాపించియుండును (అస్థిపంజరము చూ). అవి క్రిందికి వంపుదేలి ముందునకు వ్యాపించియుండును. వెనుక వెన్నుపూసలు, ప్రిక్కలందున ప్రిక్కటెముకలును, ముందువైపున రొమ్మెముక కలిసి ఉర మను పేరుగల ఒకపెట్టె డొల్ల యేర్పడినది. ఈ డొల్లకు ఆవరణగా నేర్పడిన ప్రిక్కటెముకలు మొదలగునవి ఉపాస్థియను కండరసంహతులచే ఒకదానితో నొకటి కలుపబడియున్నవి. ఈ కండరసంహతులయందు మంచి స్థితిస్థాపకగుణము గలదు అందువలన మనము గాలిని పీల్చునప్పుడవి విరివిజెంది డొల్ల పెద్దదగును. గాలిని వదలివేసినపుడు ముడుచుకొనుట వలన డొల్ల చిన్నదగును. ౧౨ ప్రిక్కటెముకలలో పైనున్న ౭ జతలే ఒకదానితో నొకటి కలసియున్నవి.

ఈమిగిలిన ౫ జతలలోను, పైనున్న రెండుజతలును దూరముగా నుండి ఉపాస్థులు మాత్రము కలిసియుండును. క్రింద నున్న రెండుజతలు మొండిఎముకలు; అవి ముందువైపున కలుపబడక విడిగా నుండును.

బాహువులు.

జబ్బయందు భుజాస్థి ౧, దండ చేతిఎముకలు ౨, మణిబంధమునకు సంబంధించిన ఎముకలు ౮, చేతిఎముకలు ౧౯, జత్రువు (Clavicle) ౧, అంసఫలకము ౧, భుజబంధము ౧, కలిసి ఒకబాహువు అగును. అంసఫలకము ముక్కోణాకారముగ వెడలుపుగా నుండును. ఉరమునందు వెనుకభాగమున పైగా నుండును.

జత్రువుయొక్క ఒకచివరభాగము రొమ్మెముకతోను, రెండవచివర అంసఫలకముతోను అతుకబడియున్నది.

జబ్బయందు భుజాస్థి యనుపేరుగల పొడుగుపాటి గుండ్రని యెముక యున్నది. దండచేతియందు కూర్పరాస్థి, మణిబంధాధారాస్థి అను రెండెముక లున్నవి. మణికట్టు, అరచేయి, వ్రేళ్ళ యందు కలిసి ౨౭ యెముక లున్నవి.

కాళ్లు.

ప్రతికాలునందును రెండు అనామకాస్థులుండును. తొడయందు ౧ ఊర్వస్థి యుండును. ఇది చాల బలమైన భాగము. మోకాలునందు ౧ మోకాటిచిప్ప యుండును. దిగువకాలియందు జంఘిక, జానుకయను నెముక లుండును. చీలమండయందు ౭ ఎముక లుండును. పాదమందు ౫ పాదాంగుళ్యాధారాస్థులును, వ్రేళ్లయందు ౧౪ పాదాంగుళ్యస్థులును ఉండును.

నాడీమండలము.

దేహమునందు ఐచ్ఛిక మైనట్టియు, స్వతంత్రమైనట్టియు కదలికలు నాడులవలననే గలుగుచుండును. వివిధములగు అవయవములయొక్క క్రియలు ఈ నాడులవలననే సామరస్యమును బొందును.

స్మృతి, ఇచ్ఛ, స్వతంత్రమగు చలనము, చూచుట, వినుట, రుచి చూచుట, హృదయస్పందనములు, శ్వాసక్రియ, జీర్ణక్రియ మొదలగున వన్నియు నాడులవలనను, నాడులద్వారాను జరుగుచుండును.

ఆరోగ్యవంత మగు దేహము ఒకసంఘమును బోలియుండును. అందు కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, సాలె, తెలుకుల, మాదిగ, కృషీవలుడు, వర్తకుడు, సంరక్షకుడు మొదలగు వృత్తులవా రెవరి వృత్తులను వారు చేసికొనుచు సంఘముయొక్క సమష్టిక్షేమమునకు ప్రయత్నించుచు ఒకని

యాజ్ఞానుసారము నడుచుచుందురుగద. అట్లనే మెదడుయొక్క ఆజ్ఞలకు లోబడి దేహమునందలి వివిధావయవములు పనిచేయుచుండును. వివిధము లగు అవయవములకు మెదటినుండి నాడుల ద్వారా ఆజ్ఞలు వచ్చి చేరుచుండును. వివిధావయవములనుండియు వానిద్వారా వార్తలు మెదడునకు చేరుచుండును.

వానియొక్క స్థానమునుబట్టియు, వానియొక్క పనులనుబట్టియు నాడులు రెండు విభాగములుగా పేర్కొనబడినవి: ౧ మెదడు మజ్జామండలము, ౨ స్వతంత్ర నాడీమండలము.

ఇందు మెదడుమజ్జామండలమున మెదడు, మజ్జాముఖము, మజ్జ, మెదడునాడులు, మజ్జానాడులు చేరియున్నవి.



4వ పటము

బృహన్మస్తిష్కము. దీనినే పెద్ద మెదడు అందురు M చిన్న మెదడు. L మజ్జాముఖము. A నాడీముడుల సంబంధమగు కుటికలు.

స్వతంత్ర నాడీ మండలమున నాడీ ముడులును, వానిని మజ్జానాడులతో కలుపునట్టి నాడీసంహతులు నున్నవి.

దేహమునందెల్ల మెదడే నాడీమండలమునందెల్ల ప్రధానమైన భాగము. అందనేక నాడులమూలము లున్నవి. అది కపాలమునం దున్నది. 3 ప్రధానభాగము లిందుండును. తలలో ముందు వెనుకవైపులను పైభాగమునను మధ్యను నుండునట్టిది పెద్దమెదడు. దీనికి బృహన్మస్తిష్కమని పేరు. దానికి దిగువ చిన్న మెద డున్నది. దీనికి గోధ్రమని పేరు. దానికి దిగువగా మజ్జాముఖమున్నది.

ఈ మూడింటిలోను మజ్జాముఖము చాలచిన్నది. ఇందుండియే మజ్జానాడులన్నియు ఆరంభమగును అనగా మజ్జానాడి యిచటనే ఆరంభమై దిగువకు వ్యాపించియున్నది.

మెదడును, మజ్జానాడియును చాల మెత్తనిపదార్థముతో నేర్పడియున్నవి. అందువలన మెదడు కపాలమునందును, మజ్జానాడి వెన్నుపామునందును భద్రముగా కాపాడబడుచున్నవి. ఈ యెముకల ఆవరణములోపల నింకొకఆవరణయును గలదు. అది మందముగను, జిగివిగను నుండును. దీనికి(Dura mater) అని పేరు. ఈ ఆవరణకు నింకనులోపల శ్లేష్మపుపొర (రసివంటి పదార్థముగల పొర - (Serous membrane) యుండును. అది జిగురుగను, జారుదలగలిగియునుండును. ఈ పొర యుండుటవలన బయటిదెబ్బలు సూటిగాలోపలి మెత్తనిపదార్థమునకు చేరకయుండును. మరియు మెదడుపదార్థమునకు చలన క్రియయందు స్వేచ్ఛయు సావకాశమును బాగుగా నుండును.

దానిలోపలసన్నరక్తనాళికలుదట్టముగా అల్లినపొరయుండును. ఇందుండియే మెదడునకు కావలసిన పోషకపదార్థములు చేరుచుండును. మరియు నిచటనే మెదడునందలి మాలిన్యములు ఆకర్షింపబడి వెలువరించివేయబడుచుండును. ఈరక్తనాళికలు పీచువంటిపదార్థముతో గూడిన ఒక పొరలో నిమిడియుండును. ఈరక్తనాళికలద్వారా మెద

డునకు దేహమునందలి రక్తమంతటిలోను 1/5 అయిదవ భాగము వచ్చిపోవుచుండును. మెదడు మిక్కిలి చురుకుగా పనిచేయవలసినభాగము గనుకనే యింత యెక్కువ పరిమితి గలరక్త మీ ఒక్క అవయవమున కవసరమగు చున్నది. మెదడులోనికి పోవు రక్త మెక్కువ పరిమితి గలది. మరియు, రక్త మెంత నిర్మలముగా నున్న, మనమెదడు అంత చురుకుగను, నిశితముగను నుండును.

బృహన్మస్తిష్కమే మనస్సు పనిచేయు ప్రధానావయవ మని పరిశోధనలవలన నిరూపింపబడినది. మానసికనైతిక క్రియ లిందుండియే ఆరంభమగును. మానసిక నైతిక శక్తుల కిది ముఖ్యమగు అవయవము.




5 వ పటము.

5 వ పటమునకు వివరణము.

ఇందు చలననాడులలో ఎచ్చట దెబ్బ తగిలిన నే భాగము పనిచేయదో అది వివరింపబడినది.

A అనుచోట దెబ్బ తగిలిన దైశికమగు పక్షవాతము కలుగును.

B అనుచోట దెబ్బ తగిలిన దాని యెదుటివైపున పక్షవాతము కలుగును.

C అనుచోట దెబ్బ తగిలిన అదేవైపున మెదడుయొక్క 3 వ నరము పనిచేయదు. ముఖనాడులు పనిచేయవు. ఎదురువైపున చేయి కాలు చచ్చుబడును.

D అనుచోట తగిలిన దెబ్బవలన రెండ[illegible] వాతము గలుగును.

E అనుచోట తగిలిన దెబ్బవలన ము[illegible] రెండవవైపు కాలు చేతులును చచ్చుబడును.

F అనుచోటతగిలిన దెబ్బవలన కాలు చే[illegible]చచ్చుబడును

G అనుచోట తగిలిన దెబ్బవలన అదేవైపున పక్షవాతము గలుగును.




బృహన్మస్తిష్కము రెండు అర్ధగోళములుగా నుండును. ఇందు పెద్దముడుత లుండును. (౪ వ పటము చూ) దేహమునందలి కుడిభాగము నందలి అనుభవములు మెదడుయొక్క యెడమ అర్ధగోళమునందును, ఎడమభాగము నందలి అనుభవములు కుడి అర్ధగోళమునందును దోచుచుండును. మజ్జామున కుడివైపు నాడు లెడమవైపునకును, ఎడమవైపు నాడులు కుడివైపునకును మారుటవలన నిట్లు గలుగు చున్నది. (౬ వ పటము చూ)

మెదడునందును, మజ్జానాడియందును నుండు పదార్థము బూడిదరంగుగ కొంతయును తెల్లరంగుగ కొంతయు నుండును. బూడిదరంగు గల పదార్థము మెదడుయొక్క వెలుపలభాగమునందుండు ముడతలలో నుండును. మజ్జానాడియం దన్ననో తెల్లనిపదార్థము వెలుపల

ముండును. లోపలిభాగమున నీ బూడిదరంగు పదార్థముండును. దేహమునం దన్నిభాగము లందును నుండునట్టి నాడీముడులయందును బూడిదరంగుపదార్థమే యుండును. ఈ బూడిదరంగు పదార్థమునాడులయందలిఅనుభవముల (impressions) ను స్వీకరించి నాడీతంతువులద్వారా నాడీకేంద్రములకు చేర్చి నాడీశక్తిని పెరేచును.

తెల్లనిపదార్థము నాడులయొక్క మూలపదార్థమై యుండును. చూచుట కది తెల్లని పదార్థమువలెమాత్రమే కాన్పించును. నిజ మేమన నాడులసంబంధ మగు తంతువులు అందు వ్యాపించియుండును. ఈ తంతువులు దేహమునందలి ధాతువు లన్నిటిలోనికి వ్యాపించియుండును. నాడీశక్తి యీ తంతువుల వెంట ప్రవహించుచుండును. ధాతువులలోనుండి యివిబయలు దేరునప్పుడు విడివిడిగానుండి, రానురాను కొన్ని తంతువులు కలిసి ఒక యేసెలకట్టగా నేర్పడును. అట్టి యేసెలకట్టలు కొన్ని కలిసి ఒకనరమగును. నరములు నాడీశక్తిని వహించును. దేహముయొక్క అనుభవములను నాడులకును, అక్కడినుండి మెదడునకును చేర్చును.

నాడులయందలి బూడిదరంగు పదార్థ మేమి చేయును? తెల్లనిపదార్థ మేమి చేయును? అను విషయము తేలికగా తెలియవలెనన్న నీ క్రింది యుదాహరణము పనికివచ్చును.

బెజవాడవంటిపట్టణములోఒకానొకమూల విద్యుద్దీపము వెలుగలే దనుకొనుడు- ఒకరది తెలిసికొని విద్యుచ్ఛక్తి ఉత్పత్తిస్థానమునకు తెలియ జేసిరి. అక్కడి అధికారి యేదో యంత్రమును ద్రిప్పినంతనే అదివరకు వెలుగని విద్యుద్దీపము వెలిగినది. అట్లే కాలిమీద చీమ కుట్టినది. ఆ సంగతిని జ్ఞాననాడులు మెదడునందలి బూడిదరంగుపదార్థమునకు చేర్చినవి. ఆ మెదడునందలి బూడిదరంగుగల పదార్థము చేతికి సంబంధించిననాడిని ప్రేరేపించినది. చేతితో ఆ భాగమును రుద్దినంతనే బాధ ఉపశమించును.

స్వతంత్రనాడులయొక్కపని యిట్లు జరుగుచుండును. దేహమునందలి యితరపనులన్నియు జరుగుటకు వెన్నుపామునందుండు మజ్జానాడి ద్వారా జరుగుచుండును.

## వెన్నుపాము (మజ్జా)—(Spinal Cord).

మజ్జాముఖమున ఆరంభించి వెన్నుపూసల లోని రంధ్రముగుండ క్రిందికి వెన్నుపాము వ్యాపించియుండును. ఈ నాడికి ముందువెనుకలయందు తెల్లనిపదార్థము దిండ్లవలె నుండును. లోపల బూడిదరంగుగల నాడియుండును. ఇందు కుడియెడమలయందు రెండేసి శృంగములున్నవి. రెండు పురోశృంగములు రెండు పృష్ఠశృంగములు నని పేరు. [౬ వ పటము చూ.]

వెన్నుపామునుండి ౩౧ జతల నాడులు బయలుదేరి దేహమంతటికిని వ్యాపించియున్నవి. ఒక్కొక్కపూసనుండి ఒక్కనాడిముందు వెనుకలకు వ్యాపించియుండును. చర్మముమీాదికి వ్యాపించిన నాడులు స్పర్శ మొదలగు వానిని దెలుపునుగాన నవి జ్ఞాననాడు లనబడును. దేహములోనికి వ్యాపించిన నాడులు చలనమును కలిగించును గాన నవి చలననాడు లనబడును. వెన్నుపాములో నుండి చీలిన నాడులు ఆయా ప్రక్కలనుండు అవయవములకును, చర్మమునకంతను వ్యాపించియుండును.




6 పటము. మెడపూసలలో నొకదాని అడ్డుకోత.

వెన్నుపామునుండి బయలుదేరు నాడు (13) లిందు చూడవచ్చును. ఇది మెడపూసలలో నొకదాని అడ్డుకోత. నాడుల సంబంధమగు పీచుపదార్థము తెల్లగా నుండును. అది యిందు నల్లరంగుతో చూపబడినది. లోపలనుండు బూడిదరంగుపదార్థము ఇందు తెల్లగా చిత్రింపబడినది.

దేహముమీద స్పర్శాది అనుభవములు రంగుగల పదార్థములోనికి చేరి అచటినుండి జ్ఞాననాడులవెంట వెన్నుపాములోని బూడిద బృహన్మస్తిష్కములోనికి జేరును. అప్పుడ







7 వ పటము. వెన్నుపాములోనుండి చీలిన నాడులజత.

మన కా అనుభవము తెలియును. అచటనుండి చనలనాడులయందు చైతన్యము గలిగి అది అను భవముగలచోటికి చేరుకొనును. స్వేచ్ఛానాడీ మండలములోని నాడులకు ఆజ్ఞ మెదడునుండి బయలుదేరి మజ్జాముఖముగుండ వెన్నుపాములో నుండి వ్యాపించును. అందువలన వాని చలనము మనయిచ్ఛ ననుసరించియుండును. కనుక నేవానికి స్వేచ్ఛానాడు లని పేరు.

స్వతంత్రనాడులయొక్క ప్రేరేపణవలన స్వతంత్ర నాడీమండలము పనిచేయును. వానియొక్క చల నము మనకు తెలియదు. అందువలన వానిని అనిచ్ఛాకండరములని పిలుతుము. వానిని నడుపు నట్టి నాడులకు స్వతంత్రనాడులని పేరు.

## స్వతంత్రనాడీమండలము.

వెన్నుపామునకు రెండువైపుల నాడీముడులుగల రెండుగొలుసుల పంక్తులున్నవి. వీనికే స్వతంత్ర నాడీమాల యని పేరు. ఇవిగాక హృదయము, జీర్ణాశయము, తల, మెడ మొదలగు వాని యందును నాడీకేంద్రము లున్నవి. నాడీసంఘా తులచే నివి యొకదానితోనొకటి అతుకబడి యున్నవి. మరియు మజ్జతోను, చలననాడులతో ను, జ్ఞాననాడులతోను ఇవి కలుపబడియున్నవి. వానినుండి సూక్ష్మాతిసూక్ష్మములగు నాడులు జీర్ణమండలము వెంటను రక్తనాళములవెంటను, శ్వాసాశయములవెంటను, దేహమునందలియితర అవయవభాగములవెంటను వ్యాపించియుండి వానియందు చలనములను గలిగించుచుండును. ఇట్టినాడులు అనేకము ఒకచోటచేరి ఒక్కొక్క కూటముగా నేర్పడును. వానికే నాడీకూటము లనిపేరు. ఇట్టి వానిలో ఉదరమునందలి అనా హతచక్రము (Solarplexus) ఒకటి.

జీర్ణక్రియ, శ్వాసక్రియ, రక్తప్రసరణము మొదలగు క్రియ లన్నియు స్వతంత్రనాడుల వలననే నడుపబడుచుండునని వ్రాసితిమిగద. ఆరోగ్యముగానుండి ఆయా అవయవములయం దెట్టి నిరోధములును లేకుండ సక్రమముగా జరు గుచున్నంతకాలమును మనకు వానిచలనము తెలియనంత సౌమ్యముగా జరిగిపోవుచుండును.

ఈ రెండు నాడీమండలములును బాగుగా కలిసి యున్నందున దుఃఖము, భయము, క్రోధా దులవలన అంతరవయములందును మార్పులు జరిగి ఆరోగ్యము చెడిపోవును. అట్లే ఆనందము, సంతోషము, ప్రేమ, భక్తి, విశ్వాసములవలన నవి బలపడి ఆరోగ్యము అభివృద్ధియగుచుండును.

## శిరోనాడులు.

మెదడునుండి ౧౨ జతలనాడులు బయలుదేరి జ్ఞానేంద్రియము లోపలికి వ్యాపించియున్నవి. వినుట, చూచుట, వాసనచూచుట, రుచిచూ



8 వ పటము శిరోనాడులు.

చుట, నోరాడించుట, ముఖమును కదలించుట మొదలగువానికి వీలుగా నేర్పడియున్నవి. (౭ వ పటము చూ.)ఇచ్ఛానాడులను అదుపులో

నుంచునది గోధ్రము. ఆనడక కేదైన ఆటంకము కలిగినప్పుడు మానవునినడకయొక్క తీరు చెడును. దీనిని త్రాగుబోతులయందు చూడవచ్చును. మజ్జాముఖముయొక్క ముందువైపున మెదడునుండి బయలుదేరిననాడులు కుడియెడమలకు మారుననియిదివరకే వ్రాసియున్నాము. (౫ వ పటము చూ) శ్వాసక్రియ జరుగుటకు అవసరమగు నాడి యిందుండి బయలుదేరును.

## ప్రశ్నలు.

౧ దేహమునందలి పొడుగుఎముకలను పేర్కొని వానియొక్క క్రియలను తెలుపునది.

౨ వెన్నెముక, అందలిభాగములు, వానియందలి ముక్కలను వర్ణించుము.

3 వెన్నెముకయొక్క పనియేమి? వెన్నెముకయొక్క వెనుకవైపేది? వెన్నుపూసలకు వెనుకవైపుఏమి?

౪ దేహమున నాడీమండలమువలన జరుగు పనియేమి? నాడీమండలమునందలి ౨ ప్రధాన భాగముల వివరించుము. మెదడును వర్ణించుము.

౫ ఒకడు తూలుచు నడచుచున్నాడు. వాని మెదడులో ఏప్రత్యేకభాగము చెడియున్నది?

౬ వెన్నుపూసను కోసినప్పు డెట్లుండునో వర్ణింపుము. వెన్నుపూసనుండి యెన్నిజతల నాడులు బయటికి వ్యాపించియుండును?

౭ మెదడు మజ్జానాడీమండలమునందు బూడిద రంగుగలపదార్థమును తెల్లనిపదార్థమును వర్ణించి అవి మెదడులో ఏది యెచ్చట నుండునో వ్రాయునది.

౮ నాడీకూట మననేమి? అట్టి యొకకూటమును పేర్కొని అది యెచ్చట నున్నదో వ్రాయుము.

౯ ఒక అనుభవము మెదడున కెట్లు చేరునో వ్రాయుము చలనక్రియ యెట్లు జరుగుచున్నది? స్వేచ్ఛాక్రియ లన్నియు నెచ్చట ఆరంభమగును?

౧౦ మానసికములగు ఉద్రేకములవలన మన జీర్ణక్రియ ఎట్లు బాధింపబడును?



# ప్రకృతి గృహ వైద్యము

మూడవ పాఠము

## దేహమునందలి అవయవములు

### ౧ కండరములు

కండరములు కదలించుటవలన దేహమునందలి వివిధభాగములు కదలింపబడును. రక్తవాహికలు, శోషరసవాహికలు, నరములు, మొదలగువానికి దెబ్బ తగులకుండునట్లు కాపాడుచుండును. తీరా దెబ్బలు తగిలినప్పుడు ఆ దెబ్బలు ఆయాభాగములకు చెఱుపుచేయకుండునట్లును కాపాడుచుండును కూపకము, ఉదరము, ఎదురురొమ్ము మొదలగు ప్రాణావయవము లున్న భాగముల కీకండరము లావరణగా నేర్పడి యుండును.

మానవకండరమునందలి
ఒక తంతువు
800 రెట్లు పెంచబడినది.



1 వ పటము.




2 వ పటము.

తంతువులలో విడదీయబడిన అతిసూక్ష్మమైన తంతువులు. a కన్న b యును దానికన్న c యును చిన్నవి. అన్నిటిలోనికి d అత్యంతసూక్ష్మమైనది.




3 వ పటము.

కండరతంతువులతో
సంబంధముగల
ఒక నరాగ్రము.

నడచుట, పైకెత్తుట, వంగుట, మెలివేయుట, మొదలగు కదలికలే కాక తినుట, నములుట, మాట్లాడుట, కనురెప్పలను తెరచుట మూయుట మొదలైన చిన్నచిన్న కదలికలు సైతము యీకండరములవలననే జరుగుచుండును.

ఈ కదలిక లన్నియు కండరములయందలి స్థితిస్థాపకగుణమువలననే గలుగును - అనగా ముడుచుకొనునప్పుడు పొట్టిదై లావెక్కుటయు, సాగినప్పుడు సన్ననై పొడుగెక్కుటయు జరుగుచుండును. అనిచ్ఛాకండరములు నాడులయొక్క

అదుపునకు లోబడి నాడులవలన నడుపబడు చుండును. స్వేచ్ఛాకండరములు మనయొక్క ఇచ్ఛననుసరించి నరములద్వారా ప్రేరేపింపబడి పనిచేయుచుండును. గిల్లుట, చరచుట, మెలివేయుట, సూదితో పొడుచుట మొదలగు పనులవలన నరములయందు చైతన్యము కలుగును. అప్పుడు నాడులు కదలింపబడును.



4 వ పటము.

ఒకయేసెలకట్ట పెంచిచూపబడినది.




5 వ పటము.

2 యేసెలతంతువులు పెంచి చూపబడినవి. అధికశ్రమవలన అందొకటి తెగిపోయినది.




6 వ పటము.

ముఖమందును, మెడయందును నుండు కండరములు.

ఒకకండర మారోగ్యవంతమై యున్నయెడల నాడులయందు ప్రేరేపణ గలిగి వెంటనే చురుకుగా కదలును.




7 వ పటము.

వెనుకవైపున నుండు కండరములపైపొర.

సంధులను ముడుచునట్టి కండరములకు 'సంకోచస్నాయువు' లనిపేరు. ముంజేతియందుండు కండరము ముంజేతిని పైకిముడుచుకొనునట్టుచేయును. తొడకు వెనుకవైపుననున్న కండరము మోకాలునకు దిగువనున్న భాగమును ముడుచుకొనునట్టు చేయును. ముడుచుకొనినట్టిభాగములను తెరచుకొనునట్టుచేయు కండరములకు 'వితానస్నాయువు' లనిపేరు. కుడియెడమలకు త్రిప్పుట

కుపయోగించుకండరములకు మెలివేయుకండరము లని పేరు. కబంధమువంకకు చేతులను, కాళ్లను ఆకర్షించునట్టి కండరములకు 'వ్యూహస్నాయువు' లని పేరు. కబంధమునుండి కాలు చేతులను వెలుపలికి తెరచునట్టి కండరములకు 'అపకర్షకస్నాయువు' లని పేరు. ఇట్టివి భుజములందును, తొడయొక్క వెలుపలిభాగమునందు నుండును.



8 వ పటము.
రొమ్మునందును పైచేతియందును నుండు కండరములు.

ఇచ్ఛాధీనకండరములు రెండుగాని మూడుగాని ఎముకల కంటియుండి వానిని ఒకదానితో నొక దానిని కలుపుచు వానిని కదలించుచుండును. కండరముయొక్క కదలనిభాగమునకు మొదలనియు, కదలునట్టిభాగమునకు చివర అనియు పేరు. కండరములను చుట్టుకొని పీచువంటి పదార్థముతో తయారయినఒకపొర యున్నది. దానికి 'సంధాయకధాతు' వని పేరు. ఇది ఎముకకును కండరమునకును మధ్య నుండి వారెంటిని కలుపుచుండును.



9 వ పటము.
ముంజేతియొక్క వెనుకపైపున నున్న కండరములు.

10 వ పటము.
ముంగాలునందలి కండరములు.

మొత్తముమీద దేహములో నున్న కండరములన్నియు కలిపి దాదాపు ౪౦౦ ఉండును. ఇది కాక వెన్నుపామువెంట లెక్కలేనన్ని చిన్న చిన్న కండరము లున్నవి. అవి వెన్నుపామును విరివిచేయుటకును ముడుచుటకును వలయాకారముగా త్రిప్పుటకును మెడను ముందునకును వెనుకకును వంచుటకును; తలను ప్రక్కలకు త్రిప్పుటకును సహాయపడును. ఇవికాక ప్రక్కటెముకలకు మధ్యభాగములందు రెండేసిజతల కండరము లుండును. గాలిని లోనికి పీల్చినపుడు

ప్రక్కటెముకలు విరివిజెందుటకు ఒక జతయును, గాలిని వెలుపలకు వదలివేసినప్పుడు ప్రక్కటెముకలు ముడుచుకొనుటకు ఒక జతయును ఉన్నవి.



11 వ పటము.

ముంజేతియందలి ముందరి వైపుకండరములు.



12 వ పటము.

ముంజేతియందలి నరములు

ఇంకొక కండర మున్నది. అది ఉరమునకును ఉదరమునకును మధ్య నున్నది. ఉదరమునందలి అవయవములకు పైగా గొడుగు ఆకారముగా నున్న యీ కండరమునకు 'విభాజక' మని పేరు. శ్వాసను లోనికి పీల్చినప్పుడు ఇది దిగువకు పోవును. శ్వాస వదలి వేసినప్పుడు ఇది పైకి పోవును. కండరములయందెల్ల రక్తవాహికలు దట్టముగా వ్యాపించియున్నవి. కండరములకు ఎగువను, దిగువను, మధ్యను, ప్రక్కలను కూడ దట్టముగా రక్తనాళములు వ్యాపించియున్నవి.

# సంధులు

ఒక యెముకతో నింకొక యెముక కలియుచోటునకు 'సంధి' యని పేరు. అవి రెండును సంధిబంధనములతోను ఉపాస్థులతోను కలుపబడియుండి కదలింప వీలుగా నుండును. ఇట్టిసంధులు మూడు తెరగులుగా నున్నవి.

స్థిర సంధులు: ఇట్టివి కపాలమునందున్నవి. కపాలమునందు అనేకములగు ఎముకలు కలిసి యున్నవి. అయినను అవి కదలవుగాన వానిని స్థిరసంధులందుము.

మితచలనముగల సంధులు: ఇట్టివి వెన్ను పూసలు. ఇవి మితమైనచలనము గలిగియుండును. అమితచలనముగల సంధులు: మలుగులలోను భుజములందును నిట్టిసంధు లున్నవి. అక్కడ ఒక గిన్నెవంటి యెముక ఒకవైపునను, బంతి వంటి యెముక అందులోను నిమిడియుండును. పైకిని, క్రిందికిని, ప్రక్కలకును, ముందు వెనుకలకును, వలయాకారముగా త్రిప్పుటకును వీలుగా నుండును.

సంధులయందు, రెండెముకలు కలియుచోట 'హాయలిన్ ఉపాస్థి'యను పేరుగల మందమైనట్టి, దృఢమైనట్టియు పొరయుండును. తెల్లని తంతువులతో గూడిన బద్దెలు రెండెముకలను కలిపి కట్టియుంచును. అందువలన నవి విచ్చలవిడిగా జారిపోక దృఢముగా నుండును. అవసరమైనంత కదలికయే అచట గలుగు చుండును. వీనికి 'సంధిబంధము' లనిపేరు.

సంధిబంధములకును, ఉపాస్థులకును మధ్యభాగమున జారుదల గలిగించునట్టి శ్లేష్మపు పొర యొకటి యుండును.

...పూసలకు వెనుకను ముందుభాగమునను వెన్నుపామును అటునిటు కదలించినపు డంద ... సంధిబంధపు ఆవరణ యుండుటవలన, పూసలు విడిపోక నిలిచియుండును

# రక్త ప్రసరణమండలము

హృదయకోశము, రక్తనాళములు (సిరలు, ధమనులు) శోషరసవాహికలు, శోషరసము నిండు చేయును. హృదయకోశ మనగా పిడికిలియంత పరిమాణము గలిగి మధ్య నవకాశముగల ఒక కండరముతోటి అవయవము. ఇది ఉరము (రొమ్ము) భాగమున నొకింత యెడమవైపుగా నుండును. హృదయకోశముయొక్క దిగువభాగము సన్నగా నుండును. దానికి (అగ్ర)మనిపేరు. ఐదవఆరవ ప్రక్క యెముకలయొక్క ఆవరణ సీయగ్రగము ఆనుకొనియుండును. హృదయముయొక్క లోపలి భాగమున ఒకశ్లేష్మపు (వస పొర) గలదు ఇది నునుపుగా నుండును. దీనికి హృదయాంతస్త్వక్కు - అనగా హృదయముయొక్క లోపలి పొర యని పేరు. హృదయకోశము ఒక తంతువులచే కూడిన పొరచే కప్పబడియున్నది. దానికి హృత్కోశము - అనగా హృదయముండు తిత్తి యని పేరు. హృదయాంతస్త్వక్కువంటి పొర ప్రతిరక్తనాళమునందును గలదు.




1,1 అగ్రములు
2, కుడివైపు గొంతు సంబంధసిర
3 కుడిమన్య
4 ఎడమమన్య
5 ఎడమవైపుగొంతు సంబంధసిర
6 ఎడమలోపలిసిర
7 వంపు రక్తనాళము
8 కుడి లోపలిసిర
9 కుడిశ్వాసాశయ సంబంధధమని
10 శ్వాసాశయధమని
11,11 కుడి, యెడమల యందలి శ్వాసాశయ సిరలు
12,12 కుడి, యెడమ శ్వాసాశయము లందలి పైతిత్తులు
13 ఎడమ శ్వాసాశయ సిర
14 కుడిశ్వాసాశయశిర
15 కుడికర్ణిక
16 కుడిజఠరిక
17 ఎడమశోధకధమని
18 ఎడమజఠరిక
19 శ్వాసాశయములందలి మధ్యతిత్తి
20 కుడిజఠరిక
21 శ్వాసాశయములందలిదిగువతిత్తి

13 వ పటము. శ్వాసాశయములు, హృదయము వానిసమీపమందలి భాగములు.

హృదయకోశము కండరములచే నాలుగుగదులుగా విభాగింపబడియున్నది. పైనున్న రెండు గదులకును (కుడియెడమ కర్ణిక'లనిపేరు. క్రిందనున్న రెండుగదులకును (కుడియెడమ జఠరిక' లని పేరు. దేహమునందు రెండురకముల రక్తవాహిక లున్నవి. ధమనులు - అనగా శుద్ధరక్తము ప్రసరించు గొట్టములు. సిరలు-అనగా మురికిరక్తము ప్రసరించు గొట్టములు.

వీనియందలి రక్తముయొక్క ప్రసరించువిధము నీ క్రింద వివరించుచున్నాము.

దేహమునందెల్ల వ్యాపించియున్న మాలిన్యములు సిరలలో కేశనాళిక లను పేరుగల సన్న నాళములలోనికి చేరును అక్కడనుండి అవి ఆ మురికిని పెద్దగొట్టములలోనికి జేర్చును. అందుండి




14 వ పటము.

హృదయమునందలి కుడిభాగములయొక్క ముందువైపు ఇందు చూపబడినది. కుడియెడమభాగములు రెండును ముందునకులేవు. ఎడమభాగము కొంచెము వెనుకగానున్నది.

అది యింకను పెద్దదగుగొట్టములోనికి చేర్చిచివరకు 2 పెద్దమురుగు కాలువలలోనికి చేర్చును. ఆ మురికి గక్తము అందుండి హృదయకోశమునందలి కుడికర్ణికలోనికి బోవును. కుడికర్ణికలో నుండి కుడిజఠరికలోనికి ఒక కవాట మున్నది. దానికి 'త్రిపిధాన' మనిపేరు. కుడికర్ణికనిండ

పటవివరణము.

1 ఎడమమన్య (Left carotid)
2 అనామకరసి (Innominate)
3 బృహద్ధమనియందలి కమాను (Arch or aorta
4 పైభాగమందలి బృహత్సిర (Vena cava superior)
5 కుడికర్ణిక అనుబంధి (Right auricle appendix)
6 గెలెన్ సిరయందలి రంధ్రము (Orifice of vein galen)
7 కోడిగుడ్డు ఆకారముగల పల్లమునకు పైనుండు గుండ్రని భాగము (Annulus Ovalis)
8, 9 కోడిగుడ్డు ఆకారముగానున్న పల్లము (Fossa Ovalis)
10 దిగువభాగమందలి బృహత్సిర (Vena cava Inferior)
11 థెబిసస్ కవాటము (Valve of Thebesus)
12 ముక్కోణాకారపుకవాటముయొక్క వెలుపటి తునక (Segment of Tricuspid valve)
13 పైకవాటముయొక్క కుడివైపుతునక (Right segment of Tricuspid valve)
14 జఠరికయొక్క ఆవరణములోభాగము (Section of ventricle valve)
15 దిగువనున్న బృహత్సిర (Vena cava Inferior)
16 ఉపజత్రువు (subclavian)
17 కుడిశ్వాసాశయధమని (Right Pulmonary artery)
18 ధమని సంబంధమగు గ్రంధి (Ductws arteriosus)
19 ఎడమశ్వాసాశయధమని (Lelftalmonary artery)
20 శ్వాసాశయధమని (Pulmonary artery)
21 అర్ధచంద్రాకారముగల శ్వాసాశయకవాటములు (Pulmonary Semilunar valves.)
22 ఎడమకర్ణిక అనుబంధి (Left auricular appendiX)
23 సప్తధాతుసం॥ కండరములతో గూడిన కండరము (Samll papillary muscle connected with septum)
24 మాంసభాగము (Column carnea)
25 స్నాయుతంతువులు (Chordaetendinae)
26 వెలుపటికండరములతో గూడిన కండరము (Anterior Papillary muscle)
27 ఎడమభాగమందలి శోధనధమని (Left Cornary artery)
28 మాంసముండుభాగము (Column carnea)
29 లోపలికండరములతో గూడిన కండరము (Posterior papillary muscle)

మురికిరక్తము చేరుటతోడనే అది బలముగా ముడుచుకొనును. అందువలననందలిమురికిరక్తము కుడిజఠరికలోనికి త్రిపిధానకవాటములోగుండ పోవును. ఈత్రిపిధానకవాటముబలమైనతాంతవ (పీచువంటి) పదార్థముచే నిర్మింపబడినందువల నను, దానినిర్మాణమునుబట్టియు కర్ణికలోను జఠరికలోనికి పోయిన మురికిరక్తమును తి కర్ణికలోనికి రాకుండ అడ్డగించును. ఆ రక్త జఠరికలోనుండి అదేవిధమున శ్వాసాశయధమ లోనికి త్రోసివేయబడును. శ్వాసాశయధమ




1
2 శ్వాసాశయసిర (Pulmonary vein)
3 బృహద్ధమని (Arta)
4 శ్వాసాశయధమని (Pulmonary Artery)
5
6 ఎడమకర్ణికలోని లోపలిభాగము (Interior of Left Auricle
7 ఎడమకర్ణిక (Left auricle)
8 శ్వాసాశయధమని (Pulmonary Artery)
9 శ్వాసాశయసిర (Pulmcnary Vein)
10 కుడిజఠరిక (Right ventricle)
11 ఎడమశోధనధమని (Left corenary Artery)
12 రక్తము – ఈగీత మొదటనున్న యెడమకర్ణికలోని కవాటముద్వారా రక్తము జఠరికలోనికివచ్చును
Blood passes through Leftauricle to ventricl
13 బృహద్ధమనిలోనుండి రక్తము బయలుదేరుత్రోవ
Passed the Aortic openin

15 వ పటము. హృదయమునందలి యెడమభాగములు.

అనేకలక్షల కేశనాళికలుగా చేరియుండి శ్వాసకోశమునందలి వాయునాళికలలోని ప్రాణవాయువుతో కలిసి పరిశుద్ధ మగును. మురికిరక్తమునందలి మాలిన్యము కేశనాళికలలోనికి పోయి అటనుండి వెలుపలికి వదలివేయబడును.

అట్లు పరిశుద్ధమై మంచిరక్తము శ్వాసాశయసిరలలోనికి జేరి, యెడమకర్ణికలోనికి జేరును. అది తిరిగి వెనుకటివలె నెడమ జఠరికలోనికి త్రోసివేయును. ఎడమకర్ణికలోనుండి, యెడమ జఠరికలోనికి పోవుచోటను ఒకకవాటమున్నది. దానికి 'కిరీట పిధాన' మని పేరు. అందుండ తిరిగి అశుద్ధరక్తము బృహద్ధమని లోపలికి


16 వ పటము. మానవరక్తకణములు.

ప్రసరించి అచటినుండి అసంఖ్యాకములుగా చీలి దేహమంతటికిని వ్యాపించిన కేశనాళికలలోనికి



17 వ పటము సిరలు



18 వ పటము ధమనులు

బోయి దేహమునందలి ప్రతిధాతువునకును ఆహార మొసంగును.

శోషరసవాహికలు సిరలకు సాహాయ్యకారులుగా నుండును కేశనాళికలలోనికి చేరిన కొన్ని రక్తసంబంధమగు ద్రవములను అవి తిరిగి హృదయకోశములోనికి జేర్చును సాధారణముగా సిరలయందు మురికిరక్తమును, ధమనులయందుశుద్ధరక్తమునుప్రవహించుచుండును. కాని శ్వాసాశయసిరలో మాత్రము శుద్ధరక్తమును, శ్వాసాశయధమనిలో మురికిరక్తమును ఉండును.

జీర్ణకోశమునందును, ఇతరజీర్ణావయవములందును, చేరిన రక్తము తిరిగి సూటిగా హృదయకోశమునకు రాదు. రక్తము చెడిపోయి 'జాఠరసిర'అను పేరుగల ఒకపెద్ద రక్తవాహికలోనికి చేరి అచటనుండి 'యకృత్' అనుపేరుగల పసరుతిత్తిలోనికి చేరును. ఇచటనుండి అది తిరిగి కేశనాళికలలోనికి పోయి అందుండి కుడికర్ణికలోనికి చేరుకొనును.

వెనుక వివరించినవిధముగా హృదయమునందలి కవాటములు మూసికొనుట, తెరచికొనుట అను




19 వ పటము రక్తప్రసరణము.

క్రియవలన హృదయము స్పందించును. అనగా కొట్టుకొనుచుండును. మనచెవిని ఎడమవైపున రొమ్ముమీద నుంచినయెడల ఆదెబ్బలు చెవికి వినిపించును. 'స్టెతెస్కోప్' అను రబ్బరుగొట్టము ద్వారాకూడ ఈధ్వనులను వినవచ్చును. హృదయకోశముయొక్క అగ్రము ప్రక్కయెముకల కంటగొట్టుకొనుచుండును. అచట మనచేతి నుంచినయెడల మన కాస్పర్శ తెలియగలదు. రోగనిదానము జేయు పాఠములో నీవిషయమై యింకను నెక్కువగా వివరించెదము.

## జీర్ణమండలము

నోరు: క్రిందిదవుడకును, పైదవుడకును మధ్యగానుండు ఖాళీప్రదేశములలోపల శ్లేష్మపుపొర యున్నది. 'దీనికి ఆమత్వచ'మని పేరు. అంగిలి యీనోటికి కప్పుగా నున్నది. ముందున్న భాగమునకు 'గట్టి అంగిలి' అనియు, వెనుకనున్న భాగమునకు 'మెత్తని అంగిలి' అనియు పేరులు. గొంతులోపలి కుడియెడమలందు రెండురసగ్రంధు లున్నవి. వానికి 'ఉపజిహ్వాక' లని పేరు.




20 వ పటము - జీర్ణమండలము.

1 పిత్తాశయము (చేదుకట్టు)
2 జీర్ణాశయ ముఖద్వారము
3,4 పైత్యవాహిక
5 అంత్రముఖము
6 సూక్ష్మాంత్రముయొక్క మొదటిభాగము
7 జీర్ణాశయము
8 మధువాహిక
9 వృక్కకములు
10 ప్లీహము
11,11 స్థూలాంత్రము (పెద్దప్రేగు)
12 సూక్ష్మాంత్రము (చిన్నప్రేగు)
13 క్రిమిక (క్రిమిక పైది లంబిక)
14 పురీష నాళము

21 వ పటము.




జీర్ణాశయము (ఇందలి అమత్వచము) అంత్రిమూలము. దీని నే 2వ జీర్ణాశయ మందురు. ప్రిథమాంత్ర మనియు నందురు. పిత్తాశయము నిందు గలదు.

1 జీర్ణాశయము నందలి వంపుతక్కువభాగము

2 హృదయమునకు సమీపముగా నుండెడి హృదయము వైపుచివర.

3 మిక్కిలి వంపుగలిగిన భాగము.

4 అన్నవాహిక - అమత్వచమునందలి నిలువుగానున్న తంతువు లిచటినుండి జీర్ణాశయము అమత్వచములోనికి చేరిపోయినవి.

5 చేదుకట్టు వచ్చునట్టి వాహిక. కాలేయపుగ్రింధి (Hepatic duct) సిస్టిక్ గ్రింధి(Cystic duct) గలవు.

6 చేదురసము మధురరసము అంత్రిమూలములోనికి చేరుటకు ముందు కలియుచోటు.

7 పైత్యగ్రింధి (Hepatic duct)

8 అంత్రిమూలము (Pylorus)

9 చేదుకట్టు (Gall bladder)

10 ప్రిథమాంత్రిముయొక్క అధోముఖభాగము.
(Descending portion of Deuodenum)

11 ఆహారము చిలుకుభాగము (Rugae)

12 జీర్ణాశయమునందలి అమపుపొర
(Mucus Membrane of Stomoch)



22 వ పటము.

జీర్ణాశయమునందున్న అమత్వచమునందలి పల్లములు - అసలునకు 20 రెట్లరూపము.



23 వ పటము.

జీర్ణనాళమునందలి పొరలు
(350 రెట్లు పెంచినరూపము)

ఉమ్మనీతిత్తులు: దవుడలయందును, నోటిలో ౯ ఉమ్మనీతిత్తులున్నవి.

నక్తపథ: కపాలమునకు దిగువను, ముక్కు రంధ్రమును ఉపజిహ్వాయు కలియుచోటనున్న ఒక గొట్టము.

ఆహారనాళము: సక్తపథనుండి వచ్చిన ఆహారమును జీర్ణాశయములోనికి చేర్చునట్టి గొట్టము.

జీర్ణాశయము: ఉదరమునందు పైభాగమున ఎడమవైపున నుండు మధ్యఖాళీగల ఒకకండ రపుతిత్తి-౧౩ అంగుళములుపొడవును ౪ అంగముల వ్యాసరేఖయు గలిగియుండును. ఆహ




24 వ పటము.

మానవ జీర్ణాశయముయొక్క లోపలిభాగము.

a జాఠర గ్రంథులతోగూడిన ఆమపుపొర (Mucus membrane with gastric glands

b రక్తనాళములు, శోషరసవాహికలు, నాడులతో గూడిన ఆమపుపొరలోపలిభాగము (Submuous Coat containing Blood Vessels, Lymphatics and nerves)

c, c కండర భాగము (Muscular tissue)

d [illegible] (Serous Coat)




25 వ పటము. ఉదరమునందలి అవయవములు

1 విభాజిక దిగువభాగము (Limit of Diaphragm)
2 క్రిమిక ( Appendix)
3 మలాశయము (Rectum)
4 పెద్దప్రేగు మొదలు (Caepum)
5 స్వాధిష్ఠానము (Solar plexus)
6, 6 కుడియెడమ డొక్కలు (Rt. & Lt. Hypcchondria
7, 7 పైత్యకోశమునందలి కుడి యెడమ తిత్తులు (Rt & Lt. lobes of Liver
8 జీర్ణాశయము (Stomach)
9,9,9 పెద్దప్రేగు (Colon )
10 చిన్నప్రేవులు (Small Intestines)
11 నాభి (Umbrilica)
12 అంత్రవేష్ఠనము మందమైన భాగము (The Great Omentum)
13 హైపోగాస్ట్రిక్ నాడి
14 లింగ కవాటములు (Right & left inguinal)
15 అంత్రాంతము (Sigmoid flexure)
16 మూత్రపు తిత్తి (Bladder)




26 వ పటము.

1 విభాజికము (Diaphrogrn)
2, 2 మూత్రపిండములు (Kidneys)
3 దిగువబృహత్సిర (Venacava inferior)
4 (Psoas)
5 బృహద్ధమని (Aorta)
6 మూత్రపుతిత్తి (Bladder)
7
8 ఆంత్రవేష్టనమునందలి ధమని (Inf. Mlesentric Artery)
9 శుక్లసంబంధమగు ధమని (Spermatic Artery)

నాళము, జీర్ణాశయము కలియు భాగమునకు గుండె అనిపేరు. జీర్ణాశయము ప్రథమ ఆంత్రము కలియు చోటునకు 'అంత్రిముఖ'మని పేరు. అంత్రిముఖమునందలి కవాటమునకు 'అంత్రిముఖ కవాట'మనిపేరు. జీర్ణాశయమునందు 3 త్వచ (పొర) లున్నవి. 1 ఆమపుపొర. 2 అనిచ్ఛా కండరము. 3 రసిపొర - దీనికే వసపొర అనిపేరు.

ఆంత్రములు (చిన్నప్రేగులు): పొట్టలో పొడుగుగా నుండు గొట్టము ౨౧అడుగుల పొడవును, ఒకటిన్నరఅంగుళముల వ్యాసరేఖయు గలిగియుండును. మొదటి ౧౦ అంగుళములు ప్రథమాంత్రము. మధ్యాంత్రము 8 అడుగులు. చివరి ఆంత్రము ౧౨ అడుగులు.

పెద్దప్రేగు: మొదటిభాగము ఊర్ధ్వముఖాంత్రము, ౨వ భాగము సరళాంత్రము, 3వ భాగము అధోముఖాంత్రము ఊర్ధ్వముఖాంత్రము చిన్న ప్రేగులయొక్క చివరను 'లంబిక' యను పేరుగల భాగమునుండి యెగువకు నడచును. లంబికకు దిగువనే క్రిమిక యున్నది. పెద్దప్రేగు పైకి పోయి అడ్డముగా తిరిగి అధోముఖముగా వ్యాపించి యున్నది. అచటినుండి మలము 'సిగ్మాయిడ్ ఫ్లెక్షర్' లోనికి పోయి అచటినుండి మలాశయములోనికి చేరును.




27 వ పటము. పెంచి చూపబడిన శృంగకములు.




28 వ పటము.
2 శృంగములు.




[illegible] వ పటము. [illegible]మునందలి ప్రధానఅవయవములు.

1 [illegible]ము (Liver)
2 [illegible]ట్టి (Gall bladder)
3 [illegible]శయము (Stomach)
4 [illegible]మాంత్రము (Duodenum)
5 [illegible]కము (Pancreas)
6 [illegible] ముభాంత్రము (Ascending colon)
7 చిన్న [illegible]గులలో పైభాగము (Jejinum)
8 [illegible]హము (Spleen)
9 [illegible]త్రము (Sigmoid flexure)
10 చిన్న [illegible]లలో దిగువభాగము (Ileum)
11 [illegible] (Rectum)
12 [illegible]ట్టనముయొక్క పైభాగము (Superior Mesentric)
13 [illegible] ధమని (Hepatic Artery)
14 [illegible]సిర (Vena portae)
15 [illegible]హాసిర (Spleenic vein)

మ లా శ య ము : ౮ అంగుళముల పొడ వుండును. దీనికి దిగువను ప్రక్కలను రెండుకండ రము లున్నవి. వానికి మొల లని పేరు.

# శ్వాసమండలము.

ము క్కు లు : స్వ్రపథ, స్వరపేటిక, శ్వాస నాళము, శ్వాసనాళికలు శ్వాసాశయములు కలిసి 'శ్వాసమండల' మందుము.

శ్వా సా శ య ము లు : ఉరమునందు కుడి వైపున నొకటియు, ఎడమవైపున నొకటియు నున్నవి. ఇవి పైన సన్నగను, క్రింద లావుగను నుండుట కారము గలిగియుండును. కంఠమువరకు వ్యాపించియుండును. ఊపిరితిత్తులు బాగుగా సంకోచవ్యాకోచముల నొంది సులువుగా కదలు నట్లవి 'పుప్ఫుస'మను పేరుగల బలమైనట్టియు, మృదువైనట్టియు తిత్తులలో నిమిడియున్నవి. ఈ తిత్తులయందలి విభాగములకు 'పుప్ఫుసకుహర ము'లని పేరు. వానియందలి ఒకపొర శ్వాసా శయములకు అంటియుండును. రెండవపొర ప్రక్కటెముకలచే నేర్పడిన రొమ్ముభాగము నకు అంటియుండును. పుప్ఫుసముయొక్కలోపలి పొరలో ఒకవిధమగు శ్లేష్మము (రసము) ఊరు చుండును. అందువలన ఊపిరితిత్తులు ఉచ్ఛ్వాస నిశ్వాసములందు సులువుగా జరుగుటకు వీలుగా నుండును. ఈ క్రియకు నెట్టియాటంకములు గలి నను శ్వాసాశయదాహము గలుగును. శ్వాసా శయము స్థితిస్థాపకగుణము (సాగునట్టి స్వభా వము) గలిగియుండును. అందు కోటానకోట్లు వాయుగోళము లున్నవి.

నోటివెంటగూడ గాలి లోనికి పోవచ్చును. ముక్కువెంటనే గాలి లోనికి పోవుటయే సహజ మగు పద్ధతి. మనము పీల్చునట్టి గాలియందలి

శీతమును తగ్గించుటకును, శుద్ధిచేయుటకును, తడిగా చేయుటకును అనువుగా మనముక్కులు నిర్మింపబడియున్నవి. కనుక ముక్కులతోనే గాలి పీల్చవలయును.

సప్తపథ: ఆహారము ఆహారనాళములోనికిని, మనము పీల్చిన గాలి వాయునాళములోనికిని ఇందుండియే పోవును.

స్వరపేటిక: దీనినే 'గొంతుక్రోవి' యందురు. ఆహారనాళమువెంట, ఆహారనాళముయొక్క పైభాగము నంటియున్నది. అసంఖ్యాకముల చేతను, కండరములతోను గూడి ఒక పెట్టెవలె నున్నది. దానికి మధ్యభాగమున కంఠబిలమున్నది. దీనికే 'ఉపజిహ్వా' అని 'తంత్రిద్వార' మనియు పేర్లు. ఉచ్ఛ్వాస, నిశ్వాసములు దీని ద్వారముననే గలుగును. ధ్వను లిచ్చుటనుండి వెలుపడును.

శ్వాసనాళము: స్వరపేటిక నుండి నాలుగున్నర అంగుళముల పొడవును, ఒక అంగుళము వ్యాసరేఖయు గలిగి స్థితిస్థాపకగుణము గలిగి యీ గొట్టము దిగువకు వ్యాపించియున్నది. వెన్నుపూసలు మూడవదాని కెదురువరకు వ్యాపించినతరువాతనిది రెండు చిన్న గొట్టములుగా చీలును అవి తిరిగి కోటానకోట్లు శాఖలుగా చీలి ఊపిరితిత్తులలోనికి వ్యాపించియుండును. వీనికి చివర వాయుగోళము లుండును. అచటనే రక్తము పరిశుద్ధ మగును. సమానదూరమున స్థితిస్థాపకగుణముగల ఉంగరములు వాయునాళమును చుట్టుకొని యుండును. మనము ఆహారమును మ్రింగునప్పుడవి లోపలికి ఒదిగి తరువాత విరివిని పొందుచుండును.

### స్త్రీజననేంద్రియములు.

భగము: స్త్రీరహస్యేంద్రియమునకు వెలుపలిపొర.

యోని: వెలుపలినుండి గర్భాశయమువరకు వ్యాపించియుండి శ్లేష్మముతో గూడిన నాళము. దీనిని కప్పుకొని కండర మున్నది.




30 వ పటము :
పైనుంచి చూచినప్పుడు స్వరపేటికయొక్క లోపలి నిర్మాణము

1

2 Cricoid cartie.

3 స్వరపేటికావికసన ఉపాస్థి (Crico - arytenoidens Posticus)

4, 4 ముకుళిక ఉపాస్థులు (Arytenoidus)

5 ఉపజిహ్వావికసన రంధ్రము (Rima glotidis)

6, 6 కుడి, యెడమ ధ్వనితంత్రులు (Rt. & Lt. Chordia Vocalis)

7 వీని కొనుకొనియున్నది థైరోఉపాస్థి సంబంధమగు కండరములు (Thyroarytenoidii)

8, 8 థైరాయిడ్ – దీనినే వయోగ్రంధియందురు (Thyroid)

9, 9 స్వరపేటికయొక్క వెలుపటి ఆవరణ

[illegible] ము: మారేడుకాయవలెనుండు [illegible]ము. త్రికాస్థికి ఎగువను, మూపకము [illegible] నుండును. మూత్రకోశమున వెనుక [illegible] భాగమును ఆనుకొనియుండును.

[illegible] ములు: గర్భాశయము నంటి [illegible] నుండు వెడలుపైన సంధిబంధము [illegible]లుగా నున్నవి.

[illegible] కోశములు: గర్భాశయములోనుండి [illegible]ములలోనికి అడ్డముగా వ్యాపించి [illegible] కండరకోశములు. వీనిలోపల [illegible] యున్నది.

[illegible]లు: రొమ్ముభాగమువర్తులాకారముగా [illegible]. వీనియందు అనేకగ్రంధు లున్నవి [illegible] చిన్నచిన్న తిత్తులున్నవి. అవి యన్నియు [illegible] వద్ద 3,4 తిత్తులుగా ఏర్పడును. అందుండియే పాలు వచ్చును.

శోణితము: శోణితముపక్వమై పిండకోశముల ద్వారా గర్భాశయములోనికి వచ్చిచేరును. ఇదే స్త్రీయం దుండునట్టి జనన హేతువైన ద్రవము. ఇది పురుషబీజముతో కలిసి ఫలవంతమైనప్పుడు గర్భాశయమునందు పిండముగా మారును. అది ఫలవంతము కానియెడల యోనిలోగుండబుతుకాలమున వెడలిపోవును.

### పురుషజననేంద్రియములు.

ఉత్థాపకగ్రంధి: మూత్రికయొక్క మొదట, దానిని చుట్టుకొనియుండునట్టి గ్రంధి. ఇది మూత్రకోశముయొక్క దిగువకును, మలాశయమునకును మధ్య నుండును. ఒకటిన్నర అంగుళము వ్యాసరేఖ గలిగి బాదముకాయవలె నుండును. లావుగా నున్న చోట బలమైనకండర




31 వ పటము. స్వరపేటిక, వాయునాళము.
(వాయునాళికలయొక్క ముందుచూపు.)
1 ఉపజిహ్వ 2 కాకపక్షాకారముగల ములు 3 థైరాయిడ్ 4 5,5 దిగువకళ్లముగల ములు. 6 7,7 ఉపాస్థులు




32 వ పటము. మూత్రపిండములు నిలువుగా కోసినరూపము

1 మూత్రకండరము 2 ముక్కోణమగుభాగము 3 మూపకవృంతము 4 మూత్రబిందువు 5 మూత్రబిందువు 6 మూత్రపిండముయొక్క లోపలి చివర 7 శిఖరము 8 మూపకము 9 ముక్కోణమగు భాగము 10 మూత్రిక 11 మూత్రపిండముయొక్క లోపలి అంచు 12 మూత్రపిండముయొక్క వెలుపటిహద్దు

పదార్థముతోకప్పబడి ఇందు శుక్లసంబంధమైన ద్రవము లూరును. అవి మూత్రికలోనికిజారును.

అండములు: ఇవి రెండుగ్రంథులు. వృషణములలో నిమిడియుండును. శుక్లతంతువులనుండి దిగువకు జారియుండును.

శిశ్నము: స్థిరస్థాపకగుణము గలిగినపొడుగైన కండ. మూలమని, స్కంధమని, గ్రంధులని యిది 3 భాగములుగా నుండును.

శుక్లము: అండములలో రక్తములోనుండి వడియగట్టబడిన జననహేతువగు పదార్థము.ఇది శుక్లాశయములోనికిచేరి అందుండిఉత్థాపకగ్రంధిద్వారాను అటనుండి మూత్రికలోనికిని జారును.

### మూత్రికావయవములు

మూత్రపిండములు: మూత్రనాళములు మూత్రాశయము,మూత్రిక యిందలిభాగములు.

మూత్రపిండములు: ఉదరమునందు వెన్నుపామునంటికుడివైపున నొకటియు నెడమవైపున నొకటియు గ్రంధిస్వభావముగల మూత్రపిండము లిమిడియున్నవి. ఒక్కొక్కటి ర అంగుళములపొడవు, ౨ అంగుళముల వెడలుపు, ౧ అంగుళము మందముగా నుండును. వీనియందు అనేకములగు నాళము లున్నవి. వీనియందుండి మూత్రము వడియగట్టబడి యిందలి దిబ్బలవలెనుండు భాగములపైబడి ఒక్కొక్క బిందువుగా క్రిందికి జారును. దేహమునందలి మాలిన్యములు వీనిద్వారా స్వీకరింపబడి వెలువరింపబడును.

మూత్రాశయము: పొత్తికడుపుయొక్క దిగువభాగమున లింగమునకు పైగా ముందువైపున నున్నది. ఇందు ౧ పైంటు మూత్రము పట్టును. ఈ తిత్తియొక్క వ్యాసరేఖ ర అంగుళము లుండును. మూత్రపిండముల నుండి మూత్రము మూత్రనాళములద్వారా మూత్రాశయములోనికి చేరును. అది అటనుండి మూత్రికద్వారా వెలువరించివేయబడును.




33 వ పటము. వడపోతగొట్టము.

1
2 వడపోత గొట్టములు (urinerferous tubes)
3 స్వీకారనాళములు (Afferent vessels)
4 బహిష్కారనాళము (Efferent Vessels)
5 వడపోతవలయములు
6




34 వ పటము. మూత్రపుతిత్తి.

1 మూత్రకోశముయొక్క పీఠము (Base of bladder)
2 వెనుకవైపున అంత్రవేష్టన మున్నది
3 ఖాళీ (Triangular space)
4 Vas defernes 5, 5 శుక్లాశయము 6, 6 మూత్రిక
6 Rt. Ejaculatary duct కుడివైపుననున్న ఉద్దీపక గ్రంధి (Prostate gland) ఉత్థాపక గ్రంధి

## జ్ఞానేంద్రియములు

కన్ను: చూచునట్టి యింద్రియము. కనుగ్రుడ్లు, కనుబొమలు, కనురెప్పలు, కనురెప్పల మీది వెంట్రుకలు, బాష్పజలగ్రంథులు, కన్నీటి కాలువలు, కండరములు, దృక్నాడి యిందలి భాగములు.

కర్ణము: చెవి వినెడు ఇంద్రియము. వెలుపలిభాగము, మధ్యభాగము, లోపలిభాగము అని యిది 3 భాగములు. వెలుపలిభాగమున కర్ణికి, కర్ణరంధ్రము నున్నవి. ఈకర్ణరంధ్రము గూబలోనికి పోవును. మధ్యభాగమున గాలియుండు ఖాళీ యున్నది. లోపలిభాగమున కర్ణనాడియును, దానికి సంబంధమగు భాగములు నున్నవి. చెవికి తగిలిన ధ్వనిసంబంధమగు స్పందనములు విరివినంది గూబకు తగులును. అక్కడనది కర్ణభేరికి తగులును. అచటనుండి ఆస్పందనములు కర్ణనాడికి తగిలి ధ్వనులను స్వీకరించును. అప్పు డది మెదడునకు చేరును. అప్పుడు మనకా ధ్వనులు తెలియును.

నాలుక: రుచిచూచు నింద్రియము. మాటలాడుట కుపయోగించును.

ఘ్రాణము: ముక్కు వాసనచూచు నింద్రియము. గాలిని పీల్చుట కుపయోగించును.

చర్మము: స్పర్శను తెలిసికొను నింద్రియము; గాలిని లోనికి పీల్చును; చమురును పీల్చును. దేహమునందలి మాలిన్యముల వెలువరించును. చర్మము నారోగ్యముగా నుంచుటయవసరము.

## ప్రశ్నలు.

౧ దేహమునందలి కండరములు చేయుపనియేమి? కండరము బలముగా నుంచుట యననేమి?

౨ సంకోచక కండర మననేమి? అట్టివానిని కొన్నిటిని వివరింపుము.

౩ విభాజక మననేమి? అది యెచ్చట నున్నది? అది చేయుపనియేమి?

౪ కీళ్లు ఎన్నివిధములు - అట్టివి యెక్కడ నెట్టివి యుండును?

౫ రక్తప్రసరణమండలమునందలి భాగముల పేర్కొనుము. మురికిరక్తము హృదయకోశమునుండి ఊపిరితిత్తులలోనికి ప్రవహించు విధము పేర్కొనుము. శ్వాసాశయములలోనికి చేరిన మురికిరక్త మేమగును?

౬ హృదయమునందలి శుద్ధరక్త మెట్లు దేహమంతయు వ్యాపించునో వివరింపుము. ధమనులకును, సిరలకును భేద మేమి?

౭ జీర్ణమండలమును వర్ణింపుము. వివిధభాగములను వివరింపుము.

౮ శ్వాసనాళమునువర్ణింపుము. శ్వాసాశయములకు - దానికి సంబంధ మేమి? శ్వాసక్రియయందు శ్వాసనాళముయొక్క పని యేమి?

౯ పుప్ఫుసమును వర్ణింపుము. అందేమి జరుగుచుండును?

౧౦ చెవినిగురించిన దెల్ల వివరింపుము.

# ప్రకృతి గృహవైద్యము

నాలుగవ పాఠము

## రోగము

వెనకటి 3 పాఠములలోను మానవదేహము ఆరోగ్యదశ అనగా సామాన్యదశయం దెట్లు ఉండునో, అందలిక్రియలు అనగా పనులు ఎట్లు జరుగుచుండునో వివరింపబడినది. కాని మీరు ఇంకను నీ విషయములను మిక్కిలి విపులముగా తెలిసికొనవలసియే యున్నది. అయినను, ప్రకృతి వైద్యమునుగురించిన సామాన్యవిషయము లన్నియు మీకు చెప్పవలసివచ్చుటచేత నింతతో నాపి యిక రోగము వచ్చినప్పుడు దేహమునందలి క్రియ లెట్లు జరుగుచుండునో వివరించెదను.

## రోగలక్షణ శాస్త్రము — PATHOLOGY

రోగదశలను గురించిన వివరములు ప్రకృతివైద్యునకంతగా అవసరముండదు. ఏలయన, నితఁడు దేహమును ప్రకృతిసూత్రముల ననుసరించి నడుపును. దానివలన రోగముపోయి, ఆరోగ్యము గలుగును. ఇక మందువైద్యులన్ననో ప్రతిచిహ్నమునకును చికిత్సచేసి దానిని పోగొట్టుటయే వారివిధానము గనుక నే ద్రావకము నీయవలెనో, యే మాత్రను వేయవలెనో, యే సూదిమందునువాడవలెనో నిర్ణయించుకొనుటకు వారికి వివరములు కావలసియుండును. ప్రకృతి చికిత్సయందురోగకారణమునకే సూటిగా చికిత్స చేసెదము. కనుక ఒకరోగికి ౧౦, ౧౨ రోగచిహ్నము లున్నను అవి యన్నియు ఒకచికిత్సతోనే అంతరించును. అనగా మందువైద్యుని కన్న ప్రకృతివైద్యుడు ఒక అడుగు ముందునకు పోయి రోగలక్షణములకు మూలమైన కారణమును కదలించి, దానిని తల్లివేరుతో పెకలించి వేయును. దీనికి గాను అతడు దేహమునందు గల రోగనివారకశక్తిని ప్రకృతియందలి నిర్మలముగు జలము, సూర్యకిరణములు, పరిశుద్ధ వాయువు, మంచియాహారము మొదలగువాని ద్వారా జ్వలింపజేసి రోగకారణములను దహించివేయును. రోగకారణము సమూలముగా నశించినతోడనే రోగచిహ్నములును వానియంతట నవి నశించిపోవును.

అయినను మనకుగూడ రోగలక్షణశాస్త్రము అనవసర మని చెప్పరాదు. ఏలయన, నే రోగియైనను కొంత రోగచిహ్నములు పోగొట్టుకొనవలయు ననియే మనవద్దకు వచ్చుచున్నాడు. మనము ఆ చిహ్నముల నన్నిటిని బాగుగా పరీక్షచేయవలెను. ఆ చిహ్నము లేకారణములవలన గలిగినవో నిర్ణయించుకొనవలెను. ఒకతూరి రోగకారణము సునిశ్చితమైనతరువాతచికిత్స చేయుటయు సులువుగానే యుండును. వెంటనే చికిత్స ప్రారంభింపవచ్చును. ముందు పాఠములలో రోగి నెట్లు పరీక్షచేయవలెనో, యెట్లు ప్రశ్నింపవలెనో, యెట్లు అతనిచరిత్ర వినవలెనో ఆ వివరము లన్నియు నుండును.

వెనుకటి పాఠములలో ఒకడు ఆరోగ్యవంతుడుగా నుండుటకు దేహమునందలి క్రియలన్నియు సక్రమముగా నడుచుచుండవలయునను విషయమును మీరు బాగుగా గ్రహించియేయుండురు. అందును, రక్తప్రసరణము బాగుగా జరుగుచుండవలయును. కనుక ప్రతివ్యాధియందును

రక్తమునందు కొంచెము గొప్పమార్పు రాక మానదు. రక్తముయొక్క పరిమితి తగ్గవచ్చును, లేదా రక్తముయొక్క స్వభావము మార వచ్చును.

ప్రతి అక్రమమగు స్థితికిని ఒక్కొక్క పేరున్నది. అట్టి స్థితులలో ప్రధాన మైనవానిని పేర్కొని వానిచిహ్నములను వివరించెదను. అందు, రక్త మునందలి సహజముకాని (అసహజమగు) స్థితు లను పేర్కొందును.

రక్తక్షీణత:—రక్తముయొక్క పరిమితి లోపిం చి యుండుట, లేదా అందలికొన్ని అంశములు లోపించియుండుట, నశించుట. ఇందు రక్త మున కెర్రనిరంగునకు కారణమగు హిమో గ్లోబిన్ అను పదార్థము తగ్గియుండును.

పాండువు:—రక్తక్షీణతయందు రక్తకణ ములు లోపించియుండును. ఈవ్యాధియందన్ననో శ్వేతకణములు మిక్కిలిగా వృద్ధినొంది దేహము పాలిపోవును.

అసాధ్యపాండువు:— ఇందును శ్వేతకణ ములే యెక్కువగానుండును. ఆహారము రసముగా మారును. అది రక్తముగా మారును. రసము రక్తముగా మారుట కేర్పడిన అవయవములు రోగగ్రస్తము లగుటవలన నీ వ్యాధి గలు గును.

రక్తవాహికావరోధము:—రక్తవాహిక యొక్క మూలమునందు రక్తపుకుదుపయేర్పడి, రక్తమును సక్రమముగా ప్రవహింపనీయదు.

రక్తవిషీకరణము:—రక్తమునందు ప్రా ణాపద్రవకరమైన విషము చేరియుండును. ఈ స్థితి రసము, పాషాణము, నాభి, ద్రావకములు, వల్లమందు మొదలగు బయటివిషములు రక్తములో చేరుటవలన గలుగవచ్చును, లేదా దేహమునందలి గ్రంథులు, పైత్యకోశము మొదలగు నవయవములు తిన్నగా పనిచేయక పోవుటవలన కలుగవచ్చును. అంతర్వ్రణములు, అంతర్విద్రధులు, అనగా దేహములోపలి భాగ మునందు గలుగు వ్రణములు, కాయలు మొద లగువానివలనను గలుగవచ్చును, లేదా దేహ మునందలి మలమూత్రములయందు కుళ్ళుపుట్టి అది రక్తములో కలియుటవలనను గలుగ వచ్చును.

దైశికమగు రక్తక్షీణత:— దేహమునం దలి ఒకానొక భాగమున రక్తము క్షీణించుట.

రక్తాధిక్యము:—ఒకానొక దేహభాగమున మాలిన్యములు చేరి అచటికి రక్త మెక్కు వగా చేరుటకు రక్తాధిక్యము అనిపేరు.

ఎడిమా:—రస, రక్తములు రక్తవాహికల నుండి సమీపమందలి ధాతువులలోనికి కారిపోవు చుండు దశ.

రక్తాభిష్యందము:—ఒక ధాతువులోనికి రక్తము కారిపోవుట.

దాహము:—ఒకానొక దేహభాగమున దెబ్బ తగిలి చెడిపోయినప్పుడు దానిని మరమ్మతు అనగా సరిచేయుటకు అచట రక్త మెక్కు వగా చేరును. అందువలన నచట మంటలు పుట్టును, ఇట్లు రక్త మెక్కువగా చేరుట మం చిదే. దానివలన చెడిపోయిన భాగము బాగు పడును. కనుక నీ పనికి మనము నిరోధముల కల్పింపరాదు. సాయపడవలెను. రక్తవాహి కలు మొదట లావగును. తరువాత రక్తప్ర వాహవేగము తగ్గును. రక్తమునందలి జలభాగ మును, ధాతువులును చుట్టుప్రక్కల నుండు ధాతువులలోని కింకును. ఇట్లు పుట్టుమంటలు

తరుణ్మైనదనియు కాలికమైన దనియు రెండు విధములు. కాలికదాహమునందు బాధగల చోట (connective tissue) నెక్కువ యేర్పడును. దాహము అనేకవిధములుగా నుండును.

అభిష్యంద దాహము:—ఇందు ఆమత్వచమునందు మాలిన్యములు చేరును.

తాంతవ దాహము:— దేహమునందలినారవంటి తాంతవధాతువునందు గలుగును. పూతిదాహము వ్రణాదులందు కుళ్ళు పుట్టి చీము మొదలగునవి చేరినప్పుడు గలుగును.

చచ్చు:—ఒక భాగమునందలి రక్తకణముల సంఖ్య తగ్గి, ఆభాగము సన్నపడును. రక్తకణములును, ధాతువులును కృశించును.

ధాతుసాంకర్యము (Infiltration):—ఒకధాతువు చుట్టుగాని, లోనికిగాని సంధిధాతువు గాని యితరధాతువులుగాని యింకుట.

కొయ్యకండలు:—మామూలు ధాతువులు క్రొవ్వుకండలుగా మారిపోవును.

క్రొవ్వు కండలు:— కొయ్యకండ లెక్కువ స్థల మాక్రమించుకొని, వాచి, అందు విశ్లేషమారంభ మగును.

అస్థిక్షయము:—ఎముకలు నశించును. ఇతర ధాతువులును నశించును.

పూతి:— మెత్తనిధాతువులు మరణింపగా అందు పుట్టినట్టి క్రుళ్లు పూతియనబడును. రక్తము ధారాళముగా ప్రసరింపనియెడల శుష్కపూతి యేర్పడును. అది మొండి, గట్టిగను, నల్లగను నుండును. ఆర్ద్రపూతి తడిగను, మెత్తగను క్రుళ్లగను నుండి, వాపు గలిగియుండును.

విదగ్ధి (Ulceration):— కొన్ని కుటికలు (cells) చచ్చిపోయి మిగిలినవానిచే నెట్టివేయబడును. అప్పుడు పుండు గలుగును.

చీముపట్టుట:— ధాతువులసంబంధమగు కుటికలు, శ్వేతకణములు రక్తము, మురికి పులిసి, అందు శిలీంధ్రము లేర్పడి చీముగా నగును.

వ్రణము:— పైన చెప్పిన చీము వెలుపటికి రాక ఒక క్రొత్తకోశమునందు నిలిచియుండును.

వ్రణరక్తవాహిక (Sinus):—ఒక వ్రణములోనుండి యింకొక వ్రణములోనికిగాని, ఒక వ్రణమునుండి చర్మముమీదికిగాని యేర్పడిన ఒక మురికిరక్తమును వహించు ఒక కృత్రిమ రక్తనాళిక.

వాపు:— ఒక ధాతువునందలి కుటికలయొక్క పరిమాణము వృద్ధియగుట.

రక్తపీడనము—ఒకానొకభాగమునందలి కుటికలసంఖ్య పెరిగి ఆ ప్రదేశము లావెక్కి రక్తమునకు నిరోధము గలిగించును. అప్పుడు రక్తముయొక్క పీడనము (Pressure) పోటు ఎక్కువగును.

గ్రంథి:—దేహావయవములయొక్క క్రియలకు అనగా జీర్ణక్రియ మొదలగువానికి నెట్టి నిరోధములు లేకుండగనే, ఒకానొక చోట చేరి మాలిన్యములు ఒకగ్రంథిగా నేర్పడును. దీనికి ఇతరధాతువులతో సంబంధ ముండదు. కాని యీ గ్రంథులలోనే ఉపద్రవగ్రంథు లున్నవి. వానియందలి మాలిన్యములు చుట్టుపట్ల ధాతువులలోనికి గూడ జొరబడి, వానిని గూడ విమలితములుగా జేసి ప్రాణాపాయము గలిగించును.

శ్లేష్మగ్రంథి:- ఆమత్వచయందలి శ్లేష్మము ఒకచోట చేరగా దానిచుట్టును తాంతవపదార్థ

ముగాని, శ్లేష్మప్రధానముగాని యేర్పడి ఒకగ్రంథిగా నేర్పడును. అందు శ్లేష్మ ముండును.

జ్వరము:— దేహముయొక్క వేడి 98·6 డిగ్రీలకు మిగిలియున్న స్థితి. దేహమునందలి మాలిన్యములను గెంటివేయు శక్తి లోపించియున్నప్పుడును, రక్తమునందు మాలిన్యములు చేరినప్పుడును, దేహమునందలి ఉష్ణమును సమపఱచు నాడీమండలము సక్రమముగా లేనప్పుడును జ్వరము గలుగును. దేహమునందు చేరిన మాలిన్యములను దేహము వెలువరింప బ్రయత్నించినప్పుడును జ్వరము గలుగును. ఇది తరుణమనియు, కాలికమనియు రెండువిధములు. దీర్ఘజ్వరములయందు, హృదయము, పైత్యకోశము, మూత్రపిండములు, ప్లీహము, కండరములు తత్సంబంధాణువులు నశించి పోవుచుండును.

# రోగోత్పత్తి — ETIOLOGY

ప్రకృతి విధానములచే ఆరోగ్యమును గలిగింపనెంచువారికి రోగము గలుగుటకు కారణములు తెలిసియుండుట అవసరము. చిహ్నచికిత్సలు చేయువారికిది భాగము అప్రధానమైనను, మన సంప్రదాయమువారి కిది మిక్కిలి అవసరమై యున్నది.

రోగకారణములు రెండువిధములు, ప్రత్యక్షము, పరోక్షమునని. అక్రమమగు ఆహారము, వ్యాయామము చేయకుండుట, పరిశుద్ధమగు గాలిని మిక్కిలి తక్కువగా పీల్చుట, సూర్యకాంతి తగులకుండుట మొదలగునవి మొదటి తెగలోనివి. ఇట్టి కారణమును గుర్తించినంతనే మన వైద్యుడు ఆయా పొరపాటులను సరిచేయును. దానితో రోగనివారణ మగును. వీనిని వెంటనే సరిచేయనియెడల దేహమునందలి రోగనిరోధకశక్తి నానాటికి తగ్గిపోవుచుండును. దానివలన నితరవ్యాధులు గలుగుచుండును. ప్రత్యక్షకారణమనగా నే కారణముచే వ్యాధులు వెంటనే గలుగునో ఆకారణము. దీనినే సన్నికృష్టమందురు.

మిక్కిలి వేడిమైనట్టియు, మిక్కిలి చల్లనైనట్టియు వాతావరణమువలనను దేహశక్తి తగ్గిపోవుచుండును. దీనిని పరోక్షకారణ మందురు. శీతోష్ణధర్మము 0 మొదలు 100 డిగ్రీలమధ్యనుండునది మనకు ఆరోగ్యకరముగా నుండును. ఎల్లప్పుడును 90 డిగ్రీలకన్న నెక్కువ వేడిగలచోట నివసించుచుండుటవలనను, రోగనిరోధకశక్తి తగ్గిపోవుచుండును. మనము నివసించు గృహముయొక్క ఉష్ణధర్మము 80 డిగ్రీలకు మించియుండరాదు.

కూర్చుండుట మొదలగు దేహముయొక్క గతి, జీవితసరళి ననుసరించియుండును. కొన్ని దేహగతు (తీరు)లవలనను రోగనిరోధకశక్తి తగ్గిపోవుచుండును. ఎల్లప్పుడును కూర్చుండుట, ఎల్లప్పుడును వంగియుండుట, మొదలగు గతులయందు కొన్ని కండరములకు అత్యంతమగు ఒత్తిడి గలుగును. మరికొన్ని కండరములకు అసలే పనియుండదు. అట్టి పరిస్థితులందును రోగనిరోధకశక్తి తగ్గిపోవును.

ఎక్కువ దుస్తులను ధరించుట - అసలే దుస్తులు లేకుండుట, మిక్కిలి బిగుతైన దుస్తుల ధరించుట వలనను రోగనిరోధకశక్తి అనగా ధాతుశక్తి తగ్గిపోవుచుండును.

వ్యాయామము ఆరోగ్యమునకు మిక్కిలి అవశ్యకమైనది. సరిపోయినంత దేహపరిశ్రమ లేకుండుట

వలనను ధాతుశక్తి తగ్గిపోవుచుండును. వ్యాయామము లేకుండుటవలన గలుగు వ్యాధులను నివారించుకొనుటకు చేయవలసిన వ్యాయామములు మున్ముందు వివరింతును.

సరిపోయినంతనిద్ర ఆరోగ్యమున కవసరమైనది. సామాన్య మానవునకు 8 గంటల నిద్ర అవసరము. బోర్లగిలగాని, కుడిచేతిమీదగాని పరుండవలెను. బాగుగా గాలి తగులుచోట, దీపము లేనిచోట చల్లగా నుండుచోట నిద్రింపవలెను.

అక్రమమగు ఆహారమువలననే సాధారణముగా నన్నిరోగములును గలుగుచుండును. కనుక ప్రకృతిచికిత్సకునకు ఆరోగ్యకరములగు ఆహారములును, రోగనివారకములగు ఆహారములును, కండలను పెంచు ఆహారములును, క్రొవ్వును తగ్గించు ఆహారములును సమగ్రముగా తెలిసియుండవలెను. మందువైద్యులకు ఈ సంగతులు బొత్తుగా తెలియవు. ప్రకృతిచికిత్సకుడు దీనినే ప్రధానముగా ప్రయోగించును. కనుక మనము చేయు చికిత్సయందలి సుగుణములు మిక్కిలి స్పష్టముగా తెలియుచుండును. ఇందే మున్ముందు కొన్ని పాఠములు ఆహారమును గూర్చియు పథ్యమునుగూర్చియు వ్రాయబడును. సారాయి, పొగాకు, టీ, కాఫీ, నల్లమందు, మందులు మొదలగునవి వాడుటవలనను, అఘాతములు, దెబ్బలు మొదలగువానివలనను ధాతుశక్తి తగ్గును. అందువలన వ్యాధులు గలుగును.

వెన్నుపాము సరిగా నుండుటవలన ఆరోగ్యము గలుగును. వెన్నుపామునందలి వంకరలవలన రోగము గలుగును. అవి సరిజేసిన రోగము నయమగును. ఈ పాఠములలో కొన్ని ఆవిషయమును వివరముగా బోధించును. కనుక ఆవిషయమును ఊరకే పేర్కొని వదలివేయుచున్నాను.

వెన్నుపూసలు ఒకదానిపై నొకటి పేర్చబడి ఒక పెద్ద వెన్నుపాముగా నైయున్నది. ఒక పూసకును నింకొకపూసకును కలుపునట్టి భాగములు గలవు. అవి ఒకదానిలో నొకటి యిమిడిక గలిగియుండును. రెండుపూసలయిమిడిక చెదరియున్నప్పుడును, ఒకటి గాని యెక్కువ గాని వెన్నుపూసలు అవియుండవలసినచోటిని తప్పించి అటునిటు కదలియున్నప్పుడుగాని వ్యాధి గలుగును. వానిని వానిస్థానమునం దిముడ్చుటవలనను, రోగనివారణ మగును. వెన్నుపామునందలి లోపమును గుర్తించి సరిచేయుటకు 'కశేరుకా సమీకరణశాస్త్ర'మని పేరు. వెన్నుపాము బిరుసెక్కుటవలన నయిత మనేకవ్యాధులు కలుగును. వెన్నుపాము నంటియుండు కండరములయందలి అక్రమమగు సంకోచవ్యాకోచములవలన రక్తము సరిగా వెన్నుపాములోనికి రాక యీ బిరుసుతనము గలుగును.

వెన్నుపామునం దున్న లోపమువలన నెక్కడో చాలదూరముగా నున్న దేహభాగమునందు రోగము గలుగును. చలననాడులు, జ్ఞాననాడులు, అస్వతంత్ర స్వతంత్రనాడులు అన్యోన్యముగా సంబంధించియున్నవి. అందువలన నిట్లు జరుగుచుండును. ఈ విషయమంతయు మున్ముందు బోధించెదము.

సర్వవ్యాధులకును మూలమగు కారణములలో మనస్సు ప్రధానమైనది. మనస్సుయొక్క ప్రాధాన్యమును సమగ్రముగా నెవ్వరును గుర్తించియుండలేదు. విచిత్రమేమన: ఇది అత్యంతప్రధానమైన విషయము. అనేకులకు బొత్తుగా తెలియనివిషయ మిది యొక్కటియే. పిచ్చి, ఉన్మాదము మొదలగు మానసికవ్యాధులను గురించి నే నిచట చెప్పదలచలేదు. సామాన్యముగా మనకు గలుగుచున్న వ్యాధులు సాధా

రిణముగా మనస్సులోనే ప్రారంభించి, అచటి నుండి గెండునాడీమండలముల ద్వారా దేహములోనికి వ్యాపించి దేహసంబంధమగు రోగములను గలిగించు నని అనేకులకు తెలియదు.

ఈ విషయమై యెంత పరిశోధించిన అంత మేలు గలుగుచుండును. ఎంత బాగుగా తెలిసికొనిననుతఱుగని విషయ మిది. ఈ విషయమైన పాఠ మొకటి ముందు వ్రాయబడును. అం దనేక విచిత్రవిషయములను మీరు తెలిసికొనగలరు. ఎట్టి మానసికస్థితులందు రోగములు గలుగునో వానిని నివారించుకొనుట కేమిచేయవలసి యుండునో అదియును అందు గలదు.

కోపము, భయము, అసూయ, ఆతురత, విసుగు ఈర్ష్య మొదలగు రసములు ఉద్రేకించినప్పుడు దేహతత్త్వమునందును మార్పులు గలుగుననుట అందఱకును దెలియును. ఈ సంగతినే యిదివరకును చెప్పియున్నాను. అట్లే సంతోషము, ఆనందము, ప్రేమ, భక్తి, విశ్వాసములవలన దేహమునందలి ఆరోగ్యము వృద్ధిబొందును.

దేహరోగమునకు దైహికముగా నెన్ని చికిత్సలు చేసినను నిరుపయోగమగుట కలదు. ఆ రోగముయొక్క మూలము మొదడులోనే యున్నది. ఆ సంగతి ననేకులు గుర్తింపజాలరు. మనస్సును బాధించు కారణమును తొలగించినంతనే గారడీయందువలె దేహరోగములు మాయమై పోవును. ప్రతిరోగియు తన రోగము కేవలము భ్రమ యనినప్పుడు ఒప్పుకొనడు, నమ్మడు. నిజమునకు అది భ్రమజనితము కాదు. దానికారణము మనస్సులో నుండనే యున్నది. పాపము, వానికది తెలియదు.

ఒక రోగిని చేరదీసి వానితో చనవు సంపాదించుకొని వానిని జాగ్రత్తగా పరిశీలించి, పరిశోధించి వాని మనస్సును బాధించు హేతువేదో జాగ్రత్తగా తెలిసికొని వానికి తెలియకుండనే రోగమూలమును పెకలించివేయుట నిజముగా నెంత ఆనందదాయకమైనది? అట్టి విజ్ఞానమును మే మీపాఠములద్వారా మీకు గలిగింప నెంచితిమి.

౫వ పాఠము రోగమును నిదానముచేయు క్రమమును బోధించును.

## ప్రశ్నలు

౧ అస్థినిర్మాణ శాస్త్రము, శారీర శాస్త్రములు చదువుటకును, రోగలక్షణ (చిహ్న) శాస్త్రము చదువుటకును గల తారతమ్యమును దెలుపుము.

౨ చిహ్నశాస్త్రమునకు ప్రకృతి చికిత్సకు డెట్టి ప్రాముఖ్యము నీయవలెను?

౩ రక్తక్షయ మనగానేమి?

౪ రక్తవిషీకరణ మేల గలుగును?

౫ ధాతుసాంకర్యమును వివరింపుము.

౬ రోగోత్పత్తి శాస్త్రమన నేమి? రోగకారణముల రెంటిని వివరింపుము.

౭ ఆరోగ్యమునకు ఆహారమెంతవరకు ఆవశ్యకమైనది?

౮ వెన్నుపాము సహజస్థితిలో నుండుటవలన ఆరోగ్యము బాగుగా నుండును. ఎందువలన?

౯ మానసిక కారణము లన నేమి?

౧౦ మానసికకారణములచే గలుగువ్యాధులను కుదుర్చు టెట్లు?

# ప్రకృతి గృహవైద్యము

ఐదవ పాఠము.

## రోగనిదానము

రోగి దేహమునందు ఏక్రమము చెడినదో కనిపెట్టు విధానములకే రోగనిదాన మనిపేరు. ప్రకృతివైద్యుడు ఆరోగ్యవిధులచేతనే అన్నిరోగములను కుదుర్పగలడు. అందువలన, రోగ మెట్టిదైనను, నే దశలోనున్నదైనను అతనికి సమానమే. సరిగా నేరోగము కలిగినదో అది యే దశలోనున్నదో అతనికి తెలియకున్నను, అతడు రోగములను కుదుర్పగలడు. అయినను రోగ మెట్టిదో, అది యేదశలోనున్నదో తెలిసియున్న యెడల ఆతడు చేయు చికిత్సావిధానమునందు నెక్కువ సహాయకారిగా నుండును గాన అతడును రోగనిదానమును తెలిసికొను అగత్యమేర్పడినది.

రోగనిదానము రెండు విధములు. ఒకటి రోగి నడిగి చిహ్నములు తెలిసికొని, ఆ చిహ్నములు ఏ రోగచిహ్నములతో తుల్యములుగా నున్నవో పోల్చి రోగమును నిర్ణయించుట; రెండు దేహమంతటిని పరీక్షించి రోగనిదానము చేయుట.

రోగనిదానము చేయుటకు జ్ఞానేంద్రియములనే ఉపయోగింతుము. అనగా కంటితో చూచి, చెవితో విని, చేతితో తాకి తెలిసికొనగలము. కంటితో చూచి పరీక్షించుటలో వెలుతురు బాగుగా నున్నచోట రోగినిఉంచి చూడవలెను. దేహభాగము మీద గుడ్డలను తీసివేసి చూడవలెను. దేహము సన్నగానున్నదా, లావుగా నున్నదా? దేహమునందు పొట్ట ప్రధానముగా నున్నదా? రొమ్ము అడుచుకొనిపోయి యున్నదా? మెడ పొడుగుగా నున్నదా, మెడలు కీదియ బడి యున్నవా? భుజములు కుంగియున్నవా? కన్నులు నిండుగా తెఱచియున్నవా, మూసియున్నవా? సగము మూసియున్నవా? గడ్డము మొన దేలియున్నదా, లావుగా నున్నదా? బుగ్గలు లావుగా నున్నవా, గుంటలు పడియున్నవా? నుదురు నిలువుగా నెదిగినదా, అడ్డముగా నున్నదా? నుదురుయొక్క వైశాల్యమెక్కువగా నున్నదా, తక్కువగా నున్నదా? ముచ్చెలగుంట పూడియున్నదా? తలయేవైపునకు ఒరగియున్నది? దేహముయొక్క రంగు ఏమి? అది చమురు కారుచున్నదా, నిగనిగలాడుచున్నదా? ఎండిపోయియున్నదా, బిరుసుగా నున్నదా? పొట్టు రేగుచున్నదా? పుండ్లు పగుళ్లు గలవా? తల, చేతులు, కాళ్లు, వెన్ను, ముఖము మొదలగువానిని కదలించుట సులభముగా నున్నదా, కష్టముగా నున్నదా? వివిధ కండరములను కదలించుటలోగల సౌలభ్యము కపాలముయొక్క రూపము - పైన లావుగా నున్నదా, క్రింద లావుగా నున్నదా? ప్రక్కలను లావుగా నున్నదా, ఏప్రక్కను లావుగా నున్నది? ఎక్కడనైనను మెరకలు పల్లములు గలవా మొదలగు వివరములను జాగ్రత్తగా సేకరింపవలయును.

తరువాత తాకి (స్పర్శచేత) తెలిసికొనవలెను. ప్రకృతి చికిత్సకును నీవిధానము చాల ఉపయోగకరమైనది; స్పష్టముగా తెలుపునదియును. ఈవిధానముచే వెన్నుపామునుపరీక్ష చేయుదుము. అరచేతితో అందును వ్రేళ్ళ చివరలతో తాకి తెలిసికొందుము. వైద్యుడు తన చేతివ్రేళ్ళను చాచి, మూసి వానియందు సహజముగా నుండు

ఒత్తిడి తగ్గించవలెను. ఏలనన వ్రేళ్లతో తాకి తెలిసికొనినప్పుడు ఎక్కువగా ఒత్తిన యెడల వెన్నుపూసలయందలి క్రమరాహిత్యము బాగుగా తెలియదు. వ్రేళ్ళయొక్క చివర (మునివ్రేళ్ళయందు అందును మధ్యవ్రేలి యందు) మంచి స్పర్శజ్ఞాన ముండును. వానితో తాకుటవలన వెన్నుపామునందలి లోపములు బాగుగా తెలియును. అనుభవమువలన నిది యింకను బాగుగా తెలియును. అప్పుడాతడు వెన్నుపూసలయందలి స్వల్పాతిస్వల్పములగు లోపములైనను మిక్కిలి నేర్పుగా గుర్తింపగలడు. కనుక వెన్నుపామునందలిపూసలను జాగ్రత్తగా తాకి వానియందలి లోపములను కనిపెట్టి తెలిసికొనవలెను. ఇందునకు సంబంధించినవివరములు కసేరుకా సమీకరణమను పేరుగల అధ్యాయమున వివరముగా వర్ణించితిని.

మోదించి చూచుట: ఎడమచేతి చూపుడువ్రేలిని చర్మముమీద బోర్లించి ఆనించవలెను. కుడిచేతి మధ్య వ్రేలి కణుపులను మడచి వ్రేలియొక్క వెనుక భాగముతో (మొట్టికాయ వేసినట్లు) చర్మముమీద బోర్లించిన యెడమచేతి చూపుడువ్రేలి చివర కణుపులమీద మొట్టవలయును. అట్లు కొట్టినపుడు ఎడమ చూపుడువ్రేలు దేహభాగముమీద బాగుగా అనియుండును. మొట్టికాయలన్నియు ఒకేదూరమునుండి ఒకేబలముతో నెడమచేతివ్రేలిమీద ఒకేచోట కొట్టవలెను. ఆరోగ్యవంతుల దేహముమీద నిట్లు కొట్టి చూచియున్న యెడల, ఆధ్వనికిని రోగియొక్క దేహముమీద కొట్టిచూచిన ధ్వనికిని భేదము గాన్పించును. ఎట్టిధ్వని, యెంతబిగ్గరగా, ఎంతగంభీరముగా, నిలకడగా, లోతుగా, కలుగుచున్నదో జాగ్రత్తగా గుర్తించవలెను. అనుభవముమీద నేయే అవయవముల మీద నెట్టి యెట్టి ధ్వనులు కలుగునో, అవయవములందు నెట్టిలోపము లున్నప్పు డెట్టి ధ్వనులు గలుగునో పూర్తి అనుభవముమీద వైద్యుడు తెలిసికొన గలుగుచున్నాడు. కొందరు స్టెతెస్కోప్ (అనగా ధ్వనిని వినే పనిముట్టు)ను వాడి యీ ధ్వనుల స్వభావము నెఱుగుచున్నారు. బోర్లించిన యెడమచూపుడు వ్రేలిమీద స్టెతెస్కోప్ ధ్వనిని గ్రహించే భాగము (Bell బెల్) ను బెట్టి, దాని రబ్బరు తిత్తుల రెండు చివరలు రెండు చెవులలోను పెట్టుకొని, అప్పుడు కుడి మధ్యవ్రేలితో కొట్టిచూచెదరు. ఇట్లు చేసిన నెక్కువ ఉపయోగకరముగా నున్నట్లు వారు గుర్తించిరి.

జీర్ణాశయముపై కొట్టి చూచినప్పుడు నెమ్మదిగా కుండపై కొట్టినట్లుధ్వనివినిపించును. ఊపిరితిత్తుల పైన కొట్టినప్పుడు తీగెలమీద కొట్టిన ధ్వనివంటి ధ్వని నెమ్మదిగా, పొట్టిగా, బలహీనముగా వినిపించును. పైత్యకోశముమీద కొట్టినప్పుడు మెత్తని, హ్రస్వమగుధ్వని వినిపించును. తప్ తప్ అనే ధ్వని వినిపించును.

ఇట్లు వినినందువలన నే యవయవము ఏ స్థానము నందున్నదో, అది యెంత విశాలముగనున్నదో, యే ఆకారముగా నున్నదో తెలియును. ఏఅవయవమునిండుగా నున్నదో, యేది లోపల ఖాళీగానున్నదో, యేది ద్రవములతో నిండినదో, యెంతవరకు నిండియున్నదో, యేది గట్టిపడియున్నదో ఆవివరము లన్నియు తెలియును.

కనుక నిదానము చేయదలచినవాడు వివిధ అవయవములయొక్క స్థానమును, స్వరూపమును, వైశాల్యమును, స్వభావమును తెలిసికొనుటకు నిరంతరమును, రోగులయొక్క జీర్ణాశయము ఊపిరితిత్తులు, పైత్యకోశము మొదలగునవి మోదించి చూచుచుండవలెను.

ధ్వని విని తెలిసికొనుట: ఇట్లు తెలిసికొనుటకు స్టెతెస్కోప్ అనే పనిముట్టు అవసరము. స్టెతెస్కోప్‌యొక్క ధ్వనిని గ్రహించే బెల్ చర్మము మీద గట్టిగా ఆనించి పట్టుకొనవలెను. రబ్బరు గొట్టముల చివరలు రెండు చెవులలోను పెట్టుకొనవలెను. అప్పుడు దేహములోనిధ్వనులు వృద్ధిబొంది చెవిలో వినిపించును. హృదయముయొక్కయు ఊపిరితిత్తులయొక్కయు స్వభావము నెరుంగుట కిది మంచివిధానము. ఊపిరితిత్తులను పరీక్షించునపుడు రోగి నెమ్మదిగా ధ్వనిని గలిగింపకుండ ఒక దీర్ఘ నిశ్వాసమును (లోనికి పీల్చుట) చేయవలెను. వాయునాళము మీదను రెండుగా చీలిన శ్వాసనాళము మొదటను ధ్వనులు బాగుగా వినుపించును. గాలిని వెలుపలికి వదలునప్పు డీ ధ్వని యింకను నెక్కువగా వినిపించును. శ్వాసాశయములపైన నీ ధ్వనులు చాల తగ్గి వినిపించును. గాలిని వదలునప్పటి ధ్వనికన్న పీల్చునప్పటి ధ్వని బిగ్గరగను దీర్ఘముగను, నిండుగను వినిపించును.

ఈవిషయము లన్నియు ప్రకృతి చికిత్సకునకు బాగుగా తెలిసియుండవలయును. ఈ విధానముల నన్నిటిని రోగనిదానమునందు ప్రయోగించి తెలిసికొనుచుండునేని అతని కెవరికిని లేని సర్వజనాదరణ లభించును. రోగు లతనియందు నమ్మకముంచి చికిత్స పొందెదరు. రోగనిదానము చేయుటయందు, తన కది చాల స్వల్ప విషయమని తోచినను, దానిని వదలివేయక ప్రతివిషయమునను శ్రద్ధ వహించి నిదానము చేయవలెను. లేకున్న రోగులకతనియందు నమ్మకము తగ్గిపోవును. మరియు తాను రోగనిదానమును నిర్దుష్టముగా పూర్తి చేయజాలడు. మా విద్యార్థులందరును యథావిధిగా ప్రతిస్వల్ప విషయమునందును అత్యంతశ్రద్ధవహించి నిదానము చేయవలసినదని హెచ్చరించుచున్నాము. రోగనిదాన మెట్లు చేయవలెనో యీక్రింద వివరించుచున్నాము.

రోగి నడిగి యీక్రింది విషయములను తెలిసికొనవలెను.

౧ రోగిపేరు, తండ్రిపేరు లేక భర్తపేరు, వయస్సు, ఉద్యోగము, చిరునామా, టెలిఫోన్ నెంబరు, టెలిగ్రాఫిక్ ఎడ్రెసు వగయిరా. (ఈ వివరములు రికార్డునకు అవసరము)




౨ రోగికి తెలిసియున్నప్పటినుండి ... యొక్క వృద్ధి క్షయములను గు... తెలిసికొనవలెను. రోగముయొక్క పూర్వ...కిని, నిప్పటి స్థితికిని గల సంబంధమును ఆ... తెలిసికొనవలెను.

3 రోగి కుటుంబచరిత్ర వినవలెను. తల్లిదండ్రుల యొక్క ఆరోగ్యమును గురించియు, వారికి గల వ్యాధులను గురించియు, వారి స్వభావములను గురించియు ప్రశ్నించి వివరములను తెలిసికొనవలెను. రోగములు తలిదండ్రులనుండి బిడ్డలకు రావలెనను నియమ మేమియు లేదు. కానిరోగకారణమగు కొన్నిస్వభావములుబిడ్డలకుమాతాపితలనుండి సంక్రమించును. క్షయ తల్లిదండ్రుల నుండి బిడ్డకు సంక్రమింప నక్కరలేదు. ఏదో స్వభావము తల్లి దండ్రి బిడ్డలకు సమానముగా నుండి బిడ్డలకుగూడ తల్లిదండ్రులకు గలిగిన వ్యాధియే కలుగుటకు హేతువు కావచ్చును.

కనుక నే స్వభావములు బిడ్డలకు తల్లిదండ్రుల నుండి సంక్రమించినవో గుర్తించి, ఆస్వభావములను మార్చినయెడల తల్లి దండ్రులకు పట్టిన దురవస్థ బిడ్డకుగూడ కలుగకుండపోవును. అందుకు తగిన అత్యంతశ్రద్ధతీసుకొని వైద్యుడాతని రక్షింపవలయును.

౫ రోగియొక్క రోగమును గురించి పూర్తిగా ప్రశ్నించి తెలిసికొనవలెను. అతనికిగలబాధలను గురించియు అతనికి స్వాభావికమగు విధముగా చెప్పనిచ్చి వినవలెను. ఆతడు ఏ చిహ్నములను చెప్పునో అవి పోవలయునని కోరుచుండును. ఆచిహ్నముల నన్నిటిని ఒక పుస్తకముమీద వ్రాయించి యుంచవలెను. మన చికిత్సయందు ఆచిహ్నములన్నియు ఒకటొకటిగా అంతరించుట మనము గుర్తించి ఆనందించుచుండవలెను.

౫ తల, మెడ, వెన్నుపాము, రొమ్ము, కడుపు జననేంద్రియములు, కాళ్ళు, చేతులు మొదలగు వానియం దేమైనబాధలు గలవేమో ప్రశ్నించి తెలిసికొనవలెను. తలనొప్పి, దిమ్ము,వికారము, నోటిపూత, నోరుదుర్వాసనగానుండుట, చేదుగానుండుట, కన్నులమంట, మెరుపులు, మసకలు, గుండెలోదడ, మంట, నొప్పి, అగ్నిమాంద్యము అరుచి, కడుపులోనొప్పి, శూల, మంట, దగ్గు, వగర్పు, ఆయాసము, నెత్తురుకక్కుట, ముక్కువెంట నెత్తురుకారుట,మలబద్ధకము,అతిసారము, గ్రహణి, మొలలు,భగందరము, అతిమూత్రము, మధుమేహము,మూత్రమురానిబాధ,మూత్రము లో తెలుపుగాని సుద్దకట్టుగాని పడుట, తెల్లబట్ట అగుట, ఋతుధర్మము సకాలమునకు కాకుండుట, అతిగాగాని తక్కువగాగాని మైల వెడలుట, మూర్ఛ, అపస్మారము, ఉన్మాదము, పక్షవాతము, తిమ్మిరి, చర్మము పగులుట, కురుపులు, గ్రంధులు, వ్రణములు, నీరు కారుట, ఎండు, జ్వరము, చలిజ్వరము, కాళ్లు చేతులు చల్లగా నుండుట, తిమ్మిరిగా నుండుట; నాడుల యందు దౌర్బల్యము, మంటలు, కోపము, పిరికితనము మొదలగున వేమైనను గలవేమోప్రశ్నించి తెలిసి కొనవలెను. ఇందులో కొన్ని రోగి చాల స్వల్పవిషయములుగా భావించి చెప్పుట మరచును. మన కవి యన్నియు అవసరమైః గనుక క్షుణ్ణముగా పరిశీలించి తెలిసికొనవలెను.

౬ ఈ క్రిందివిధముగా సంపూర్ణమగు పరీక్ష చేయవలెను.

(౧) రోగిని యెదురుగా నిలుచుండ బెట్టి దేహమునం దే వైపున నెక్కువగా వెడల్పుగానున్నదో చూడవలెను. ఆవైపుననే రోగపదార్థ మెక్కువగా చేరియుండును గాన ఆవైపున నున్న అవయవము లన్నియు రోగగ్రస్తములై యుండునని గుర్తించుకొనవలెను. ప్రక్కనుండియుగూడ చూడవలయు. తల దేహము దాటి ముందునకు మొగ్గియున్న వెనుకవైపున, వెనుకకు మొగ్గియున్న ముందువైపునను రోగపదార్థమున్నదనియు, ఆ వైపునగల అవయవములు రోగగ్రస్తములై యున్నవనియుగ్రహించవలెను. ఇట్లే వెనుకవైపునను చూడవలెను వెన్నుపామునకు ఏ వైపున నెక్కువ వెడలుపుగ నున్న ఆ వైపుననున్న అవయవములు రోగగ్రస్తములై యున్నవని గుర్తించవలెను. ఇట్లే తల యేవైపునకు వ్రాలినదో ఆవైపున యెదురు వైపునందలి అవయవములురోగగ్రస్తములై యున్నవని గుర్తించవలెను. నడకయొక్క తీరు, దేహమునందలి అవయవములయొక్క కదలికయొక్క తీరు(చలనక్షమత) గుర్తించవలెను.

(౨) రోగియొక్క ముఖమును, రంగును, కన్నుల నిశ్చలత, కాంతి, అరమోడ్పు, నిండుగా తెఱచియున్నవా, కాంతిహీనములా అనునవియును గమనింపవలెను.

(౩) ఇప్పటి రోగితూకము, ఇప్పటికి కొంతకాలమునకు, ముందుఉన్న తూకము, సామాన్య

ముగా అతి డెంత బరువుండెడివాడో అదియును కనుగొనవలెను.

(౪) రోగియొక్క నోటిలోనివేడి థర్మామీటరుతో కొలువవలెను. ఇంతకుపూర్వము దేహముయొక్క వేడియందు గలిగినమార్పులను గుర్తింపవలెను. ఎంతెంత కాలమునకు వేడియందు మార్పులు గలుగుచున్నవో గుర్తింపవలెను.

(౫) నాడిని చూడవలెను. అది యెంత బలముగా కొట్టుకొనుచున్నదో, దేహమునందలి వాత, పిత్త, శ్లేష్మముల వేగ మెట్లున్నదో, నాడి నిమిషమున కెన్నిసార్లుకొట్టుకొనుచున్నదో చూడవలెను.

(౬) చర్మముయొక్క రంగు, తడి, మృదుత్వము, పగులుట, పళ్ళికలు, కురుపులు, పొక్కులు, గ్రంధులు, వ్రణములు మొదలగునవి గుర్తింపవలెను.

(౭) శ్వాస వదలునప్పుడు, పీల్చునపుడు ఊపిరితిత్తులయొక్క కదలికయందలి సౌలభ్యము, రెండు ఊపిరితిత్తులు సమముగా సంపూర్ణముగా గాలితో నిండుచున్నవా లేదా అనునదియును గుర్తింపవలెను.

(౮) శ్వాసాశయములయొక్క అగ్రము అనగా పైభాగమును మోగించి చూడవలెను. శ్వాసాశయముల అగ్రము లెంతవరకు వ్యాపించియున్నవో, గాలిపీల్చినప్పుడు అవి యెట్లున్నవో, వానియొక్క బలము, అవి యెన్ని సెకనుల కొకతూరి కదలుచున్నవో అదియును గమనించవలెను.

(౯) ఉదరమును తాకి చూడవలెను. ఆరోగ్యవంతమైన ఉదరమునందు మన కేమియు గాన్పింపదు. పలుచని వారియందు వెన్నుపూసలు మాత్రము చేతికి తగులును.అక్కడ గట్టి ఉండలు తగిలినయెడల మలము ఉండలుకట్టియున్నదనియు, తీవ్రమగు మలబద్ధకము గలదనియు గుర్తింపవలెను. ఇది రోగి చెప్పు చరిత్రకు సరిపోవును. ఇట్టి పరీక్షవలన తేలిన పర్యవసానము లిట్లుండును:—

తూకము : ఎక్కువగా నున్నయెడల నంజో, మేదమో యెక్కువగా నున్నది. తగ్గియున్నయెడల ఆహారము సరిగా వంటబట్టకుండుట, జ్వరము, దేహమునందు మాలిన్యములు చేరుట, క్షయ, నిద్రలేమి యున్నప్పుడు తూకము తగ్గియుండును.

జ్వరము : ఉన్నప్పుడెల్ల మలబద్ధకము, రక్తము చెడియుండుట, లోపలదాహము, నాడులయందు లోపములు కారణముగా నుండును. వేడి తగ్గిపోయినయెడల దేహమునందు శక్తి ఉడిగిపోయినదని శోష గలుగుచున్నదనియు, నాడీవ్యాధులు గలవనియు గుర్తింపవలెను. చలిగలిగిన, తరువాతజ్వరము గలుగును. నాడులయందలి రోగములవలనను చలి గలుగును. చెమట సాధారణముగా జ్వరమునకు తరువాత గలుగును. నాడీదౌర్బల్య మున్నప్పుడును గలుగును. ధాతుశక్తి తగ్గియున్నప్పుడును గలుగును.

నాడి : జ్వరము, హృదయకోశవ్యాధులు, రక్తాభివ్యందము, మరణమునకు ముందు, వ్యాయామమునకు తరువాతను నెక్కువగా కొట్టుకొనును. శక్తి తగ్గియున్నప్పుడును, రక్తము విషయుతమైనప్పుడును, మెదడునందు పీడన యున్నప్పుడును, కొన్ని నాడీవ్యాధులయందును, ఆకలిగొనియున్నప్పుడును, నిద్రాకాలమునను నాడియొక్క వేగము తగ్గియుండును. మానసికోద్రేకములందును, పైవ్యాధులన్నిటియందును నాడియొక్క గమనము క్రమము లేకయుండును.

చర్మము : శ్వాసాశయము, హృదయ కోశము రోగగ్రస్తమైయున్నప్పుడు కొంచెమునీలిరంగుగా నుండును. రక్తక్షయము, పాండువ,క్షయవ్యాధులయందు పాలిపోయియుండును. పైత్యకోశ వ్యాధులయందు పచ్చనిరంగు గలిగియుండును.

చర్మవ్యాధులు : చర్మముక్రిందచేరిన మాలిన్యములవలనను, రక్తము విషయుత మగుటవలనను, మందుల వాడుటవలనను గలుగును. జ్వరము, తీవ్రమగు అతిసారము మొదలగు వ్యాధులయందు చర్మము అర్చుకొనిపోయిపొడిగానుండును. జ్వరము, మంటలు, రక్తపుఒత్తిడి, రక్తమునందు విషములుచేరుట మొదలగు వానియందు చర్మము వేడిమెక్కును. చర్మము చల్లగా నున్నయెడల రక్తాభిసరణమునకు ఆటంకము గలిగినదనియు, రక్తాభిసరణము సరిగా నుండలేదనియు నర్థము. జ్వరాంతమునను, దౌర్బల్యము గలిగినప్పుడును, ఆమవాతమునందును, శోష గలిగినప్పుడును, రక్తచలనము గలిగించు నాడులయందలి గలుగు రోగములవలనను చర్మమునందు తడి యెక్కువగును.

హృదయమునుపరీక్షించుటకు స్టెతెస్కోప్ వాడెదము. హృదయకోశముయొక్క దిగువభాగమునందు దాని అగ్రమున్నది. అచ్చట పరీక్షించిన మిత్రాల్కవాటము (Mitral Valve) యొక్క ధ్వనులు వినిపించును. హృదయము ఆరోగ్యవంతముగా నున్నప్పుడు లాబ్—డబ్ అను ధ్వని వినబడుచుండును. రొమ్మెముక (Sternum) యొక్క దిగువచివరభాగమున బెల్ పెట్టి వినిన హృదయముయొక్క మూలము (Tricuspid) యొక్క ధ్వని వినిపించును. అందు మొదటదీర్ఘమైనట్టియు, గంభీరమైనట్టియు, నెమ్మదియైనట్టి ధ్వని వినబడి తరువాతహ్రస్వమైనట్టియు, క్షణికమైనట్టియు ధ్వని వినబడును. రెండుకవాటములయొక్క ధ్వనులును దగ్గరదగ్గరగనే వినిపించును. ఒకతూరి ధ్వని అయినతరువాత తిరిగి ధ్వని అగుటకు మధ్య కొంత విశ్రాంతి యుండవలెను. విశ్రాంతికాలముయొక్క పరిమితి తగ్గిన కొలది హృదయముయొక్క గమనము చెడియున్నదనిగాని, దౌర్బల్యము గలదనిగాని గుర్తింపవలెను. మిత్రాల్కవాటపు ధ్వని ఒకటిగానుండక రెండుగానున్నయెడల హృదయముయొక్క కండరములు దుర్బలములై యున్నట్లు గుర్తింపవలెను.

హృదయపరీక్ష చేయదలచినప్పుడు శ్వాసలు అధికమగునట్లు వ్యాయామము చేయింపవలెను. అప్పుడు శ్వాస పీల్చుట కష్టముగానుండగూడదు. ఆయాసము, నీరసము, శ్వాసావరోధము గలుగరాదు. నాడీక్రమము తప్పరాదు. నీరసముగా కొట్టుకొనరాదు. ఇందులో నేవియైనను గలుగు నెడల హృదయముయొక్క సామర్థ్యము తగ్గియున్నదని యెరుగవలెను.

ఉదరము: కడుపు ఉబ్బరము, ఉదరమునందును జననేంద్రియములందును బల్లయేర్పడినప్పుడును, గర్భిణిగానున్నప్పుడును, మలనిరోధమేర్పడి మలబద్ధక మేర్పడునప్పుడును, ప్రేగులయందు పుట్టినదుర్వాయువులు వెలువడుటకు ఆటంకము గలిగినప్పుడును మాత్రమే ఉదరము లావుగా నుండును. ఇది చేతితో తాకి ఒత్తి చూడవలెను.

౨ వెన్నుపామును జాగ్రత్తగా పరీక్షింపవలెను. కశేరుకా సమీకరణ చికిత్సఅనే భాగమును ముందు చదువగలరు.

౩ మూత్రమును పరీక్షించుము. మూత్రపరీక్షను గురించిన అధ్యాయము ముందు చదువగలరు. మిగతావివరములకు తొట్టివైద్యము 1వభాగము చదువుడు. సునిశితవైద్యము 1 వ భాగములోని

11 వ కిరణమును చదువుడు. ఇంకను నాచే రచియింపబడనున్న కపాలనిదానము, కనీనికానిదానముల చదువవలెను.

౯ ఇంతవరకు తెలిసికొనిన నిదానమును గట్టి చేసికొనుటకు ఈ క్రింది విధముగ ప్రశ్నించి తెలిసికొనవలెను.

ఆహారము : రోగి ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలముల యందు ఏవియేవి యెంతెంత యెప్పుడెప్పుడు తినునో అడిగి తెలిసికొనవలెను. మాంసము, గుడ్లు, రొట్టె, అన్నము, కూరలు, పండ్లు, వండనిపదార్థములు, చిరుతిండ్లు, మసాలా దినుసులు, తాంబూల ద్రవ్యములు, కాఫీ, టీ, కోకో, సోడా, లిమనెడ్, పాలు, నెయ్యి, పెరుగు, మజ్జిగ, జున్ను, నీళ్లు, పంచదార, ఉప్పు, కారము మొదలగునవి యేవి తినునో అదియును కనుగొనవలెను. ఆకలి యెట్లున్నదో, తినునప్పుడు బాగుగా నమలునో లేదో, అన్నము హితవుగా నుండునో లేదో తృప్తి యెట్లుండునో అడిగి తెలిసికొనవలెను.

అలవాటులు : మలబద్ధకమున్నదా? మలము పలుచగా నగునా? ఎక్కువతూరులు అగునా? ఆహారము జీర్ణము కాకుండనే వెడలిపోవునా? మూత్రము ఎన్నిసారు లెంతెంత అగును? దానిరంగేమి? బాధ గలదా? దినమున కెన్నిసారులు స్నానముచేయును? వేడినీళ్లా? చన్నీళ్లా? ఎప్పుడు, ఎట్టిరకము, ఎంతవ్యాయామము చేయును? ఇతరపను లేవి చేయును? ఏవ్యావృత్తులు గలవు? విశ్రాంతి ఆటపాటలు మైథునక్రియయొక్క న్యూనాధిక్యతలను, పొగచుట్ట, బీడీ, సిగరెట్టు, మొదలగు దురభ్యాసములు ఏమైననుగలవా? మిఠాయిల అలవాటు గలదా కనుగొనవలెను.

వ్యావృత్తులు : నడక, కూర్చుండుటలయొక్క తీరు; అలసట కలుగు స్వభావము; పరిసరములు ఆరోగ్యవంతముగా నున్నవా? శుచి, మొదలగునవియును; గాలి, వెలుగు ధారాళముగా తగులునా? విషపువస్తువులు అలవాటుగలదా? మంకులుగా తినినాడా? స్నేహితు లెవరు మొదలగు వివరములను తెలిసికొనవలెను.

వస్త్రధారణము: ఎన్నివస్త్రములు ధరించును? బిగించి కట్టుకొనునా? వదులుగనా? నాయుగట్టుట కలదా? బూట్సుతొడుగునా? వదులైన వస్తులు ధరించునా?

గృహము: ఇంటిలోనివారు, చుట్టుప్రక్కలు, గాలి వెలుగు లింటిలోనికి వచ్చురీతి, చల్లగా నున్నదా? వేడిగా నున్నదా? ఉక్కపోయునా? మొదలగునవి కనుగొనవలెను.

మనస్సు: ఎట్టి స్వభావము? కోపాదులు గలవా? ఉద్రేకమైనమనస్సా? విసుగుదలగలదా? ఆకస్మికముగా ఆపదలు కలిగినవా? ప్రబలవిచార హేతువులు ఆకస్మికముగా గలిగినవా! సంతృప్తి గలదా? ఇప్పటి రోగమునకు హేతువేమని అతని ఉద్దేశము ?

ప్రాణచికిత్సలు : పడుట, దెబ్బలుతగులుట, నలుగుట, చిదుగుట, జ్వరము, శస్త్రము, ఎలక్ట్రిక్ షాక్ మొదలగునవి గలిగినవా? వానికి సంబంధించిన యితరవివరములు తెలిసికొనవలెను.

అంటువ్యాధులు: సూక్ష్మజీవులు, రాసాయినిక ద్రవ్యములు, కూరగాయలు, దుర్వాయువులు, మందులు వానిచే గలిగిన వ్యాధులు ఏవిమైన గలవేమో కనుగొనవలెను.

శ్రద్ధగల విద్యార్థులకు సూచనలు.

ఈ పాఠమును జాగ్రత్తగా చదువవలెను. ఇంటిలో చూతా శ్రద్ధగాచదివినదే చదివి గ్రహించ

వలసిన విషయములు గలవు. బాగుపడదలచిన విద్యార్థి దీనిని చాల శ్రద్ధతోను, ఓపికతోను అధ్యయనము చేయవలెను.

సాధ్యమైనయెడల కొంతమందినిపిలుచుకొనివచ్చి మీరు నేర్చుకొనినది తప్పోఒప్పో సరిచూచుకొనవలెను. స్పర్శ, ప్రయోగించిచూచుట, వినుట, చూచుట అనునవి చూచుచుండిననేగాని అలవాటు కానేరవు. దీని నింకొక విధముగా నేర్చుకొనుట సాధ్యముగాదు. స్టెతెస్కోప్ మీ స్నేహితుల గుండెమీదపెట్టి వినవలెను. మీకు కావలసిన మేము స్టెతెస్కోప్ తెప్పించి యిచ్చెదము.

కనుపడినవారిముఖముల నెల్ల చూచి పరీక్షించుచుండుడు. ఇట్లు చూచుచుండిన క్రమముగా మీకా సామర్థ్యము గలుగును.

ప్రశ్నలు

౧ నిదానమననేమి? అందలివివిధపద్ధతుల పేర్కొనుము.

౨ ప్రయోగించిచూచుట అననేమి? అందువలన మనము దేహస్థితి నెట్లు తెలిసికొనగలము?

3 సాధారణముగా స్టెతెస్కోప్‌ను ఎక్కువగా దేనికి ఉపయోగింతురు?

౪ రోగియొక్క కుటుంబచరిత్ర రోగనిదానమునకు ఎట్లు సహాయకారియగును? రోగము పితరులనుండి బిడ్డలకు సంక్రమించునా?

౫ రోగనిదానమును చేయుట కెట్లు ప్రారంభించి సాగింతువు?

౬ స్వాభావికదశలో హృదయముయొక్క ధ్వని యెట్లుండును? హృదయధ్వని యెట్లుండిన హృదయము రోగగ్రస్తమైనదందుము?

౭ ఉదరమును ఒత్తి, చూచినప్పుడు చేతికి గట్టిగ తగిలిన దాని నేమిగా భావించవలెను?

౮ క్షుణ్ణముగా ప్రశ్నించియు, పరీక్షించియు చూచినప్పుడు మనకు గలుగు లాభము లేమి?

౯ రోగి నేవిషయములనుగురించి ప్రశ్నించిన రోగనిదానము చేయవీలగును?

౧౦ చర్మము చల్లగా నున్న నేమి గుర్తింపవలెను? చర్మముపై తడి యెప్పు డెక్కువగా నుండును?

షరా:—కాగితమునకు ఒకవైపుననే వ్రాయవలెను. పాఠసంఖ్య, ప్రశ్నసంఖ్య వేయవలెను. ప్రతికాగితము మీదను వరుససంఖ్య యుండవలెను. అన్ని కాగితములను కలపి గుండుసూదితో కుట్టవలెను. లేదా దారము కట్టవలెను.



# ప్రకృతి గృహవైద్యము

## ౬ వ పాఠము

## రోగచిహ్నములు

ఈ పాఠమునందు రోగచిహ్నములనుగురించి తెలిపెదను. ఏ ప్రత్యేకవ్యాధి లేక వ్యాధులచే ఒకానొక రోగి బాధపడుచున్నాడో చిహ్నముల వలన మనకు బాగుగ దెలియును. దేహమునందలి ప్రాణావయవములగు హృదయము, ఊపిరితిత్తులు, జీర్ణావయవములు, మూత్రపిండములు, జననేంద్రియములు వీనియందలి నడకయందు లోపములు గలిగినప్పుడును; వాని యొక్క స్థితియందు లోపములు గలిగినప్పుడును; రాసాయనికముగా జరుగవలసిన క్రియలయందు క్రమము చెడియున్నప్పుడును; రోగము గలుగును. ఆరోగము గలదనుటను కొన్ని వెలుపలి చిహ్నములచే గుర్తింప వీలు గలిగియుండును. తత్త్వమునందు గలుగు కొన్ని తరుణవ్యాధుల యందు గలుగు చిహ్నములు ఈ క్రింద చేర్కొనబడుచున్నవి:—

**జ్వరము:** దేహమునందు స్వాభావికముగా నుండవలసిన దానికన్న నెక్కువ వేడి యున్నప్పుడు దానిని జ్వర మందుము. జ్వరము రోగము కాదు. రోగపదార్థము దేహమునం దున్నదని తెలుపునట్టి ఒకానొక చిహ్నము. నోటిలో జ్వరపుపుల్ల (Thermometre) పెట్టికొలిచినప్పుడు 98.6 డిగ్రీల వేడి యుండును. అది దేహమునందు సహజముగా నుండవలసిన వేడి. అంతకు మిగిలియున్నప్పుడు, దేహమునందు వేడిని గలిగించుయంత్రము చెడినదని యర్థము. ప్రకృతి చికిత్సకునివద్ద నిట్టిపని ముట్టు ఒకటి యుండవలెను. దీని వెలయును సరసముగనే యుండును. తరుణవ్యాధులయందు జ్వరము చలితో నారంభము కావచ్చును. రోగికి వణకు (కంపము) గలుగును. చర్మము చల్లగా నుండును. దేహము లోపల మాత్రము మంటలు పుట్టును. జ్వరము యొక్క మధ్యకాలమునందును చలి గలుగి వచ్చును.

**ఇన్ఫ్లూయెంజా (Influenza):** దేహతత్త్వమునందు గలిగిన ఒకానొక అక్రమస్థితిలో నీ వ్యాధి గలుగును. ఈ వ్యాధిగలవారికి దేహమునందు వివిధావయవములలో మంటలు పుట్టును. శ్వాసకోశములందును, జీర్ణాశయమునందును, ప్రేగులయందును, నాడీమండలమునందును నిట్టి అక్రమస్థితి యేర్పడును. ఇందు తీవ్రమగు నడుమునొప్పి యుండును. దేహమునందలి యెముకలన్నిటియందును నొప్పి యుండును. రక్తమునందలి తెల్లకణముల సంఖ్య తగ్గియుండును. జ్వర ముండును. రోగి చాల బలహీనముగా నుండును.

**విషమజ్వరము (Typhoid fever):** చిన్న ప్రేగులయందలి శోషరసగ్రంథులయందు పుండ్లు ఏర్పడును. ప్లీహము పెద్ద దగును. తలనొప్పితోను మలబద్ధకముతోను అది యారంభమగును. అతిసారముతో నైనను ఆరంభము కావచ్చును. ఒక దినమునకన్న రెండవ దినమున, రెండవ దినమునకన్న మూడవ దినమున సాయంకాలములయందు జ్వరము హెచ్చుచుండును. ప్రాతః కాలములయందు జ్వరము తగ్గుచుండును. ఉద

రము పచ్చిపుండువలె నుండి ఒత్తిన బాధగా నుండును. ఉదరముపై నెర్రని పొక్కులు పుట్టును. తరుచుగా విరేచనము లగుచుండును. ఒకవారము జరుగునప్పటికి ప్లీహము పెద్ద దగును. చికాకు ఆరంభమగును. చికిత్స జాగ్రత్తగా చేయక అవకతవకలు చేసినయెడల రోగము విషమించును. ప్రలాపమును, సంధియును గలుగును. ధాతువు శోషించి, దోషించును. వడి యెక్కువగును. కన్నులు తెరచి చూచునుగాని యెవరిని రోగి గుర్తుపట్టలేడు. ప్రేగులయందలి పుండ్లు పెద్దవై ప్రేగులయొక్క ఆవరణపు గోడయందు రంధ్రము లగును. ఆ యాఘాతమువలనను, రక్తాతిసారమువలనను మరణము గలుగును.

ర క్త వి షీ క ర ణ ము (Septecemia): ఒకానొక ప్రదేశమునందు కుర్రుపు పుట్టి మంటలతో గూడియుండుట. జ్వరము, చెమటలు, నీరసము నిండుండును.

వ్ర ణ ము (Pyemia): చలి చెమటలతో గూడిన వరుస జ్వరము లుండును. రోగి చిక్కి, నీరసపడి యుండును. వ్రణమువలన నివి గలుగునని గుర్తించి వ్రణమును కనిపెట్టి చికిత్స చేయవలెను.

హా రి ద్ర జ్వ ర ము (Yellow fever): అత్యుష్ణమండలములందున్న ఆరోగ్యనియమములును, శౌచమును నెరుగనివారికి మాత్ర మిది గలుగును. జ్వరలక్షణము లన్నిటితోను కలిసి అకస్మాత్తుగా ప్రత్యక్షమగును. ఇందు రోగికి అమితమగు నీరసముండును. రోగియొక్క దేహమంతయు ఒక విలక్షణమగు పసుపుపచ్చని రంగుగల దగును. నాడి నీరసముగ నుండును. అమితమగు వాంతు లుండును.

చ లి జ్వ ర ము (Malaria): చలి, కుదుపు, చెమటలు, జ్వరము నిందలి లక్షణములు. ప్రతి 48 గంటలకుగాని 72 గంటలకుగాని 96 గంటలకుగాని ఒకతూరి యిట్టి జ్వరము గలుగును. వీనికి ద్వితీయక, తృతీయక, చాతుర్థిక జ్వరములని పేరు. ఒకేతూరి విపరీతమగు జ్వరము గలిగి చలి, కుదుపు (వణకు) గలుగును. ఈ చలి 10 నిమిషములు మొదలు 2 గంటలవరకు నుండును. జ్వరముయొక్క వేడి 104 మొదలు 106 డిగ్రీల వరకు నుండును. తరువాత జ్వరము కందిపోవును. దేహమంతయు నెర్రబడును. మంటలును, తాపమును, దాహమును నుండును. తలనొప్పి యుండును. నాడి అమితమగు వడితో కొట్టుకొనుచుండును. ఈ దశ $1\frac{1}{2}$ గంటలు మొదలు 5 గంటలవరకును పట్టును. అటుతరువాత దేహమంతయు అమితమగు చెమట గలిగి జ్వరలక్షణము లన్నియు ఆగిపోవును. తిరిగి రోగికి నీరసముతప్ప నెట్టిబాధయు నుండదు. చర్మము రంగు చెడును. ప్లీహము లావగును. రోగికి బలహీనత గలుగును.

మా ం స సం తా ని క (Measles): చిన్నపిల్లల కిది గలుగును. జ్వరము క్రమముగా వృద్ధిపొందును. చలియు, జ్వరమును నిందలిలక్షణములు. నాలుగవరోజున దేహముమీద నలుపుతోగూడిన యెరుపురంగు గలమెత్తని పూత గలుగును. వాని యాకృతి చంద్రఖండములవలె ◡ నుండును. తరువాత 2, 3 దినములలో జ్వర మాగిపోవును. తరువాత పొక్కులన్నియు ఊడి పొట్టు రాలిపోవును. ఈ పూత పూయుటకు ముందు నోటిలో దంతములకు నెదురుగా దవుడలోపల నెర్రగాకంది దానిపైన నీలిరంగుగల పొక్కులు పుట్టును.

**జర్మన్ మాంససంతానిక (Measles):** దీనినే సీమపొంగు లందురు. ఇదియును మాంస సంతానికవలెనే లక్షణములుగలిగి యుండును. పొంగు ఇంకను నెర్రగా నుండును. జ్వరమువచ్చిన రోజుననే పొంగు కాన్పించును.

**ఆటలమ్మ (Chickenpox):** ఇదియును శిశువ్యాధులలోనిదే. కొద్దిజ్వరముతో ఆరంభమగును. నెమ్మదిగా వృద్ధిబొందును. ఆటలమ్మ పొక్కులు మొదటిదినముననే గాన్పించి వృద్ధి బొందును. 2, 3 దినములలో జ్వర మాగిపోవును. పూతయును జారిపోవును.

**రక్తజ్వరము (Scarlatina):** ఇదియును శిశువ్యాధియే. జ్వరము అకస్మాత్తుగా వచ్చును. చిన్నబిడ్డగుణముండవచ్చును. నడుమునొప్పులును వాంతులు నుండును. జ్వరము 104 డిగ్రీలవరకు వృద్ధియగును. నాడి వడిగాకొట్టుకొనును. మొదటి దినమే పూతకాన్పించి క్రమముగావృద్ధిబొందును. చర్మము ఎర్రబడును. ఎర్రని యిసుకరేణువుల వలె పూతకాన్పించును. స్వరపేటికయందు దాహముండును. ఉపజిహ్వాయు నుండును. నాలుక బిరుసుగా నుండును. జ్వరముతగ్గి, పూతజారుటకు 3,4 దినములు పట్టును. చర్మముతోడుపు ఊడి పోవును.

**మశూచికము (Smallpox):** ఇది తఱుచుగా శిశువులకును, అరుదుగా నితరులకును గలుగును. ప్రతిదేశమునందును మశూచికము కలిగిన ఆవుదూడ మశూచికపు పొక్కులలోని రసిని ప్రజలరక్తములోని కెక్కించి టీకాలు వేయుచున్నారు. ఇందును విలక్షణమగు జ్వర ముండును. దేహమంతయు పొక్కులుపుట్టి, చీము పోసి, యెండి, పొక్కులు రాలిపోవును. నడుము నొప్పియు, వాంతులును, తలనొప్పితోగూడిన జ్వరము అకస్మాత్తుగా ప్రారంభించును. పూత కనబడువరకును హెచ్చుజ్వర ముండును. పూత కనబడినతరువాత జ్వరమును, దానితోగూడిన యితరలక్షణములును తగ్గిపోవును. గట్టిపొక్కులు నాలుగవనాడు కాన్పించును. 6 వ నాడు మెత్త పడి మధ్యభాగము దిగబడును. 8 వ నాటికి చీములు పోసికొనును. తరువాత జ్వరమును దాని తోనుండిన యితరలక్షణములును తిరిగి ప్రత్యక్ష మగును. 10 వ నాటికి పూత పక్కులు గట్టును. జ్వరమును తగ్గిపోవును. మంటలును తగ్గును. చర్మ మీపూతలో చెడిపోయిన యెడల చర్మము నందు గుంట, లేర్పడును.

నిర్బంధమగు టీకాలువేయుటను అన్నిదేశముల వారును నిరసించుచున్నారు. చికాగోనగరమున నిర్బంధమగు టీకాలువేయుటను తీసివేసినారు. టీకాలువేయుట క్రిమినల్ నేరమని జార్జి బెర్నార్డ్ షాగారు 1926 సంవత్సరము సెప్టెంబరు ఫిజికల్ కల్చర్ పత్రికలో నిరూపించియున్నారు. టీకాలు వేసినవారిని శిక్షించుట అవసరమని యాతడు చెప్పినాడు. తనకు మశూచికము కలిగెననియు టీకాలువేయించుకొనకపోయినను తాను మశూచికమును కుదుర్చుకొంటిననియు నాతడు వ్రాసెను. "సూర్యకాంతి, యుక్తమగు ఆహారవిహారములు, శౌచము, ఆరోగ్యనియమములు, టీకాలు వేయకుండుట — వీనివలననే మశూచికము రాకుండ ఆగిపోవునని యాతడు వ్రాసినాడు.

**ముఖోవర్ణము (Erysipelas):** చర్మముమీద మంటలు గలిగి త్వరగా వృద్ధిబొందును. జ్వరము, మంటలు అకస్మాత్తుగా గలుగును. మొదటి దినమున నెర్రని మచ్చలు, పొడిగను, మంట లతో గూడియు పుట్టును. అంచులు కొంచెము పైకి ఉబ్బియుండును. మంటలతో గూడిన యీ

మచ్చలు మధ్యభాగమున నయమై ప్రక్కలకు వ్యాపించును. ఈ మచ్చలు సాధారణముగా ముఖముమీదనే పుట్టును.

మేదోమజ్జాగతజ్వరము (Cerebrospinal-fever): మెదడునందును, వెన్నుపామునందును నుండు మూలుగునందలి దోషములచే నీజ్వరము కలుగును. చలి, జ్వరము, వాంతులు, వెన్నుపాములో నొప్పితో గూడిన యీ వ్యాధి అకస్మాత్తుగా ఆరంభించును. వెన్నుపామునకు సంబంధించిన కండరములందు ఈడ్పు (Contraction) కలిగి తల, మెడలు, వెన్నుపాము బిగదీయును. తల వెనుకకు నీడ్చుకొనిపోవును. ప్రలాపమును, సంధియును ఉండి తరువాత మగత (Coma), మూర్ఛ గలుగును. కపాలనాడులయందును, మజ్జానాడులయందును, ఉద్రేకము పుట్టును. తొడయును, దేహమును సమకోణముగా L నేర్పడును. మిగతకాలు చాచుటకు వీలుండదు. ఇట్టి వ్యాధి నయమైనతరువాత గుడ్డితనమో, చెవుడో, మానసిక దౌర్బల్యమో, పక్షవాతమో నిలిచిపోవును.

చెవివాపు (Mumps): ఇది శిశువులకు కలుగు వ్యాధి. చెవిక్రింద నుండు గ్రంథులు వాచును. అందు తాపము బుట్టును. రెండుచెవులకు నెదురను, దిగువను వాపును, నెమ్మది నెమ్మదిగా వృద్ధిపొందు కొద్ది జ్వరమును కల్గును. ఆహారము నమలుటకును, మ్రింగుటకును కష్టముగా నుండును.

తరుణమగు కుతికవాపు:— ఇందు కంఠములోపల నుండు కుతుకలు (Tonsils) వాచి మంటలు పుట్టును. గొంతు వేడిగను పొడిగను నుండి మాలిన్యముతో కూడియుండును. కుతుకలు వాచి యెఱ్ఱపడియుండును. వానిపై పచ్చని మచ్చలుండును. కుతుకలయందును, చుట్టుప్రక్కలను చీము కలుగును. ఆహారము నమలుటకు వీలుండదు.

సర్పి (Diphtheria) : కుతుకలు, సప్తపథ, స్వరపేటికలయందలి తాంతవ పదార్థ (Fibrous) ములందు మంటలు పుట్టును. కంఠము బిగుసుకొనిపోవును. కొద్దిజ్వర ముండును. సప్తపథ, స్వరపేటిక, కుతుకలు, అంగిలి వాచి యెఱ్ఱబడును. రోగగ్రస్తమైన భాగములమీద ఒక తెల్లని పొర ఆరంభమై క్రమక్రమముగా చుట్టుప్రక్కల నాక్రమించుకొనును. ఆపొర మిక్కిలి కష్టముమీద ఊడిపోయి నెత్తురుకారునట్టియెఱ్ఱని పొర యుండును. తిరిగి తెల్లనిపొర యారంభించును. ఆహారము నమలుటకును మ్రింగుటకును మిక్కిలి కష్టముగా నుండును. స్వరపేటికయు, సప్తపథయు నిట్లు చెడినయెడల శ్వాసకు ఆటంకము కలుగును. ఇందలి మాలిన్యములు ఎక్కువగా నున్నయెడల రోగిశక్తులు క్రుంగిపోయి మూర్ఛ (మగత) కలుగును.

కోరింతదగ్గు (Whooping cough): శిశువులకిది గల్గును. శ్వాసాశయములందలి ఆమత్వచమున విదాహము కల్గును. ఈ వ్యాధికి రెండు దశలు. అందు మొదటి దశయందు చలియు సప్తపథయందును, స్వరపేటికయందును మంటలును, తేలికయగు దగ్గును నుండును. ఒకటి రెండు వారముల తరువాత దగ్గు తెరలు తెరలుగా వచ్చును. చాలసేపు దగ్గు కలిగి ఒక దీర్ఘమగు ఉచ్ఛ్వాసము కల్గును. అప్పుడు ధ్వని కూడ కలుగును. దగ్గునపుడు ముఖము ఎఱ్ఱపడును. కన్నులు వాచి గుడ్లు వెళ్లుకొనివచ్చును. తరువాత వాంతి కలుగును.

**ఆమవాతజ్వరము**— ఇందు అన్నిసంధుల యందు మంటలును పోట్లును ఉండును. వ్యాధి అకస్మాత్తుగా ప్రారంభించును. అప్పుడు ఒకసంధిలోగాని, ఒకకీలులోగాని, కీళ్లన్నిటియందుగాని నొప్పులు పుట్టును. కీళ్లన్నియు నెఱ్ఱపడి వేడిగా నుండును; వాచును. నొప్పులవలన పచ్చిపుండువలెనుండును. ఒక్కకీలునందు బాధతగ్గినయెడల మఱొక కీలునందు హెచ్చును. మూత్రము రానే రాదు. వచ్చినయెడల మిక్కిలి ఆమ్ల (పుల్లని) స్వభావము కలిగి చిక్కగా నుండును. రోగికి నీరసముండును. ఎక్కువగా చెమట పోయును.

**అంకిలికలుసుకొనిపోవుట**: దీనికి తరువాత ఒక పుండు పుట్టును లేదా ఒక రంధ్రమేర్పడును. రోగము అకస్మాత్తుగా ఆరంభమగును. మెడ, దవుడ, ముఖము బిగుసుకొనిపోవును. కండరములన్నిటియందును ఈడ్పు కలుగును. ఆయొడ్డు కబంధమునందలి కండరములయందును, కాలుసేతులయందలి కండరములయందును వ్యాపించి బిగుసుకొనిపోవును. భరింపరాని బాధ యుండును. పండ్లుకరుచుకొనిపోవును. జ్వర ముండును. నాడి వడిగా కొట్టుకొనును. శ్వాస వడియగును. మరణాంతమువరకును మంచి తెలివి యుండును. కొలదిదినములలోనే మరణము కల్గును.

# తరుణవ్యాధులకు సామాన్యమగు స్వాభావికచికిత్స

మందువైద్యులు రోగచిహ్నములను మాత్రమే దృష్టియందుంచుకొని మాత్రలను, చూర్ణములను, కషాయములను నిత్తురు. ప్రకృతిచికిత్సకుడు చిహ్నములకు గాక రోగమూలకారణమగు అన్యపదార్థములను వెలువరించుటకు దేహము నందలి ధాతుశక్తిని వృద్ధిచేయుటకును ప్రయత్నించవలెను. దేశమునందు వైద్యశాసన మున్నయెడల వైద్యశాసనమువలని శిక్షను తగ్గించుకొనుటకు మాత్రము విశాలహృదయముగల ఒక మందువైద్యుని తోడుచేసుకొనవలెను. అనేకులు ప్రకృతిచికిత్సకులిట్లేవ్యవహరించుచుందురు. లైసెన్సుండుటవలన మందువైద్యుల చేతిలో నెందరు చనిపోయినను అతని నేశాసనమును బాధింపదు. ప్రకృతి చికిత్సకునిచేతిలో నొకడు మరణించినను వానిని కోర్టున కీడ్తురు. ఇది వైద్యశాసనమున్న దేశములలోని సంగతి. అక్కడ ప్రకృతిచికిత్సయే చేసినను లైసెన్సుగల మందువైద్యునిద్వారా జరుగవలెను.

ఒకనికి వ్యాధి కలిగినతోడనే గాలియు, వెలుతురును బాగుగా వచ్చునట్టి గదిలో రోగిని పరుండబెట్టవలెను. అవసరమైనప్పుడు మాత్రమే వానిని కదలించవలెను. రోగికి తెలివియున్నంతవరకు వానిరోగముయొక్క తీవ్రతను గురించికాని, అపాయస్థితినిగురించికాని విచారించుటకు సావకాశమును కలిగింపరాదు. ఆతనికిఉత్సాహముకలిగించుచుండవలెను. రోగ నివారణము తప్పక కలుగుననియు, ఇట్లే అనేకరోగములు నివారింపబడెననియు వానికి నచ్చచెప్పుచుండవలెను.

జ్వరమును, అజీర్ణమును ఉన్నప్పుడు రోగిని తగినంతకాల ముపవాసముంచవలెను. ఆ యుపవాస కాలమున వానికి చల్లని నిర్మలమైన నీటి నిచ్చుచుండవలెను. అప్పుడప్పుడు కొంచెము నారింజ రసము నీయవచ్చును. జ్వరమును, అజీర్ణమును సాధారణముగా నయమగును. ప్రతిఉదయము సాయంత్రమున నులివెచ్చని నీటితో ఎనిమా చేసి వేడినీటితో దేహమంతయు బాగుగాకడుగ

వలెను. వెన్నుపాము, మెడలు, మృదువుగా మర్దన చేసి వేడినీటికాపడము పెట్టవలెను.

ఎనిమాచేయుటను గురించియు, మలపదార్థమును వెలువరించుటను గురించియు, దానివలన రక్తము నందు శుద్ధి కలుగుటను గురించియు ముందు ప్రకరణములలో వివరింపబడును ఎనిమాచేయుట వలన దేహమునందలిమాలిన్యములు వదలిపోయి నాడులయందు బలమేర్పడి ధాతువులు బలపడి రోగనిరోధకశక్తి వృద్ధిపొందు నని జ్ఞాపక ముంచుకొనవలయును.

ఏచికిత్సయైనను నెక్కువగా చేయరాదు. రోగి యొక్కశక్తి ననుసరించియు, రోగముయొక్క తీవ్రతనుబట్టియు నేవేని ఒకటి, రెండు ప్రక్రియల నేరుకొని చికిత్సచేయవలెను. చికిత్సలతో రోగిని విసిగింపరాదు. చికిత్సాప్రక్రియలలో ఉష్ణోదకశీతలోదకస్నానములు, ఉష్ణోదకప్రక్షాళనములు, స్వేదశీతబంధములు, ఆవిరి, సూర్యకాంతి, వెలుతురు, కూనేస్నానములు, సూర్యకిర .చికిత్స, బలమునిచ్చు వ్యాయామములు, మర్దన, వెన్నుపాము సరిచేయుట, ఎనిమా, మలముశోధనచేయు ఆహారము, నీరుత్రాగుట, ఫలరసములు త్రాగుట, రోగనివారకమగు చలనములు, మానసిక చికిత్స మొదలగునవి వాడవచ్చును.

# కాలికవ్యాధుల చిహ్నములు

దేహతత్వమునందు సామాన్యముగాగలుగుకాలికవ్యాధుల చిహ్నముల కొన్నింటి నిచట వివరించుచున్నాము:

ఆమ్లమూత్రము : కండరములయందును, సంధుల యందును నొప్పు లుండును. తలనొప్పి, నాడులయందు మంట, చర్మవ్యాధులు నుండును. అగ్నిమాంద్యము, రక్తపుపోటు (Blood pressure) నుండును. మూత్రము తక్కువగాగాని, నల్లగాగాని యగును. ఎక్కువైన మూత్రికామ్లముతో కలిసి ఆమ్లస్వభావముగల మూత్రము చాలకొద్దిగా నగుచుండును. ఇదిక్రమముగా ఆమవాతముగాగాని, మేహవాతముగాగాని మారును. అందు మాంసకృత్తులు తిన్నగా జీర్ణముగాక దేహమునందు నిలిచిపోయి రోగమును కలిగించును. దేహమునందు ప్యూరిన్ అను పేరుగల మూత్రలవణములు ఎక్కువగ నుండును.

అతిమూత్రము : తక్కువ బరువుగల (Specific gravity) మూత్ర మెక్కువ పరిమితితో నగును. దాహ మెక్కువగా నుండును. చర్మ మార్చుకొనిపోయియుండును. ఇంక నితరలక్షణము లేవియు నుండవు.

మధుమూత్రము : ఈ వ్యాధికి రక్తము నందు చక్కెర ఎక్కువగా చేరియుండును. మూత్రమునందును చక్కెర యెక్కువగానే చేరియుండును. మితముతప్పిన (దయ్యపుఆకలి) ఆకలియు దాహమును నుండును. దేహమునందు బలము, తూకము తగ్గిపోవుచుండును.

ఆమ్లపిత్తము : కర్బనహైడ్రజములు మిక్కిలి తక్కువగను, మాంసకృత్తులు క్రొవ్వుపదార్థములు మిక్కిలి యెక్కువగనునుండు పదార్థములు తినుటవలన నీవ్యాధి కలుగును. శ్వాస కఠినముగా వచ్చుట, తలనొప్పి, ప్రలాపము, జ్వరము నాడి వడిగా కొట్టుకొనుట, గాలి వదలునప్పుడు

తియ్యని వాసన కలిగియుండుట, మగతగా నుండుట, మూర్ఛ యీరోగలక్షణములు.

**మూత్రరక్తము:** మూత్రపిండములు తిన్నగా పనిచేయక దేహమునందు మాలిన్యములు నిలిచిపోయినప్పు డీవ్యాధి కలుగును. మూత్రపిండములందు దాహ ముండును. మూత్రమునందు మూత్రలవణములుతగ్గి శ్వేతధాతువు(albumen) ఎక్కువగును. బద్ధకమును కఠినమగు శ్వాసయు నుండి చర్మము రంగుమారియుండును. తలనొప్పి, తలదిమ్ము, అతినాగము, వాంతులు నుండును. ముక్కువెంట నిదలుగాలిసైతము మూత్రపువాసననే కలిగియుండును. అనగా దేహ మంతయు మూత్రముతో నిండియున్నదని యర్థము.

**మేదోవృద్ధి:** అమితమగు క్రొవ్వు దేహమంతయు నిండియుండి ఆహారముచేతగాని వ్యాయామముచేతగాని వెలువరించ శక్యముగాక యుండును.

**స్కర్వీ:** ఆహారపదార్థములందు లోహలవణములును, విటమినులును అనగా జీవసత్తులును లోపించియున్నప్పు డీవ్యాధి కలుగును. రోగికి రక్తక్షయమును, బలక్షయమును నుండును. (దంతపు) చిగుళ్లు ఉబ్బి యుండును. ఆమత్వచమునందును, రసిపారనుండియు రక్తము స్రవించును. కూరలు, పండ్లు తినుటవలన నీవ్యాధి తగ్గును. వీనినితినని లోపమువలన నీవ్యాధి కల్గినదని గుర్తింపవలెను.

**మలవిషీకరణము:** ప్రేగులయందుండి మలము వెడలిపోక దేహమునందలి ధాతువులలోచేరి వానిని విషయుత మొనర్చును. తలనొప్పి, తలదిమ్ము, బద్ధకము, నీరసము, నిద్రలేమి, అగ్నిమాంద్యము, గజ్జి, చిడుము, నోటిపూత, సప్తపథయందు దాహము, దుర్గంధముతోకూడిన మలము మొదలగునవి దీనిలక్షణములు. మలబద్ధకముపోయిన నీలక్షణము లన్నియు తగ్గిపోవును.

**కర్బనహైడ్రజవిషము:** ఆహారమునందు కర్బనహైడ్రజము లెక్కువగా నున్నప్పు డీవ్యాధి కలుగును. అమ్లమూత్రమునందు వలెనే యిందును నితరలక్షణము లుండును. కాని యిందు మూత్రమునందు మూత్రికామ్లమునకు బదులు శిలామేహ ముండును.

**ఆమ్లాహారజవిషము:** ఆమ్లములను కలిగించునట్టి పాలు, పప్పు, పిండి మొదలగు పదార్థములను నెక్కువగా తినుటవలన నీవ్యాధి కలుగును. పుల్లనిఫలరసము లీజాబితాలో జేరవు. అవి దేహమునందలి ఆమ్లముల తగ్గించుటకే సహాయపడును. ఆహారమును గూర్చిన పాఠమునందీవిషయము విపులముగా చర్చింపబడును. ఈ వ్యాధియొక్కలక్షణములు: నరములు దుర్బలముగా నుండుట, నిస్సత్తువ, నిద్రలేమి, తలనొప్పి నాడులయందు మంట, కండరములయందును కీళ్లయందును నొప్పులు, అగ్నిమాంద్యము, అపానవాతము, గజ్జి, చిడుము, జలుబు, మూత్రమునందు పులుపు ఎక్కువగా నుండుట. ఆహారమునందు మార్పుకలిగించినంతనే పైచిహ్నములన్నియు తగ్గిపోవును.

**క్షయ:** జ్వరము సాయంతనములయందు వృద్ధిపొంది ఉదయములయందు తగ్గుచుండును. రాత్రులయందు చెమట పోయును. దేహమంతయు పచ్చనిరంగుగా నుండును. బలహీనత, రక్తక్షయము, మాంసము ఆర్చుకొనిపోవుట, అగ్నిమాంద్యము నుండును. మలమూత్రములందును, కఫమునందును, క్షయసూక్ష్మజీవులను బట్టి యీ వ్యాధిని తెలుసుకొందురు. రోగముయొక్క ప్రా

రంభదశయందు పలుచనికఫముతో కూడిన దగ్గు ఉండును. భుజములయందును, గుండెయందును నొప్పి యుండును. స్టెతెస్కోపుతో వినినప్పుడు, ఉచ్ఛ్వాసనిశ్వాసములు పీల్చునప్పుడు ధ్వనియె క్కువగాను, మాట్లాడునప్పటిధ్వని దుర్బలము గను వినిపించును. రోగ మింక కొంచెము ముదిరినప్పుడు కఫము చిక్కబడి కుదుపలుగా నేర్పడును. ఇంకను రోగము ముదిరినయెడల శ్వాసాశయములందు రోగపదార్థముచే నిండినకోశము లేర్పడి పైజెప్పిన లక్షణములు మరింత తీవ్ర రూపముతో గాన్పించును.

క్షయరోగమునకు చికిత్స: మందు వైద్యులుసైతము, ప్రకృతిచికిత్సవలనమాత్రమే యీవ్యాధి కుదురునని యొప్పుకొని యున్నారు. ప్రకృతిచికిత్సవలనసైతము ఈవ్యాధి ప్రారంభమునందే చికిత్సచేసిన సులువుగా కుదురును. రోగము ముదిరినయెడల నయముకాకుండుటయు కలదు. సూర్యకాంతి అత్యంతగుణము నిచ్చును. కొందరు ఎలక్ట్రిక్ దీపమును సైతము వాడెదరు. కాని అది మితముగా కాక యెక్కువగా వాడిన యెడల దౌర్బల్యము కలిగించును. పరిశుద్ధమగు వాయువుసైత మీవ్యాధి కత్యంతగుణయుత మైనది. మనశ్శాంతియు, విశ్రాంతియు నీరోగమునకు మిక్కిలి అవసరమై యున్నవి. ఆహారమును నెక్కువగా నీయరాదు. రసయుతములగు ఫలములను, కొలదిగా ఉడికించిన లేతకాయ గూరలను, ఆకలితీరువరకుమాత్రమీయవచ్చును. తగుమాత్రము వ్యాయామ మవసరమైయుండును. అది చేయలేనియెడల ఆరుబయటగాలిలో పరుండుట మంచిది. లేదా యొకరు దేహమునకు మర్దన చేయుచుండవచ్చును. వెన్నుపాముసందలి పెళుసుదనము పోవుటకై అచ్చట మృదువగు మర్దనము చేయవలెను. రోగియొక్క మానసికస్థితివలన రోగనివారణమునకు సాయము కల్గింపవలెను. అతనికి ధైర్యోత్సాహములు కలిగింపవలెను. ఇట్టిరోగములు వచ్చి, రోగము పోగొట్టుకొనినవారిచరిత్రములు చదివి, చెప్పి వానిరోగముసైతమట్లే నివారణమగునని వానినచ్చచెప్పవలెను. వానికి నిరుత్సాహము, భయమును స్థిరమగునేని మన కపజయ మాసన్నమైనదని గ్రహింపవలెను. ఆదిత్యపేటికాస్నానమువలన అద్భుతమైన గుణము కల్గును.

ఉపదంశము (సవాయి): ఈ కాలిని వ్యాధికి మూడుదశలు కలవు. మొదటిదశలో గట్టికదుము, దానిపైన పుండును కలుగును. ఇదిసాధారణముగా లింగాగ్రచర్మముచివర కలుగును. సవాయిసంబంధమగు మాలిన్యము తగిలిన యెడల దేహమునందలి యేయితరభాగమునైనను నిది కలుగవచ్చును. రోగ మంటిన 15 మొదలు 20 దినములుతరువాత నీవ్యాధి కాన్పించును. రెండవదశయందు దేహమునందంతటను కురుపులుపుట్టును. నోటియందలి ఆవత్వచమునందును ఈకుర్పుల్లుపుట్టును. గొంతునందసైతమిట్టివియే కలుగును. కనీనికయందు మంటలు పుట్టును. కీళ్ల నంటియుండు పొరయందున మంటలు పుట్టును. లింగాగ్రముమీద పుట్టిన కొరుకుడు (పుండు) పుట్టిన 6 మొదలు 12 వారములలోపల నిది కలుగును. చివరదశలో సంధాతువును (Connective tissue) చీల్చుకొని సన్ననికాయలు చర్మము మీదికి పొడుచుకొని వచ్చును. అవి చిట్లి పుండ్లగును. దేహమునందలి యేయొక్కభాగమునందైనను నిట్టిలక్షణములు కాన్పింపవచ్చును.

రికెట్సు: ఇది శిశువులయందు కలుగువ్యాధి. ఎముకలు సరిగా నుండక వంకరగా నేర్పడును.

అంతరవయవములయందును రోగ ముండును. ఇది ఆహారమునందలి లోపములవలన కలుగును. ఇది ఎముకలు మెత్తపడి క్రొత్తధాతువు లేర్పడును. అందువలన ఎముకలు సరిగా కదలవు. కీళ్లుండుచోట్ల ఎముకలచివరలు లావుగా నుండి, కీళ్లు వంచుటకు వీలులేకయుండును తల లావై చదరముగా నేర్పడును. ఈవ్యాధివలన దొడ్డికాళ్లు ఏర్పడును.

# కాలికవ్యాధులకు స్వాభావిక చికిత్స

తరుణవ్యాధులకును, కాలికవ్యాధులకును చికిత్స యందు భేద మెంతమాత్రమును లేదు. ఇందును దేహమునందలి మాలిన్యములను వెలువరించుట, దేహతత్వమునుబలపఱుచుట- యివియే ప్రధాన విషయములు. దేహమునందు చిరకాలమునుండి చెడియుండిన అంతరవయవముల క్రియలు సహజ స్థితిలోనున్నట్లే వా రనుకొనుచుందురు. కాని అంతరవయవములు చిరకాలముక్రిందటనే పాడయి వారి దేహములందు చిరకాలమునుండియు రోగ ముండును.

ఆమ్లపిత్తమును కుదుర్చుటకు క్రొవ్వుపదార్థములును, మాంసకృత్తులును తగ్గించి పిండిపదార్థములను, తీపిపదార్థములను ఎక్కువ పుచ్చుకొనుచుండవలెను.

మధుమూత్రమునందు ఆహారవిషయమున శ్రద్ధ తీసికొనవలయును. 3 మొదలు 7 దినములవర కుపవసింపవలెను. తరువాత కర్బనహైద్రజములు లేని ఆహారముల నిచ్చుచు మూత్రమునందలి మధుపదార్థ మెంతతగ్గినదో చూచుచుండవలెను. తరువాత కర్బనుహైదజాహారములను కొలదిగా చేర్చి తినవలెను. అప్పుడును మూత్రమునందలి మధుపదార్థము పెరుగకుండునట్లు చూడవలెను. దేహమునందలి మాలిన్యమును వెలువరించునట్టి తవుడు, కాయగూరలు, పండ్లుమొదలగు వానిని ఎక్కువగా తినవలెను. దీనివలన సయితము ధాతుశక్తి వృద్ధియగును. వృక్కకము, పైత్యకోశము— వీనియందలి మాంద్యము తగ్గిపోవును. మలబద్ధకములేకుండునట్లుచూడవలెను. మూత్రరక్తమునందు మాంసము, కోడిగుడ్లు మొదలగు ఆహారములను మానివేయవలెను. మల, మూత్ర, స్వేదములను వెలువరించునట్టి యాహారములనే తినవలెను.

స్కర్వీ, రిక్కెట్సు, అమ్లాహారవిషము, నత్రజనుహైద్రజవిషము— వీనియందెల్ల ఆహారమునందలి మార్పువలన నెక్కువసుగుణము గల్గును. కాయగూరలను, ముఖ్యముగా ఆకుగూరలను తినుటవలన నీవ్యాధులు కుదురును.

మేదోవృద్ధియందు చక్కెర, పిండిపదార్థములు, క్రొవ్వుపదార్థములు బొత్తుగా మానివేయవలెను. వ్యాయామము బాగుగా చేయవలెను.

ఉపదంశమునకు దేహమునందలి మాలిన్యమును వెలువరించి, రక్తమును శుద్ధిచేసి, ధాతుశక్తిని పెంచవలెను. దీనికి ఆదిత్యపేటికాస్నానము లద్భుతముగా పనిచేయును. ఉపవాసములును ఫలాహారములును ఎక్కువ మేలుచేయును.

చలిజ్వరమునందు మలమూత్రములుగాను, స్వేదముగాను దేహమునందలి మాలిన్యమును వెలువరించి రక్తమును శుద్ధిచేయవలెను. జలచికిత్సవలన జ్వరమును తగ్గింపవలెను. మృదుమర్దనము వలన వెన్నుపామునందలి స్థితస్థాపకగుణమును వృద్ధిచేయవలెను.

రోగముయొక్క ఉత్తరదశ (Prognosis) : రోగము సులువుగా నయమగు స్థితికి మంచి ఉత్తరదశయనియు, మూత్రరక్తము, ఆమ్లపిత్తము, క్షయ మొదలగు వ్యాధులయందు రోగ నివారణమగుట మిక్కిలికష్టముగాన దీనికి చెడు ఉత్తరదశ యనియు పేరు.

# ప్రశ్నలు

1. జ్వరలక్షణములను వివరించి ఒకరోగికి జ్వరము కలదని నిరూపించుటకు తగినవిధానముల పేర్కొనవలెను.

2. చలిజ్వరముయొక్క వివిధదశలను, లక్షణములను పేర్కొనునది.

3. మశూచికలక్షణముల పేర్కొనుము - దీని నాపుటకు నేటివారు చేయు వాద మేమి ?

4. తత్త్వమునందు గలిగిన తరుణవ్యాధులకు సామాన్యమగు స్వాభావికచికిత్సలను పేర్కొనుము. మందువైద్యులతో మన కెంత సంబంధ ముండవలెను?

5. చికిత్సచేయుటలో ప్రక్రియ లెక్కువ కాకుండుటకు మన మేమి చేయవలెను ?

6. మలవిషమను రోగముయొక్క లక్షణముల వివరించుము.

7. క్షయరోగము, దానిచికిత్సను వివరించుము.

8. రిక్కెట్సుయొక్కలక్షణములను తెలుపుము.

9. దేహతత్త్వమునందు కలుగు కాలికవ్యాధులకు సామాన్యచికిత్స యేమి ?

10. మధుమూత్రమునకు చికిత్స యెట్లు చేయవలెను ?

కాగితమునకు ఒకవైపుననే వ్రాయవలెను. పాఠసంఖ్య, ప్రశ్నసంఖ్య వేయవలెను. ప్రతికాగితముమీద వరుస సంఖ్య ఉండవలెను. అన్ని కాగితములను కలిపి గుండు సూదితో కుట్టవలెను: లేదా దారము కట్టవలెను.

# ప్రకృతి గృహ వైద్యము

2 వ పాఠము

## ప్రత్యేక వ్యాధులు – వాని చికిత్స

### మలబద్ధకము

“సర్వే రోగాః మలవశాః” అని వాగ్భటసూక్తి. మానవులను పీడించు లెక్కలేనన్ని వ్యాధుల కును మూలమైన దీ మలబద్ధకము. దీనివలననే నొప్పులు, తీపులు, సలుపులు, పోట్లు, మంటలు నేగాక దాదాపు అన్నిరోగములును పుట్టు చున్నవి. ప్రపంచకమునందలి వ్యాధిపీడితులలో మలబద్ధకమువలన బాధపడువారి సంఖ్యయే అన్ని యితరరోగములచే పీడింపబడువారి సంఖ్యకన్న నెక్కువగా నుండును. దేహ మొక కొలిమి. (Furnace) కొలిమికివలెనే మన దేహమునకును పొగ పోవుటకు మార్గ ముండవలయును. లేని యెడల కొలిమి పొగచే నావరింపబడి తిన్నగా మండదు. కరుగవలసిన లోహములు తిన్నగా కరగవు. అట్లే దేహమునందలి ఆహారము పచ నము అయిన తరువాత మలము సక్రమముగా వెడలనిచో తిరుగ తినినపదార్థములు సరిగజీర్ణము కాకుండును. మలములు దేహమున నిలిచిపోయి కాలి, కుళ్లి, మురుగెత్తి, దుర్వాయువును గలిగిం చును. అవి రక్తములో చేరి బలమును, మెదడులో చేరి తెలివిని చెఱచును. తరువాత మరణమును గలుగును. ప్రకృతిచికిత్సకుడు తనవద్దకు వచ్చు ప్రతిరోగికిని కొద్దియో గొప్పయో మలబద్ధక ముండునని యెఱుగును. అనేకులు తమకు మల బద్ధక మున్నదనియే యెరుగరు. వారు తమకు దినమున కొకతూరి విరేచన మగుచున్నదిగాన మలబద్ధకము లేదనుకొందురు. దినమున కొకతూరి మలమోచన మగుచున్నను, ఇంకను మలము 24 గంటలు అనవసరముగా వారి దేహములో నిలిచియే యుండును. పెద్దప్రేగులలో నది 24 గం టల కాలము మురుగుచు, కుళ్లుచు, దుర్వా యువులను గలిగించుచు నుండును. మనము తినిన ఆహారము 8-12 గంటలలోపల జీర్ణమై మలము వెడలిపోవలయును. 16 గంటలలో వెడలి పోయినను నిబ్బంది లేదు. అంత కెక్కువకాలము నిలిచియున్నయెడల అది ఆరోగ్యమును చెడ కొట్టును. దినమున కొకతూరి విరేచనమగు వారికి 8-16 గంటలలో వెడలవలసిన మలము వెడలక నిలిచినయెడల అది యింకను 24 గంటలవరకు పెద్దప్రేగునందు నిలిచి అనేకరోగములకు కారణ మగును. మిచిగానులోని బాటిల్ క్రీక్ ఆరోగ్య సదనాధిపతులగు జె. హెచ్. కెల్లాగుగారు ఆరోగ్యవంతులకు ఎన్నితూరులు భుజించిన అన్నితూరులు విరేచనమగునని సెలవిచ్చి యు న్నారు. ఉదయమున తినినది సాయంత్రమును, సాయంత్రమున తినినది ఉదయమును వారికి వెడలిపోవును.

మలచలన పరీక్ష (Motility test) యని ఒకచిన్న పరీక్ష యున్నది. కూరపసుపో, బొగ్గుపొడియో 5, 6 గురిగింజలయెత్తు భోజనానంతరము మ్రింగి ఆ రంగు విరేచనములో నెప్పుడు కాన్పించునో కనిపెట్టియుండవలెను. ఆమధ్యకాలము మలచలన కాలము అనబడును. ఇట్లు మనము తినిన పదా

స్థము దేహమునుండి వెడలి పోవుట కెన్ని గంటలు పట్టునో తెలియగలదు. అట్లు మనము తిన్న ఆహారశేషము 16 మొదలు 24 గంటల కాలములోగా వెడలిపోవనియెడల మలబద్ధక మున్నదని గ్రహింపవలెను. ఆ రంగు తరువాత కెన్నిగూరులవరకు కాన్పించుచుండునో గుర్తించుకోనవలెను. అటు లెన్నిగంటలవరకు ఆరంగు కాన్పించుచుండునో అన్నిగంటలవరకు మలము ప్రేగులలో ఆటంకపెట్టబడి నిలచియున్నదని గ్రహింపవలెను

మలబద్ధకము మూడురకములు: 1 ప్రేగులయందు తగిన బలము లేక గలుగునట్టిది; హీనబల మన బడును. ప్రేగులు లావై జారి యున్నప్పుడిది కలుగును. 2 ప్రేగులయందు ఈడ్పు గలుగుటచేత మలము జారకుండును. దీనికి సంకోచక మనిపేరు. 3 ప్రేగులయందు కాయలు, కంతులు, గ్రంధులు మంటలు మొదలగునవి యుండి మలమున కాటంకము గలిగించిన అది నిరోధక మనబడును. పొట్టవానియందు బిస్మత్ (Bismuth) నిచ్చి ఎక్సురే (X-ray) పరీక్ష చేసినయెడల నేభాగ మున నెట్టి ఆటంకము గలదో తెలియగలదు.

కఠినములగు మలబద్ధకములందు యెనిమా బాగుగా పనిచేయును. ఎనిమా వాడు నట్టి విధము ముందు వివరింపబడును. కాని ఎనిమావలననే మలబద్ధకము పూర్తిగా నయము కాదు. ఆహార విహారములయందును, అలవాటులయందును మార్పులు చేయుట వలననే యిది కుదురును. తవుడుతోగూడిన ధాన్యములు, కూరగాయలు, ఆకుకూరలు, అత్తిపండ్లు, నారింజ, ద్రాక్ష, బత్తాయి, కమల, ఆలబఖారా, జలదారు, రేగు మొదలగునవి తినుటవలన మలబద్ధకము పోవును. పైపదార్థములు ప్రేగులయందలి కదలికను నెక్కువచేయును. అగర్ (Agar) అనుదాని వాడుకవలన మలబద్ధకము పోవును. తవుడునందు పోషకద్రవ్యములు తక్కువగా నున్నవి కాని మలబద్ధకమును పోగొట్టుటలో నది బాగుగా పనిచేయును. ప్రతిదినము భోజనము చేయుటకు పూర్వము 1, 2 లోటాల వేడినీటిని త్రాగుచుండుట వలనను మలబద్ధకము అంత రించును. పొట్టపైన పెద్ద ప్రేగువెంట సవ్యముగా (Clockwise) మర్దన చేయుటయును మంచిదే. జల, సూర్యకిరణాది చికిత్సలవలనను మలబద్ధకము పోవును. అది మున్ముందు వివరింపబడును. ఆహారశాస్త్రమునకు సంబంధించిన పాఠములు వ్రాసినప్పుడు మలమోచకములగు ఆహారముల వివరింతును.

# ఎనిమాచేయు విధము

ఆసనముగుండ పెద్దప్రేగులోనికి నీరు నెక్కించుటకు యెనిమా ఒక పనిముట్టు. త్వరగా మలమును వెడలించుటకు దీనికి సాటియైన విధానము ఇంకొకటి లేదు. దీనిని సక్రమముగా చేయవలెను. రోగి పండుకొను రీతినిబట్టి దీనిప్రయో



జనముండును. రోగి కుడిచేతిమీద ఒత్తిగిలి పరుండవలెను. ఎనిమాడబ్బా 4, 5 అడుగులయెత్తున కట్టవలెను. డబ్బాలో పోసిననీరు ఎత్తునుండి వచ్చును గాన బరువుగా నుండును గాన రోగి యొక్క పెద్దప్రేగు పైభాగమువరకును ఈ నీరు చేరును.

మొదట 2 పైంటుల అనగా 1 శేరు నులివెచ్చని నీటిని నెమ్మదిగా ప్రేగులలోనికి పోసీయవలెను. మొదట వెంటనే విరేచనము కానుండుబాధ కలిగినయెడల నీటిప్రవాహము నప్పటి కాపవలెను. తరువాత తిరిగి పోసీయవలెను. ఆనీటిని కడుపులో 10, 15 నిమిషములు నిలువ యుంచి అటునిటు తిరుగవలెను. ఇట్లు ప్రతిఉదయమునుగాని, ప్రతి సాయంత్రమునుగాని 1 వారము దినములు చేయుచు, నీలోపున యుక్తమగు పథ్యము తినుచుండవలెను. ఎనిమా అలవాటుగను, యావజ్జీవమును వాడవలసిన ఉపకరణమును కాగూడదు.

## జీర్ణాశయవ్యాధులు

అనేకవ్యాధులను కలిపి అజీర్ణమందుము. ఉదరమునందు పచ్చిగానుండుట, జీర్ణకోశముగాని ప్రేగులుగాని ఉబ్బియుండుట, గుండెలో మంట,పులిత్రేనుపులు,త్రేనుపులు, నాలుకమీదమందముగా పాచి చేరుట, నోరు దుర్వాసన గలిగియుండుట, నోటిపూత, తలనొప్పి, మలబద్ధకము, అతిసారము, గ్రహణి, అస్వస్థత - యీలక్షణము లన్నియు అజీర్ణమునం దుండును.

తరుణమగు జీర్ణాశయ దాహము (acute gastritis): ఆహారమునందలి పొరపాట్ల వలన జీర్ణాశయమునకు లోపలనుండు ఆమత్వచమునందు మంటలు గలుగును.

కాలికమగు జీర్ణాశయ దాహము: అందు నెక్కువగా శ్లేష్మము గలుగును. జాఠరరసము యొక్క స్వభావమునందు మార్పులు గల్గును. జీర్ణకోశకండరములు బలహీన మగును. ఆమత్వచము మొద్దుబారును. అజీర్ణమునకుండు లక్షణములే దీనికిగూడ నుండును. పై పొట్ట పచ్చిగా నుండుటయు, నొప్పియు నుండును. వికారము, వాంతులు, చిక్కిపోవుట యీ లక్షణములుగూడ నుండును




జీర్ణాశయమందు వ్రుండు (Gastric ulcer): జీర్ణాశయమునందు ఆమత్వచము లేకుండపోవును. జీర్ణాశయమునందు వ్రుండు గలిగినప్పుడు భరింపరానంత బాధయు, పోట్లును గలుగును. ఆకలియైనప్పు డిది గలుగును. భోజనమునకు తరు

వాత 1, 2 గంటలవరకును ఈ బాధ తీవ్రము గానుండి ఆహారము వాంతియైనంతనే తగ్గిపోవును. ఆ వాంతిలో రక్తపుజీర లుండును. విరేచనము నందుగూడ నిట్టి నెత్తురుజీర లుండును.

ఆంత్రమూలమున పుండు: (Duodenal Ulcer) ఆంత్రముయొక్క మూలమున ఒక పుండు గలుగును. ఇదియును జీర్ణాశయమునందలి పుండువలెనే యుండును. పై పొట్టయందు బాధ కుడివైపున నుండును.

జీర్ణాశయవ్రణము: (Gastric cancer) ప్రమాదకరమగు మాలిన్యములు జీర్ణాశయము యొక్క ధాతువులను తినివేయుచుండును. 40 సంవత్సరములు పైబడినవారి కిది గలుగును. వీరికి జీర్ణాశయమునందు ఎడతెగనిబాధయు మంటయు నుండును. ఆహారము తినినకొలదిని ఈ బాధ యెక్కువగుచుండును. వెంటనే చికిత్స చేయకున్న ప్రమాదము గలుగును.

## ఆంత్రవ్యాధులు

అతిసారము: ఇది యొకవ్యాధిగాదు, ఒకానొక వ్యాధి కిది చిహ్నము. ఇందు పలుచని మలము అనేకతూరులు అగును.

ఆంత్రశూల: ఆంత్రములయొక్క కండరములయందు ఈడ్పు గలుగును. ఉదరము యొక్క మధ్యభాగమున మెలివేసినట్లు అకస్మాత్తుగా భరింపరాని బాధ గలుగును.

ఆంత్రరసములయందును, కండరములయందును రోగము: ఉదరము యొక్క దిగువభాగమున, భోజనమైన తరువాత 2 గంటల మొదలు 6 గంటలలోపల భరింపరాని బాధ గలుగును.

మలాశయదాహము (colitis): పెద్దప్రేగునందు కాలికమగు మంట లుండును. ఇది మలబద్ధకమువలన గలుగును. విరేచనమగునప్పుడు బాధ గలుగును. పెద్దప్రేగు ముట్టుకొనుటకు వీలు గానంత పచ్చిగా నుండును. మలమునందు శ్లేష్మము చేరియుండును. మలము శ్లేష్మముచే కప్పబడియు నుండును.

తరుణమగు ఆమాశయవ్రణము: (acute appendicitis): క్రిమికయందు తరుణమగు మంట లుండును. రక్తాభిష్యందముతో గూడికాని పుండుతో గూడికాని క్రుళ్లుతో గూడికాని, చీము గల్గిగాని యిట్టి దాహముండును. మొదట ఉదరముయొక్క మధ్యభాగమున తిమ్మిరితో గూడిన మంటలతో అకస్మాత్తుగా ఆరంభమై తరువాత ఆ బాధ కుడివైపున దిగువగా తేలును. అది పచ్చిపుండువలె తగులుటకు వీలుగా నుండును. వికారము, వాంతులు, జ్వరమును ఉండును. మలబద్ధకము తప్పకుండ నుండును. తీవ్రవ్యాధులందు ఆంత్రవేష్టనము Peritoneum నందును నిట్టి దాహము గలుగును.

కాలికమగు ఆమాశయవ్రణము: తరుణవ్యాధివంటి లక్షణములనే గలిగియుండును. ఇది తరుణవ్యాధి ముదిరిన తరువాత నేర్పడును. వీనికి మూలకారణము మలబద్ధకమే.

గ్రహణి: పెద్దప్రేగునందలి ఆమత్వచమున మంటలును, దాహమును గలుగును. అకస్మాత్తుగా నీవ్యాధి వేడితోగూడి ఆరంభమగును. అప్పుడు ఉదరమునందు నొప్పియు, భేదులు నుండును. అనేకతూరులు భేదికి పోవలసినట్లు తోచుచుండును. పెద్దప్రేగు పచ్చిగా నుండును.

మూల వ్యాధి: ఆసనమునందలి సిరలయం దలి మాలిన్యములు చేరి అవి లావెక్కును. వానిని కదలించునట్టి కండరములు తిన్నగా పనిచేయవు. అందువలన నచటి మాలిన్యములు పైకి పోయి శుద్ధిబొందక అచటనే నిలిచిపోవును. ఈస్థితికి కారణము మలబద్ధకము. స్త్రీలయందు గర్భధారణము వలనను నిట్టిస్థితి తాత్కాలికముగ గలుగును. మలము వచ్చినట్లుండుట, తేలికగా రాక ముక్కి-విరేచనము చేయ ప్రయత్నించినప్పుడు రక్తము వెడలును. ఆసనమును పరీక్షించినప్పుడు మెత్తని స్పంజివంటి, యెర్రని, నల్లనికాయలు ఆసనము నుండి బయటికి పొడుచుకొనివచ్చును. ఆసనము లోపలను నిట్టికాయ లుండును.

మూలవ్యాధికి చికిత్స: మూలవ్యాధికి మందు ఆసనమును వెడల్పుచేయుటయే. ఆవిధానము ముందు వివరింపబడును. ఆహారమువలనను, యెనిమావలనను, మలబద్ధకమును పోగొట్టుకొనవలెను.

## జీర్ణాశయ, అంత్రవ్యాధులకు చికిత్స

మలబద్ధకమున్నప్పుడెల్ల ముందు మలబద్ధకమును పోగొట్టవలెను. జీర్ణాశయ వ్యాధులయందును, అంత్రవ్యాధులందును, ఆహారమును సరిచేయుట అనగా యుక్తమగు ఆహారమునే తినవలెను. స్వల్పకాలపు ఉపవాసమును, అందుమీద రసయుతములగు ఫలములును, అటుమీదట మృదువగు ఆహారమును తినుటవలన జీర్ణక్రియ బాగుపడును. అతిసారము లందెల్ల చల్లనినీటిని త్రాగించుచు, ఆహారమును మానివేసి, యెనిమా తరుచుగా చేయుచుండవలెను. లింగస్నానములను చన్నీటితో చేయుట, నీలిసీసాలోని నీటిని మందువలె దినమునకు 6,8 తూరులు తేపకు అర ఔన్సుచొప్పున పుచ్చుకొనుట వలనను నిది కుదురును.

తిన్నగా చికిత్స చేసినయెడల పై వ్యాధు లన్నియు సులువుగనే కుదురును. జీర్ణకోశమునందును, ప్రేగులయందును వ్రణ మున్నప్పుడును, పెద్ద ప్రేగునందు వ్రణ మున్నప్పుడుమాత్రము వ్యాధి కుదురుట నిజముగా కష్టమే.

పైత్యకోశ వ్యాధుల లక్షణములు - పచ్చకామిల: పైత్యకోశమునుండియు,చేదు కట్టునందును ఊరునట్టి పైత్యరసము క్రమముగా ప్రవహింపక నిరోధింపఁబడినప్పు డిట్టి లక్షణములు గలుగును. ఇది యొక స్వతంత్రమగు వ్యాధిగాక ఒకానొక రోగస్థితివలన నేర్పడు నొక దశ. పైత్యరసము జీర్ణాదిక్రియలకు క్రమముగా వినియోగపడక రక్తాది ధాతువులలో చేరుటవలన దేహమున కంతటికిని విలక్షణమగు నొక పచ్చని రంగు గలుగును. కనుగ్రుడ్లు, చర్మము, గోళ్లు, పచ్చనిరంగు గల వగును. అగ్నిమాంద్యమును, మలబద్ధకమును దీనికి తోడుగ నుండియే తీరును. విరేచనము తెల్లగను, వాసనతో గూడియు నుండును. మూత్రమునందు పైత్యరసము చేరి యుండును గాన నదియును పచ్చబడును. వాంతులు, నాడి వడిగా కొట్టుకొనుట, ఒక్కొక్కప్పుడు సంధియు నుండును.

ఇవిగాక పిత్తజములగు కుంభకామిల, రక్తపిత్తము, హాలీమకాది వ్యాధులు గలవు. ఇవి యన్నియు పైత్యకోశమునందలి క్రమము తప్పుట వలననే గలుగును. వీనియం దెల్ల దాదాపు కామిలా లక్షణములే యుండును. అన్నిటియందును పైత్యకోశము ఉబ్బిగాని, గట్టిపడిగాని యుండును,

పైత్యకోశ వ్యాధులకు చికిత్స: జ్ఞానాశయ, ఆంత్రవ్యాధులకువలెనే చికిత్స చేయవలెను. దేహమునుండి పైత్యరసమును వెలువరించుటకై, వేడినీరు త్రాగి వమనమునుగలిగించుట, దేహమునకు స్వేదమును గలిగించుటకై నీలి ఆదిత్య చేటికాస్నానములు నీలివర్ణమును యకృత్తుపై కేంద్రీకరించుట మొదలగు క్రియలను చేయవలెను. నీలి వర్ణోదకమును లోనికి త్రాగుటయును మంచిది. ఉదరమునకు మృదువగు మర్దనచేయుట, చన్నీటితో కటిస్నానముచేయుట, మంచిది. పచ్చకామిల, పసరుచేరుట సులువుగా నయ మగును. మిగత వ్యాధులు నయమగుట సంశయాస్పదమే.

## శ్వాసాశయ వ్యాధులు

తరుణమగు కాస: పెద్ద శ్వాసనాళము, మధ్యరకపు శ్వాసనాళమునందు, దాహము గలుగుటచేత ముక్కువెంట శ్లేష్మరా నారంభించును. చలి యుండును. జొమ్మకెముకయొక్క పైభాగమున,రొమ్మెముకలోపలను నొప్పియు,దగ్గును ఉండును. పెద్ద వాయునాళములపై స్టెతెస్కోప్ నుంచి చూచిన నెండినట్లును అందులోపల తడి యున్నట్లును మనకు తెలియును

కాలికమగు కాస: ఆ శ్వాసనాళములందే దాహ ముండును. కాని బాధ చాల తగ్గియుండును.

కాస సంబంధ మగు ఉబ్బసము: వాయునాళములందు ఈడ్పును వానికి లోపలనుండు ఆమత్వచము (శ్లేష్మపుపొర) నందు వాపును నుండును. శ్వాసకు ఆటంకము గలిగి మిక్కిలి శ్రమపడినగాని శ్వాస క్రిందికి మీదికిని నడువదు. అప్పుడు ఊపిరి ఆడదు. కాళ్లుసేతులు చల్లపడును. దేహ మంతయు చెమ్మటపోయును నాడి బలహీనముగాను వడిగాను కొట్టుకొనును ఉదయములందు మిక్కిలి బాధతోగూడిన పొ దగ్గు ఆరంభమై, క్రమక్రమముగా పలుచబ తరువాత గుండ్రని కుదపలతో గూడిన కఫమ వెడలిపోవును.

శ్వాసనాళికా దాహము: చిన్న వాయ నాళికలయందును, వాయుగోళములయందున దాహము గలుగును. జ్వరమును, శ్వాసనిరోధమును, రొమ్ములో నొప్పియు, కుళ్లినకఫముతో గూడినదగ్గును వేగముతో గూడిన శ్వాసయు నుండును. శ్వాస పీల్చునప్పుడు గుఱక వినిపించును.

శ్వాసాశయముల అరలందు దాహము (Lobar pneumonia): శ్వాసాశయములలోపలి అరలయందు ఒకదానియందుగాని యెక్కువ వానియందుగాని మాలిన్యములు చేరి క్రుళ్లినప్పుడిది గలుగును. ఇది అకస్మాత్తుగా నీ క్రింది లక్షణములతో గూడి కాన్పించును. చలి, పెద్ద జ్వరము, రొమ్ములలో నొప్పి, మిక్కిలి శ్రమతో గూడిన శ్వాస, బాధతో గూడిన దగ్గునందు నెత్తురుతో గూడిన గట్టికఫము నుండును. ముఖ ముబ్బియుండును. రోగగ్రస్తమగు వైపుననే రోగి పరుండుట కిష్టపడును. మొదటి దశలో, రోగగ్రస్తమగు భాగమున రొమ్ము యొక్క కదలిక తగ్గియుండును. శ్వాసధ్వను లెక్కువగా నుండి, ప్రతిధ్వనులు తగ్గియుండును. రెండవ దశలో మాంద్యము ఎక్కువగును. శ్వాసనిరోధముతో గూడియుండును. ఏ చోట చలనము తగ్గియుండునో ఆచోటునందలి శ్వాసాశయపుఅరలన్నియు రోగగ్రస్తమైనవని గ్రహింపవలెను. ఈవ్యాధి 5, 7, 9 వ దినములందు స్వా

మాన్యముగా ముగింపునకు వచ్చును. తరువాత చాల అరుదుగా మాత్రమే అది ముగియును.

తరుణమగు పృష్ఠ సదాహము: శ్వాసాశయములకు వెలుపలి ఆవరణగను, ఉరమునకు లోపలి ఆవరణగను నేర్పడిన రసి పొరయందు తరుణమగు దాహము గలుగును. బాధలు అకస్మాత్తుగా ఆరంభమగును. రొమ్మునందు దిగువభాగమున తీవ్రమగు బాధ లారంభమగును. చలియును తరువాత తీవ్రమగు జ్వరమును గలుగును. శ్వాస పీల్చినప్పుడు మిక్కిలి బాధలు గలుగును. అందువలన శ్వాస కఠినముగను, బాధతోడను గూడియుండును. దగ్గు పొడిగా నుండును. మొదటిదశలో రోగగ్రస్తమైన భాగమున కదలిక తక్కువగా నుండును. లోపల రాపిడి యున్నట్లు ధ్వని వినిపించును రెండవ దశలో, లోపలి అవకాశములు ఉబ్బును. హృదయముయొక్క స్థానము మారును. రోగి పరున్న వైపునకు హృదయము జారుచున్నట్లు కాన్పించును.

ఇవిగాక యింకను అరుదుగా కాన్పించు నితర శ్వాసాశయవ్యాధులును గలుగును. ఏ వైద్య గ్రంథమునుండియైనను వాని లక్షణములను గ్రహింపవచ్చును.

శ్వాసాశయవ్యాధులకు చికిత్స: ప్రకృతి చికిత్సకునకు తరుణవ్యాధు లన్నియు ఒకేవిధమగుచికిత్సతో కుదురునని తెలియును. ఏ రోగమెచ్చట పుట్టినను, ఎట్టి స్వభావము గలదైనను నిదివరకు ౬వ పాఠములో చెప్పినట్లు తరుణ రోగచికిత్సలచేతనే కుదురును. రొమ్ముపైన దీర్ఘకాలము చేసిన వేడినీటికాపడము వలనను, వెన్నుపైన పైభాగమున చేసిన శీతలోపచారములవలనను మిక్కిలి మేలు గలుగును. శ్వాసాశయములందు చేరినమాలిన్యములు వెడలిపోవును. ముందు పాఠములలో రొమ్మును విరివిచేయుటకును, వెన్నుపూసలను సరిచేయుటకును కొన్ని వ్యాయామములు వివరింపబడును. వానివలన శ్వాసాశయవ్యాధులు నివారణమగును. వానిని అవలంబింపవలెను.

కాస, శ్వాసాశయజ్వరము, శ్వాసాశయములందు కఫము చేరుట, మాలిన్యములుచేరుట మొదలగువానియందు శ్వాసాశయములందలి రక్తపుపోటును తగ్గించుటకు ప్రయత్నింపవలెను. కాళ్లు చేతులు వేడినీటితో కాచుట; ధారాళమగు గాలిని పీల్చుట, యెండలో తిరుగుట, పరుండుట, కూర్చుండుట, శ్వాసాశయవ్యాయామములు చేయుటవలనను, కుదురును. ఆదిత్యపేటికాస్నానములు మిక్కిలి అద్భుతముగా పనిచేయును. వెన్నుపాముమీదను ఉదారంగును కేంద్రీకరించుటవలనను మేలు కలుగును.

## సంధులయందును, కండరములందును గలుగువ్యాధులు

తరుణమగు సంధిదాహము: సంధికీలునకు చుట్టునుండు లోపలిపొరయందుదాహము గలుగును. కీలు కదల్చినప్పుడు నొప్పిగలుగును. ఆ భాగము వాచినట్లును. లోపల చీము చేరినట్లును తాకిచూచిన తెలియగలదు. స్వేదబంధము (చెమట పోయుటకుగాను వేయు గొంగళిచుట్ట) నర్ణ కేంద్రీకరణమువలన నిది సులువుగా కుదురును. ఆరగా ఆరగా ఒండు మట్టి కట్టుటవలనను నిది కుదురును. మర్దనము, చలనము, వ్యాయామములవలనను నిది కుదురును.

చచ్చు: కండరములయందు సంపూర్ణము గనో, కొలదిగనో, స్థితస్థాపకగుణము తగ్గినప్పు డును నాడులందలి దోషమువల్లను గల్గును. అస్త్యపేటికా స్నానమువలన దేహమునందలి రక్తమును బాగుపరచి ఆచచ్చుపడిన భాగముల యొక్క క్రియను బాగుపరచుటవలనను, చెడి పోయిన భాగముమీాద మట్టిపట్టీలు వేయుట, వర్ణకేంద్రీకరణమువలన ఆ ప్రదేశమునందు ఉద్దీపనపరచుటవలనను కుదురును.

## హృదయకోశవ్యాధులు

హృత్కోశదాహము (Acute Pericarditis): హృదయమున కావరణగా నేర్పడిన రసిపొరయందు తరుణమగు దాహము గలుగును. హృదయముమీాద కొద్ది బాధ యుండును. హృదయధ్వనులు బలహీనముగా నుండును. అస్పష్టముగా నుండును. కాలికమగు హృత్కోశదాహమునకు లక్షణము లివ్వే యుండును. రసిపొరయందు ద్రవము నిండియుండవచ్చును.

హృదయకండరదాహము (Acute Myocarditic): హృదయకోశమునకు సంబంధించిన కండరములు బలహీన మగును. హృదయమునందు నొప్పి, శ్వాసావరోధము, జ్వరము బలక్షయము నుండును. హృదయచలనము బలహీనముగా నుండును. హృదయధ్వనులు దుర్బలముగా నుండును. ధ్వనులమధ్య నెక్కువకాలము విరామ ముండును. కాలికమగు హృదయకండరదాహమునందు లక్షణము లివియే ఉండును. ధాతువుల సాంకర్య ముండును. చిరకాలమునుండి హృదయమునందు చేరినమాలిన్యములవలన నిది గలుగును. గుండెదడ, శ్వాసావరోధము, గుండెనొప్పి; బలహీనమై, క్రమరహితమైన, వేగమగు నాడియు నుండును.

గుండెశూల (హృదయవేధ-(Angina Pectoris): హృదయకండరములందు గలుగు తరుణమగు నీడ్పువలన నిది గలుగును. ఇది హృదయమునందు కాలికమైన రోగపదార్థము వలన గలుగును. నొప్పి గుండెలో నారంభమై యెడమచేతివరకు నుండును. గుండెలలో భరింపరాని బాధ గలుగును. ఊపిరి బిగబట్టి ప్రాణము అప్పుడు పోవునట్లు తోచును. కొన్ని సెకనులలో, నిమిషములో, నిట్టిబాధ గలిగి ప్రాణము పోవును.

హృదయముయొక్క లోపలిపొరలో దాహము (acute endocarditis): దేహతత్వమునందలివ్యాధుల కిది తోడుగాగాని పర్యవసానముగాగాని గలుగును. రోగలక్షణమును గుండెలలోనే బాధ, శ్వాసావరోధము, బలహీనమై, అక్రమ మగు, తీవ్రమగు నాడియు, హృదయకవాటములందు మర్మరధ్వనులు నుండును.

## హృదయవ్యాధుల నిదానము

హృదయవ్యాధులు వామపార్శ్వభారమున్నప్పుడే గలుగును. స్టెతెస్కోప్‌తో హృదయరోగములను నిదానము చేయవలెను. స్టెతెస్కోప్‌ను ఆరోగ్యవంతుల హృదయముల మీాదనుంచి ఆ ధ్వనిని తరుచు వినుచుండుటవలన ఆరోగ్యవంతమైన హృదయముయొక్క నడక యెట్లుండునో మనకు సులువుగా తెలియును. తరువాత వివిధ రకముల హృదయవ్యాధు లున్నవారి హృదయముపై దాని నుంచి వినినపుడు వివిధహృద్రోగములలో హృదయముయొక్క నడక యెట్లుండునో తెలియగలదు. దీనిని తరుచుగా వినుచు

అభ్యాసము చేసుకొనుచుండ వలెను. (5 వ పాఠము చూ.) హృదయముయొక్క అరల యందున్న కవాటములయందు సంధులున్నప్పుడు అవి తిన్నగా పనిచేయక జ్-జ్ అను ధ్వని వినిపించును.

హృద్రోగములకు చికిత్స: తరుణవ్యాధుల కన్నిటికి ఏచికిత్స ౬ వ పాఠములో చెప్పబడియున్నదో ఆచికిత్సవలననే హృత్కోశ దాహము, హృదయకండరదాహము, హృదయపు లోపలిపొరలలోని దాహము మొదలగున వన్నియు నయ మగును. ప్రమాదకరమగు స్థితులలో రోగికి సంపూర్ణమగు విశ్రాంతి నీయ వలెను. ఆదిత్యపేటికాస్నానములు, మర్దన, మృదువగు వ్యాయామము చాల మేలుచేయును. రొమ్ములపైన వేడినీటితో కాచుటవలనను బాధ ఉపశమించును. హృదయమునందలి మాలిన్యములను ఆదిత్యపేటికాస్నానములతో తొలగించుట చాల సులువుగా నుండును.

కాలికమగుహృత్కోశదాహము, హృదయకండరదాహము, హృదయవేధ, హృదయములోపలి పొరలయందలి దాహము మొదలగువ్యాధుల యందు హృదయముమీదకు మాలిన్యములు పోకుండునట్లు జాగ్రత్తపడవలెను. పాదములు, చేతులు వేడినీటిలో నుంచుటవలనను, మిక్కిలి సులువుగా జీర్ణమగునదియు, దేహమున కవసరములు తీరునంత తక్కువ పరిమితిగల ఆహారమునే తినుచుండుటవలనను, రక్తముపోటు తగ్గుచుండును. దురలవాటుల నన్నిటిని మానవలెను. కాఫీ, టీ, కోకో, పొగాకు, నల్లమందు, త్రాగుడు, మాంసాహారము, కోడిగుడ్లు, చేపలు, మొదలగు ఉద్రేకపదార్థములనెల్ల తినుట మానవలెను. చన్నీటిలో స్నానము చేయుచుండుట వలన హృదయము గట్టిపడుచుండును. వేడినీటితో నెక్కువ కాలపుస్నానములుగాని కాపులుగాని బలహీనతను గలిగించును. మలబద్ధక మున్నయెడల వరుసగా కొన్నిదినములు ఎనిమా చేయుచుండవలెను.

రోగికి ఒకింతబలము చేకూరినప్పటినుండి, శక్తి కొలది వ్యాయామములు చేయుచుండవలెను. వానివలనను రోగియొక్కబలము వృద్ధిబొందును. దానితో రోగనివారణమగును.

ప్రారంభమున తేలికయగు వ్యాయామములు చేయవలెను. తరువాత, తరువాత ఒకింత యెక్కువ శ్రమగలిగించు వానిని చేయవలెను. బలము వృద్ధిపొందుటతోడనే యింకను నెక్కువ శ్రమకరములగు వ్యాయామముల జేయవలెను. దేహమునకు అలసటయు, హృదయపు నడక యెక్కువగుటయు, క్రమము తప్పుటయు, ఆయాసము గలుగుటయు, గలిగినయెడల తప్పక వ్యాయామముల మానవలెను. ఏ పరిస్థితియందును దేహపరిశ్రమ ఆటవలె నుండవలెనేగాని, ప్రయాసను గలిగించునదిగా నుండరాదు. వ్యాయామకాలమున ఊపిరి బిగబట్టరాదు. ఊపిరి ధారాళముగా నడచుచుండవలెను.

రోగము యొక్క ఉత్తరదశ (భవిష్యత్తు): సకాలములో చికిత్స ప్రారంభించిన రోగ నివారణమగును. గుండెశూల ఉన్న రోగి చాల కాలము బ్రదికిన బ్రదుకవచ్చును. కాని ఆ వ్యాధి సాధారణముగా నయము కాదు. యుక్తమైన ఆహారములనే తినుచు, తరుచుగా ఆదిత్యపేటికలో రంగుకాంతి స్నానములను జేయుచు, శ్రమకరములుగాని పనులనే జేయుచుండునెడల ఆయుర్దాయమును పొడగింపవచ్చును. లేని

మొదల త్వరలోనే ప్రాణమును పోగొట్టుకొన వలసివచ్చును.

## మూత్రవ్యాధులు

తరుణమగు మూత్రపిండములోని నాళికలపై పొరలయందు దాహము (Acute Parenchymatous Nephritis): జ్వరము, వికారము, వాంతులు, మూత్రపిండములపై సన్న నొప్పియు నుండును. నల్లని రంగు గలిగి, సుద్దకట్టుతోగూడి, రక్తపుజీరలుగల మూత్రము చాల స్వల్పమగు పరిమితితో అనేక తూరులు అగుచుండును. ముఖము ఉబ్బును. తరువాత దేహమంతయు నంజుచూపును. రక్తక్షయమును బలహీనతయు నారంభమగును. ఇదేవ్యాధి చిరకాలము చికిత్స చేయక వదలితిమేని కాలికమగును. దానికిని లక్షణము లిట్లనే యుండును. అగ్నిమాంద్యము, అతిసారము, శ్వాస కఠినముగావచ్చుటయు నుండును. రక్తక్షయయు, పాండువును, బలక్షయమును గలుగును. మూత్రపిండములు మూత్రమును వడియగట్టజాలవు. అందువలన రక్తమునందు మూత్రము నిలిచిపోవును.

కాలికమైన మూత్రపిండములయందలి ధాతుసాంకర్యము (Chronic Interstial Nephrits): మూత్రపిండములయందలి సంధిధాతువు (Connective tissue ) ఎక్కువగును. మూత్రపిండముల వైశాల్యము తగ్గును. హృదయదౌర్బల్యమువలనగాని, రక్తపుపోటుఅధికమగుటవలనగాని, రక్తమునందుమాలిన్యములు చేరుటవలనగాని యిది గలుగును. మూత్రపు పరిమితి యెక్కువగును. తెల్లగానుండి సాంద్రత తగ్గియుండును. అనగా తేలికగా నుండును. చర్మము ఆర్చుకొనిపోయి పొడిగా నుండును. అగ్నిమాంద్యము, తల తిరుగుట, వికారవ తలనొప్పియు నుండును. రక్తపుపోటు (Blo[illegible] Pressure) ఎక్కువగా నుండును. హృద[illegible] కండరములు మొద్దుబారియుండును.

శిలామేహము: మూత్రపిండములయం[illegible] స్ఫటికములు చేరుట, నడుములో నొప్పి యు[illegible]డును. వ్యాయామమువలన వ్యాధి యెక్కు బాధను గలిగించును. ఎక్సురే ( X -Ray) పరీ[illegible] వలన నీ శిలలను కనిపెట్టవచ్చును.

తరుణమగు మూత్రకోశములోని దాహము (Acute Cystitis): మూత్రకోశమ యొక్క లోపలిభాగమున నుండు శ్లేష్మపుపొ (అమత్వచము) నందు గలుగు దాహము. చ[illegible] జ్వరముతోగూడిన జ్వరము అకస్మాత్తుగా గల గును. మూత్రము అనేకతూరులు కొద్ది కొద్దిగ నగుచుండును. మూత్రకోశ ముందు భాగము[illegible] సన్నని నొప్పి యుండును. మూత్రికయంద పుండుపై కారము చల్లినట్లు మంట యుండును మూత్రము ఎర్రగాను, మడ్డిగాను నుండును.

నిదానము: మూత్రపరీక్ష చేయవలెను. [illegible] వివరములు ముందుపాఠములలో చూడవలెను

## మూత్రవ్యాధులకు చికిత్స

ద్రవరూపములగు మలినములే మూత్రముగా వెడలును. చర్మముగూడ అట్టి మాలిన్యములను చెమ్మటగా వెలువరించును. మూత్రము ద్వారా అట్టి మాలిన్యములను వెలువరింప కష్టమైనప్పుడు చర్మముద్వారా వానిని వెలువరింప బ్రయత్నింపవలెను. ఆదిత్యపేటికా స్నానముల వలన చర్మమునం దుజ్జీవనము గలిగి చెమ్మట గలుగును. స్వేదబంధము—

అనగా చెమ్మట గలిగించు గొంగళి చుట్టలు, వేడినీటి స్నానములు, అభ్యంగము, దేహమర్దనముల వలనను చెమ్మట గలుగును. తరుణవ్యాధులలో రోగి కొబ్బరినీరును, మంచినీరును మాత్రమే త్రాగవలెను. కాలికవ్యాధులయందు నారింజ, బత్తాయి, కమలా, అనాస, కిచ్చిలి, సాత్ కూడి, మొదలగు రసముగల పండ్లను, వండిన కాయగూరలను, ఆకుకూరలను మాత్రము తినవలెను. రోగము తిరుగుముఖము పట్టినతరువాత, మజ్జిగగాని, వెన్నతీసిన పాలుగాని యీయవచ్చును. మంచినీరు ధారాళముగా త్రాగుట వలన మేలగును.

రోగముయొక్క ఉత్తరదశ: మూత్రకోశమున వ్రణముగలిగినతప్ప సామాన్యముగా పై వ్యాధు లన్నియు సులువుగా కుదురును. రక్తమునందు మూత్రము నిలిచిపోయిన యెడల మన మెన్ని చికిత్సలు చేసినను రోగి బ్రదుకుట అరుదు.

# ప్రశ్నలు

౧ భారతీయులలో విరేచన బద్ధకము ప్రధానమగు రోగముగ నేర్పడుటకు హేతు వేమి? భోజనమైన యెన్నిగంటలకు ఆరోగ్యవంతులకు మలమోచన మగును? మలచలన పరీక్షను వివరింపుము.

౨. మలబద్ధకమును నివారించు చికిత్సలను వివరింపుము.

౩. ఎనిమాచేయు విధానమును వ్రాయుము.

౪. జీర్ణాశయవ్రణ మననేమి? దాని లక్షణము లేమి?

౫. మూలవ్యాధికి లక్షణము లేమి? చికిత్స యేమి?

౬. విరేచన బద్ధకమునకు సామాన్యచికిత్స యేమి?

౭. పచ్చకామెల అననేమి? దాని కేమిచికిత్స?

౮. గుండెశూలలక్షణము లేమి? దాని ఉత్తరదశ యెట్లుండును?

౯. తరుణమగు హృదయవ్యాధులకు సామాన్య చికిత్స యేమి?

౧౦. మూత్రవ్యాధులను నిదానము చేయుటెట్లు? ఉత్తరదశ యెట్లుండును.

☞ కాగితమునకు ఒకవైపుననే జవాబులు వ్రాయుము. పాఠసంఖ్య, ప్రశ్నసంఖ్య వేయవలెను. ప్రతికాగితము మీదను వరుససంఖ్య యుండవలెను. అన్ని కాగితములను కలిపి గుండుసూదితో గ్రుచ్చవలెను. లేదా దారముతో కట్టవలెను.

# ప్రకృతి గృహ వైద్యము

౮ వ పాఠము

## ఆహార శాస్త్రము - ౧ వ భాగము

ప్రకృతిచికిత్సలలో నొక ముఖ్యాంగమగు ఆహారమునుగురించి యీ పాఠమున బోధించెదము. అయుక్తమగు ఆహారము, అయుక్తమగు పచన విధానము అనగా వంటచేయురీతి, కృత్రిమమును, అనారోగ్యకరము నగు ఆహారసమ్మేళనము అనగా కలగలుపు మొదలగువానిచే మన ఆహారపువెల యెక్కువగుచున్న దేగాని దేహపోషణ చేయుటలో చాల నిరర్థకమే యగుచున్నది. కొందరు కేవలము పిండిపదార్థమును ఎక్కువగాను కొందరు పప్పుపదార్థములను ఎక్కువగాను కొందరు నీ రెంటిని నెక్కువగాను తినుచున్నారు. అందువలన వారు సోమరిపోతులు, తిండిపోతులు, నిరుత్సాహవంతులు, నిర్వీర్యులు, నిస్తేజస్కులు నగుచున్నారు. కొందరు నానాటికి నీరసించి అకాలమృత్యువువాతం బడుచున్నారు. ఇట్టివారికెల్ల ప్రకృతివైద్యుడు యుక్తమగు పథ్యమును విధించి ఆరోగ్యమును గలిగించును. అందువలన నతనికి ధనమును కీర్తియు లభించును.

ఎట్టి ఆహారమును దినిన మనము అట్టివార మగుదుము. ప్రాణవంతములును, లేతవియు నగు కూరగాయలను, జీవసత్తలను గలిగి జవసత్వముల నొసంగు ఫలరసములను తినవలయును. అట్లుగాక చచ్చిన శవములతోడను, నిర్వీర్యములగు మరబియ్యము, మైదాపిండి, సగ్గుబియ్యము, మొదలగువానితోను మన ఉదరమును నింపుకొందుమేని మన దేహము క్రొవ్వెక్కును. దగ్గో, పడిసెమో, అతిసారమో, జ్వరమో యేదో వ్యాధిచే బాధింపబడుచు మాంద్యము గలిగి నిరుత్సాహము, నీరసము మొదలగునవి గలవారమై భూమికి భారమై యుందుము. మన జీవనము దుర్భరముగా నుండును. మోటారు కారునకు గాసోలిన్ (gasoline) ఎటువంటిదో మనదేహమునకు ఆహారము అటువంటిది. మోటారునందు గాసోలిన్ కాలినట్లు మనదేహమున ఆహారము కాలి(పచనమై) దేహమునకు వేడిమిని,సత్తువను నిచ్చును. మరియు దేహమును పెంచును దేహమునందలి కదలికకు అవసరమగు జారుదలను గలిగించును. అందువలన దేహము సుఖముగా తనపనులను చేసికొనుచుండును.

మన యాహారము ౩ పనులను జేయును. ౧ దేహమునకు శక్తి నిచ్చును. ౨ దేహమును పెంచును. ౩ దేహక్రియలను సమపరచును.

మనము తిను ఆహారము అనేకరుచులను కలిగియుండును. అనేకరంగులుగా నుండును. అనేక వాసనలను గలిగియుండును. అనేక పరిమాణములలో నుండును. వానినన్నిటిని ౬ విలక్షణములగు తరగతులుగా విభజింపవచ్చును. ౧ కర్బను హైడ్రజములు ౨ మాంసకృత్తులు ౩ క్రొవ్వుపదార్థములు ౪ సేంద్రియలవణములు ౫ జీవసత్తులు ౬ పిప్పిపదార్థములు.

కర్బను హైడ్రజములు: ఇవి పిండి పదార్థములు, జిగురుపదార్థములు, చక్కెర చేరును. వానియందు బొగ్గు (అంగారము carbon) హైడ్రజము (Hydrogen) ప్రాణవాయువు చేరియుండును.

చెరకునుండియు, ఫలములనుండియు, పాలనుండియు, తేనెనుండియు ధాన్యములనుండియు చక్కెర కలుగును. అది మన ముపయోగించుచున్నాము.

కర్బను హైడ్రజములలో పిండిపదార్థములు ప్రధానమైనవి. ధాన్యములయందెల్ల పిండిపదార్థ ముండును. అన్నము రొట్టె ఇవి పిండిపదార్థములు. పండిన అరటిపండ్లయందును, దుంపకూరలయందును, అరటికాయ మొదలగు వానియందును నీపిండిపదార్థము ఉండును.

పిండిపదార్థములవలన దేహమునకు వేడిమి గలుగును. పనిచేయుటకు అవసరమగు శక్తి గలుగును. మనదేహమునందు గలుగు ప్రతి కదలికకును కొంతశక్తి కావలెను. ఆశక్తి కర్బనుహైడ్రజములు కాలుటవలననే గలుగును.

మనదేహముయొక్క కదలికకు అవసరమైనదానికన్న నెక్కువ కర్బను హైడ్రజములు తినినప్పుడవి దేహమునందు క్రొవ్వుగా నిలిచిపోవును. చక్కెరరూపమైన శేషము పైత్యకోశమునందు నిలిచిపోవును. ఇది దేహమున నిలువయుండి ఉపవాసకాలమున ఆహారముగ ఉపయోగపడును. దేహము క్రొవ్వెక్కియున్నవారు కర్బనుహైడ్రజములను తగ్గించి తినవలెను. మానవాహారమునందు సగమున కెక్కువభాగ మీకర్బను హైడ్రజములే అయియున్నవి. మానవ దేహమునకు అవసరమైన శక్తిలో చాలభాగము ఈ కర్బనుహైడ్రజములవలననే లభించుచున్నట్లు తోచుచున్నది. కనుక మానవాహారమున సగమున కెక్కువభాగము కర్బను హైడ్రజములుగా నుండవలెను. క్రొవ్వు పదార్థములును మన దేహమునందు దహనమగును. అవి కాలుటకు అవసరమగు వేడిమి కర్బనుహైడ్రజములవలననే లభించును.

మాంసకృత్తులు: దేహమునకు నత్రజని, భాస్వరము, గంధకములను నొసంగును. ఇంకను కొన్ని పదార్థములను కలుపుకొని దేహమునందలి కొన్ని నిర్మాణములను (Structures) నాడులను, కండరములను, గ్రంథులను బలపఱచును. పెరుగునందును,గోధుమపైనుండు పొరయందును, గ్రుడ్డునందలి 'జెన' యందును, మాంసములందును మాంసములందును, పప్పు పదార్థములందును మాంసకృత్తు గలదు. మనదేహమునకు మాంసకృత్తు అవసరమేగాని అది అమితముగా దినిన అపాయము గలిగించును. కర్బనుహైడ్రజములనెక్కువగా తినినయెడల అది దేహమున నిలువయుండును. మాంసకృత్తు నెక్కువగా తినినప్పుడది దేహమున ఆరోగ్యమగు స్థితిలో నిలువయుండక కుళ్ళి, మురుగెత్తి దుర్వాయువుల గలిగించి దేహమునకు భారభూతమై రోగమును గలిగించును. ప్రపంచమునందలి జాతులందెల్ల అమెరికనులు విపరీతమగు మాంసకృత్తును తిందురు. వారు విపరీతమగు ఆంత్రవ్యాధులు (ప్రేగులలో జబ్బులు) అతిమూత్రము, వ్రణములు మొదలగు వ్యాధులచే బాధపడుచున్నారట. వారిదేహమునందలి రక్తమంతయు విషయుతమై యుండును.

క్రొవ్వుపదార్థములు: అనగా చమురు పదార్థములు. జంతుసంబంధ మగునవియు, వృక్షసంబంధమగునవియు నని క్రొవ్వు పదార్థములు రెండురకములు.ప్రతిజంతువునందును ఒక విలక్షణమగు క్రొవ్వుండును. మనము తినినక్రొవ్వు మనదేహమునందలి ధాతువులయందు నిలువయగును. పిండిపదార్థముల నెక్కువగా తినుటచే నేర్పడు క్రొవ్వునకును, జంతుసంబంధ మగుగాని వృక్షసంబంధమగు గాని ఈక్రొవ్వునకును భేదమున్నది. వరుసగా కొన్ని నెలలు క్రొవ్వుపదార్థములను తినకున్నను మానవుడు జీవింపగలుగుచున్నట్లు పరిశోధనలవలన రుజువైనది. అందువలన మానవునకు క్రొవ్వుపదార్థము అంతగా అవసరమైన పదార్థము కాదని తేలినది.

పూర్వము మానవునకు క్రొవ్వుపదార్థము చాల అవసరమైనదని తలంచుచుండిరి. ఇప్పుడది అబద్ధమని స్పష్టమైనది. అయినను మానవుని దేహముయొక్క పెంపునకు అవసరమగు జీవసత్త్వ (Vitamins) లిందుండునని పరిశోధనలవలన దేలినది. అందువలన తగుమాత్రపు క్రొవ్వుగూడ తినుట మంచిది. అది నేతియందును, కొబ్బరి, వేరుసెనగ, సీమబాదము, అక్రోటు మొదలగు వానియందును అమితముగా నున్నది. పందిచమురు, మాంసపు క్రొవ్వు దేహమునకు ఉపయోగకరమైన క్రొవ్వుగాదు. క్రొవ్వుపదార్థములు తినినప్పుడు తృప్తి జనించును. కనుక తగుమాత్రపు క్రొవ్వు మన ఆహారపదార్థములం దుండుట మంచిది. క్రొవ్వు నెక్కువ తినిన దేహము లావెక్కును. ప్రేగులయందు కుళ్లుపుట్టును. పైత్య రోగము గలుగును. కనుక క్రొవ్వుపదార్థములను మితముగనే తినవలయును. రొట్టెకు వెన్న తోడుగా వాడుకొనవచ్చును. క్రొవ్వును కరగించుటకు అవసరమగు వేడిమి రొట్టెయందలి పిండి పదార్థమువలన గలుగును.

సేంద్రియాహార లవణములు: మన దేహమును నూటికి ౫, ౬ భాగము లిట్టి లవణము లుండును. ఇవి యెముకలయందు ప్రధానముగను, నితర ధాతువులయందు తక్కువగను నుండును. రక్తమునందును, నితరద్రవరూపమగు ధాతువులయందును నివి యుండును. మానవ దేహమునందు ఈ క్రింద పేర్కొనబడిన రసాయన ధాతువు లున్నవి:—ప్రాణవాయువు, అంగారము, హైడ్రొజను, నత్రజని, మెగ్నిషియము, లోహము అనగా ఇనుము, దానితో చేరి అయోడిన్, ఫ్లోరిన్, సిలికాన్. మనము నిత్యము తిను నాహారములందు ఈ క్రింద పేర్కొనబడిన సేంద్రియ లవణము లుండవలెను:— ఇనుము, సున్నము పొటాష్, సోడా, మెగ్నిషియా. అయోడిన్ మాత్రము కొద్దిగా అవసరమేగాని అది మనము త్రాగు నీటి వలననే సామాన్యముగా అవసరమైనంత లభించును. కొన్నిచోట్ల నీటియందు ఈ అయోడిన్ ఉండదు. అట్టిచోట నివసించువారికి [illegible] డోలు (Goitre) గలుగును.

మన మిట్టి లవణములు గల పదార్థములను తినవలెను. రక్తమునందలి యెఱుపును నిలుపుటకు ఇనుము అవసరము. అయినను లోహపు ధాతువులు చేరిన మందులవలన నిది పూర్తి చేసికొనరాదు. ఏలయన, అవి ఖనిజములు- అనగా భూమిలో లభించినవి. అవి నిరింద్రియములు. మన రక్తములో కలియక వేరుగా నిలిచిపోవును. మనము తిను ఆహారపదార్థములయందు గల లోహము సేంద్రియము. ఇది మన దేహమునందలిధాతువులలో సులువుగా గలియును. ఈ కారణమువలన దేహమునందు రక్తక్షయము, పాండువు మొదలగునవి గలిగినప్పుడు లోహములను వాడరాదు. ఇట్టి సేంద్రియ లవణములు ఈ క్రింది ఆహారపదార్థములం దున్నవి.

ఆకుకూరలు, కాయగూరలు, తోటకూర, పొన్నగంటి, చక్రవర్తి, భృంగరాజము అనగా గుంటగలగర, కూతురుబుడమ మొదలగు ఆకులు; దోస, దొండ, బీర, పొట్ల, సొర, చిక్కుడు, బెండ వంగ మొదలగు కాయలయందును; క్యారెట్, బీటుదుంప, కంద మొదలగుదుంపలయందును; అరటిపండ్లు, టొమాటోలు, నారింజ, బత్తాయి, కమలా, పంపరపనస, ఆపిల్ (సీమరేగు) అలుబుఖరా, ద్రాక్ష, ఖర్జూర మొదలగువానియందును గలవు. ఇంకను అనేకపదార్థములయందు అంతో, యింతో యిట్టిసేంద్రియలవణములు లున్నవి. దేహమునందున్న లవణములలో నినుము ప్రధానమైనది. కనుక మనము తిను పదార్థము

లో ఇనుము గల పదార్థములను తినవలెను. లోహముగల రక్తమునందు ఎర్రకణములు తగ్గియుండును. ప్రాణవాయువును ఆకర్షించు శక్తి హిమోగ్లోబిన్ తగ్గియుండును. అందువలన వారి దేహమున ఇనుము తగ్గిపోయియుండును. ప్రాణవాయువు దేహమునందలి దహనక్రియకు చాల అవసరమై యున్నది. అందువలననే పాండురోగులకు సరియైన ఆకలి యుండదు. దేహమునందు చేరిన మురికియును సహజముగా బయటికి వెలువరింపబడకయు నిలిచి యుండును. పొగగొట్టము మూసియుండి, పొయ్యిలో బొగ్గులు ఎక్కువగా చేరియుండిన పొయ్యి మండదు. అట్లే దేహమునందును అగ్ని జ్వలింపదు. ప్రతివారమును దేహమునుండి లోహము వెడలి పోవుచునే యుండునుగాన మనము నిత్యమును ఇనుముగల పదార్థములను తినవలెను. ఆరువారములలో మన దేహమునందున్న లోహమంతయు అయిపోవును. స్త్రీలకు పురుషులకన్న నెక్కువ లోహము కావలెను. శిశువులకు నింకను నెక్కువయే కావలెను. పాలు సంపూర్ణ ఆహార మందురు; కాని అందును 'లోహము' లేదు. నారింజపండ్లరసమునందది బాగుగా నున్నది. కనుక పాలే ప్రత్యేకము ఆహారముగా పుచ్చుకొనువారు నారింజరసముగూడ పుచ్చుకొనవలెను. లేకున్న వారి దేహమున కవసరమగు లోహము చేకూరదు. శిశువు త్రాగు తల్లిపాలయందు కావలసిన లోహము గలదు. కనుక తల్లిపాలను త్రాగు శిశువునకు నారింజరసముతో పనియుండదు. పోతపాలబిడ్డలకు నారింజరసముగూడ నీయవలెను. లేదా తోటకూరనండివార్చిన నీరో, బీరకాయ వండివార్చిన నీరో, యిట్లు ఏదో కూరవండివార్చిన నీరో, బియ్యపుకడుగునీరో యీయవలెను.

లోహధాతువుగల పదార్థములను ప్రజలు ధారాళముగా దినుచుండవలెను. ఈ క్రిందివస్తువులయందు ఇను మెక్కువగా గలదు:— గోధుమ తవుడు, బియ్యపుతవుడు, తోటకూర, బచ్చలికూర, పొన్నగంటికూర, చక్రవర్తికూర, చేమకూర, సరస్వతి ఆకు, కొయ్యతోటకూర చిక్కుడు, దంపుడుబియ్యము, పొట్టుతీయ గోధుమపిండి, జొన్నలు, సజ్జలు, యవలు మొదలగు దాన్యములమీద పొట్టు, ఖర్జూర, అత్తి, ఆల బఖరా, లేతముల్లంగి, బొప్పాయి, నారింజ కమలా, బత్తాయి, రేగు, అక్రోటు మొదలగునవి

సున్నము: మానవ దేహమునందున్న లవణములలో నాలుగింట మూడుపాళ్లు సున్నమే. అది ఎముకలకు గట్టిదనము నిచ్చును. పెద్దవారి ఎముకలలో సగమునకన్న నెక్కువభాగము సున్నమే. దొడ్డికాళ్లు, దంతవ్యాధులు ఈసున్నము తక్కువగుటవలననే గలుగును. కండరముల సౌష్ఠవమునకు సున్నముగూడ అవసరము. పాలయందు నీ సున్నము చాల యెక్కువగా నుండును. ౧౦౦ తులములపాలలో ఒక దినమునకు సరిపోయిన సున్న మున్నది. ఈసున్నముగల పదార్థములు వానియందున్న సున్నపురియొక్క పరిమితిననుసరించి యీ క్రిందివరుసలో నుండును:— జున్ను, సారపప్పు, సీమబాదము, చెరుకు పానకము, పెద్దచిక్కుడు, గుడ్డునందలి జెన, ధాన్యములమీది తవుడు, పాలు, చల్ల, ఆలివ్ పండ్లు.

జీవసత్తలు (విటమినులు): ఇవి కంటికి కానరాని రాసాయనికద్రవ్యములు. వీని రాసాయనిక సమ్మేళన మెట్టిదో యింతవరకును నెవరికిని తెలియదు. అయినను నివి యున్నవనిమాత్రము రూఢియైనది. ఇవి మన పెంపునకు అవసరము. నాడులయందలి ద్రవములు విటమినులనుండియే లభించును. విటమినులు లేని పదార్థములను దినుటవలన నెండు పుట్టును. పెంపు ఆగిపోవును. మనుష్యులు దిగనాసిల్లుదురు. పాండువు, పక్షవాతము, క్షయ, ఉన్మాదము, మూర్ఛ, కుష్టు మొదలగు

దుర్భరవ్యాధులు గలుగును. నంజు, స్కర్వీ, ఎముకల మెత్తదనము గలుగును. విటమినులు లేని పదార్థములు తినినపిల్లలు పెరుగరు; గర్భ ధారణము, పిల్లలుపుట్టుట జరుగదు; తల్లులవద్ద పిల్లలకు కావలసిన పా లుండవు.

మూడుప్రధానరకముల విటమినులు గలవు: క్రొవ్వునందు కరుగునట్టి ఏ.విటమిను, నీటిలో కరుగునట్టి బి. సి. విటమినులు. ఇందు ఏ.విటమిను తినకున్న కంటివ్యాధులు, ఎముకలవ్యాధులు గలుగును. బి. విటమిను లేకున్న నంజు పుట్టును. సి. విటమిను లేకున్న స్కర్వీవ్యాధి గలుగును.

కూరలయందును, పండ్లయందును, ధాన్యముల యందును మాత్రమే యీ విటమిను లుండును. అందువలన ప్రతిదినమును ఆహారపదార్థములను మార్చి తినుచుండవలెను. అట్లుతినిన మనకు కావలసిన అన్నితరగతుల విటమినులును లభించును. ధాన్యములపైనుండు తవుడునం దీ విటమినులు మిక్కుటముగ నుండును. ఆకుకూరలయందును, దుంపకూరలయందును, కూరగాయలయందును నుండును. నారింజ, నిమ్మ, ద్రాక్ష, దబ్బ, మొదలగు ఫలములయందును విటమిను లెక్కువగనే యుండును. ప్రతి ఆకుకూరయందును, కొంచెమో గొప్పో పరిమితిగల విటమిను లుండును.

వండుటవలన, వార్చుటవలన, వేయించుటవలన, కాల్చుటవలన, వరుగుచేయుటవలన పదార్థముల యందలి విటమినులు తగ్గిపోవును. అందువలన మనము తిను ఆహారముతో ప్రతిదినమును కొన్ని పండ్లో, కూరలో పచ్చివికూడ తినుచుండవలెను. దంతములయందు పుప్పిపట్టుట యనువ్యాధి యీ విటమినులు లేకుండుటవలననే కలుగును.

మొలకలెత్తిన ధాన్యములయందును, చిక్కుడు మొదలగు వానియందును విటమిను లుండును. యీస్టు (yeast) నందు నీటిలోకరుగునట్టివిటమిను లుండును. ఇది నంజును రాకుండ నాపును. ఈ వీట మినులు ధాన్యములయొక్క తవుడునందు గలవు. టొమెటో (సీమవంగ, రామములగ - అనేపేర మనవారు పిలుతురు) యందు మూడురకముల విటమిలును గలవు.

పిప్పి పదార్థము: ఇందులో దేహమును పోషించు వస్తువు లేవియు లేవు. ఇది మొక్కల స్కంధములలో నుండును. తోటకూరయందలి కాడవలె నుండును. బీరకాయ, పొట్ల, దోస, దొండ, మొదలగు కాయలయందలి పైకండ యందుండును. ధాన్యములపైనుండు తవుడునం దుండును. ఈపదార్థములపై జీర్ణరసములు పని చేయవు. ఈపిప్పి రక్తమాంసములుగా మారదు. కాని ప్రేగులయందు వృద్ధిబొందు శిలీంధ్రములను నశింపజేయును. ఈపిప్పిపదార్థము తినుటవలన ప్రేగులయం దెట్టి యుద్రేకమునుగలుగక, మల విమోచన మగును. అందుకే యీ పిప్పిపదార్థ మును తినవలెను.

ధాన్యములమీద నుండు తవుడే పిప్పిపదార్థముల లో ముఖ్యమైనది. దేహమునందలి మాలిన్య ములను తోసివేయుటకు తవుడు దైవనిర్ణీతమైన వస్తువుగాతోచుచున్నది. ఈతవుడు తడిసి మెత్త బడి ప్రేగులయం దెట్టి యుద్రేకమును గలిగింపక మలములను తుడిచి వేయును. ప్రేగులయం దున్న పెళుసుదనమును పోగొట్టి మెత్తబఱచును. ఆహారపదార్థములందు దీనిని చేర్చి తినుటవలన మలముయొక్క పరిమితి యెక్కువై వెలువడి పోవుటకు తగినబరు వుండును. ఇది ప్రేగులయందు ఉద్రేకమును గలిగింపదని యిదివరకే వ్రాసి తిమి గద. ఇది ప్రేగులయందు చక్కలిగింతను పెట్టి అందలిమలమును వెలువరింప అవసరమగు ఉత్సాహమును గలిగించును. మలబద్ధకము గల వారు 2, 3 పెద్దచెమిచాల తవుడును ప్రతిదిన మును తినుటవలన మలబద్ధక మంతరించును.

ఈ క్రింది పదార్థములయందు ఇట్టి పిప్పిపదార్థ ముండును: పొట్టుతీయని గోధుమపిండి, తెల్లగా అరగదంపనట్టియు, మరపట్టింపనట్టియు ముడి చేబియ్యము, పై గోధుమపిండితో చేసిన సేమియా, గ్రాహంరొట్టె, చిక్కుడు, కాబేజీ, ఎర్రముల్లంగి (Carrots) కాలీఫ్లవర్, తోట కూర, తోటకూరకాడలు, పందిరి వంకాయ, చక్రవర్తికూర, పొన్నగంటికూర, చుక్కకూర, ములగ, కూతురుబుడమ, దోస, దొండ, పొట్ల, బీర, ఒటానీ, అడవికంద, చెక్కుతీయని బంగాళా దుంప, గుమ్మడికాయ, బూడిదగుమ్మడికాయ, బలుబఖరా, ఆపిల్సు, రేగు, బేరిపండ్లు, నారింజ కాయలు, అరటిపండ్లు, అత్తిపండ్లు, జలదారు పండ్లు, రాచఉసిరిక, ఉసిరిక, మొదలగువాని యందెల్ల మలవిమోచనము చేయు పిప్పిపదార్థ మున్నది.

జపాను దేశమున ఆగర్-ఆగర్ అను సముద్రపు మొక్క దొరకును. అదియును విరేచనమునుజారీ చేయును. అది మందులంగళ్లయందు దొరకును. ఈ పాఠమునందును, రాబోవు రెండు (9, 10) పాఠములందును అత్యంతనవీనములగు ఆహార శాస్త్రవిషయిక పరిశోధనాఫలితముల వ్రాసి యున్నాము. కనుక మా విద్యార్థులీ మూడు (8, 9, 10) పాఠములను మిక్కిలి శ్రద్ధగా చదువ వలసియున్నారు.

పూర్వము ఆహారవిషయిక సిద్ధాంతములయందు అనేకులకు అనేకవిధములగు విరుద్ధాభిప్రాయము లుండెను. ఇప్పు డవియన్నియు సమసిపోయి సామ రస్య మేర్పడినది. ఆసిద్ధాంతములనే యిందు వ్రాయుచున్నాము. వైద్యులకు ఆహారవిషయ మున నిర్దిష్టమగు అభిప్రాయములు లేకున్నవి. అందువలన ఆంగ్లవైద్యులు రోగనివారణకు పథ్యము అనవసరమనుచున్నారు. ఆయుర్వేదము నం దేమి చెప్పియున్నను, నేటి ఆయుర్వేద వైద్యులు రోగమునకు గాక మందుకొరకై పథ్యము చేయించుచున్నారు. ఆంగ్లవైద్యుల రోగికి అమితమగు ఆహారము నిచ్చుచున్నారు. తెలివిమాలిన జంతువు లన్నియు రోగమువచ్చి నప్పుడు ఉపవసించి తమవ్యాధులను నివారించు కొనుచున్నవి. ఆంగ్లవైద్యుల కింతమాత్రము గూడ తెలియదు!

## ప్రశ్నలు

౧ దేహమునందు ఆహారము చేయు ముఖ్యమైన పను లేవి?

౨ ఆహారమును ఎన్నితరగతులుగా విభజింప వచ్చును? అవి యేవి?

3 కర్బనుహైడ్రజములను వివరింపుము. అవి, దేహమున చేయు పని యేమి?

౪ మాంసకృత్తులుగాని, క్రొవ్వుపదార్థములు గాని యెక్కువగా తినినప్పు డేమి హానిచేయును?

౫ ప్రధానమైన సేంద్రియ లవణముల పేర్కొనుము? అవి యే ఆహార పదార్థములయందు లభించును? ఆహారపదార్థములలోనున్న సేంద్రియ మగు లోహము (ఇనుము) వలన దేహమునకు గలుగు మే లేమి?

౬ సున్నము దేహమున కెట్లు అవసరమై యు న్నది? ఇది యే ఆహారపదార్థములందు లభించును.

౭ జీవసత్త (విటమిను) లననేమి? మూడు రక ముల విటమినులను పేర్కొని, అవి తినకున్న దేహమునందు ఏమి జరుగునో వివరింపుము.

౮ పిప్పిపదార్థ మననేమి? అది యెట్లు ఉపయో గించును?

౯ ధాన్యములమీది తవుడు ఎట్లు దేహమున కుపయోగకర మైనది?

౧౦ ఏ నిలువపదార్థములందు విటమినులు దొర కును? అవుపాలతో నేపదార్థమును జోడించి తినవలెను? లేకున్న నేమి లోపముసంభవించును?

# ప్రకృతి గృహవైద్యము.

౯ వ పాఠము.

## ఆహారశాస్త్రము - ౨ వ భాగము

### ఆమ్లాహారములు

ఆమ్లములు 8 రకములు. అందు 3 రకముల ఆమ్లములుమాత్రము మనదేహమున కుపకరించును. మిగత 5 రకములు మనకు అవసరములు గావు; అపకారముచేయును. ఉపయోగించునవి: ఫలములయందలిఆమ్లములు 3 రకములు.౧సిట్రిక్ అనగా నారింజ, బత్తాయి, కమలా మొదలైన ఫలములనుండి లభించునది. ౨ మాలిక్, అనగా ఆపిల్(సీమరేగు)నుండి లభించునది. 3 టార్టారిక్, అనగా నిమ్మపండ్లనుండి లభించునది. పనికిరానివి: ౧ యాసిటిక్ ఆమ్లము ఇది వినిగర్ (చిరక) అను పుల్లనిపదార్థముయొక్క సారము. ౨ ఆక్సాలికామ్లము. దీనిని చెట్లకాడలయందలి రసమునుపిండి తీయుదురు. 3 టానికామ్లము. చెట్ల బెరడునందలి రసమునుండి తయారుచేయుదురు. ౪ బెంజోయికామ్లము. ఆకులుతిని జీవించు జంతువుల మూత్రమునుండి తయారగును ౫ బ్యూట్రికామ్లము. ఇది పశువుల మలమూత్రములనుండి తయారగును. ఇంకను మూత్రికామ్లము మొదలగునవి గలవు. పాలు పులిసినప్పుడుమజ్జిగ తయారగును. ఇది దేహమునకు అపకారముచేయదని తేలినది.

పైన మంచివిగా పేర్కొనబడిన మూడురకముల ఆమ్లములు ఫలజాతులయందును, చుక్కకూర మొదలగు కొన్నికూరలయందును లభించును. సిట్రికామ్లము నారింజ, రేగు, ఆలుబఖారా, జల్దారు మొదలగు వానియందును, మాలికామ్లము సీమరేగు మొదలగు గట్టిపండ్లయందును నుండును. టార్టారికామ్లము నిమ్మ, పుల్లద్రాక్ష దానిమ్మ మొదలగు మిక్కిలిపుల్లనిపండ్లయందు నుండును పులిరొట్టెలు మొదలగు వానియందు ఈ టార్టారికామ్లము నమితముగా వేయుదురు. అందువలన మూత్రపిండ దాహము (Nephritis) గలుగును. ఇదే ద్రాక్ష, దానిమ్మ, నిమ్మ మొదలగువానియం దుండును గాని అపకారము చేయునంత యెక్కువపరిమితి మనము తినముగాన నదిఅపకారము చేయజాలదు. మాలికామ్లము ఈ క్రిందిపండ్లయందుండును: ఆపిల్స్ పియర్స్, చిన్నద్రాక్ష, రాచఉసిరిక, ఉసిరిక, ద్రాక్ష, పుచ్చ,టొమెటో. ఇట్టిఫలములనుధారాళముగా వాడవచ్చును. దానివలన చాల మేలు గలుగును.

నారింజపండ్లయందు సిట్రికామ్లమున్నది. నారింజపండ్లయందలి సిట్రికామ్లము నూటికి ౬ మొదలు ౯ భాగము లుండును బత్తాయి, నారింజ, కిచ్చిలి, సాతుకుడి, కమలా, సంత్రా మొదలగు ఫలములందెల్ల సిట్రికామ్లముండును. ఈ సిట్రికామ్లము గల ఫలములు ఎంత యెక్కువగా తినినను అపకారము చేయక మేలేచేయుచున్నట్లు రుజువైనది. ఒకరు ఎక్కువగా నారింజఫలములు తినిరి. వారిమూత్రమునందు స్వల్పముగానైనను సిట్రికామ్లము గాన్పింపలేదు. ఆకలికి మిగిలి సిట్రిక్ ఫలములనైనను తినరాదనుట జ్ఞప్తియందుంచుకొనవలెను.

ఆసిటికామ్లము (acetic acid) జీర్ణక్రియను పాడుచేయును. జీర్ణాశయమునందలి జీర్ణక్రియ నదిభంగపరచును. ఇది వినిగర్ (చిరక)నందుండును. ఇది తెల్లజాతులవారు పులుసుకాచుకొనుట కుప

యోగింతురు. ఈచిరకచేర్చి తయారుచేసిన ఊరు గాయలు, పచ్చడులు, అన్నియు అపకారమునే జేయునుగాన వీనిని తినరాదు. చిరక మానివేసి నిమ్మరసమును వాడవలెను. అందువలన చాల మేలు గలుగును.

టీ, కోకో, మిరియాలు, మిరెపకాయ మొదలగు వానియందు ఆక్సాలికామ్లముండును. అది అప కారముచేయును. గోంగూరయందుగూడ ఆక్సాలి కామ్లముండును. ఇదియును రుచిగల కూర. తెనుగు దేశమున దీనికి మంచి ఆదరణ గలదు. చిమడ ఉడుకబెట్టుటవలన దీనియందలి దుర్గుణ ము మరింత యెక్కువగును.

రాచఉసిరిక, ఉసిరిక, ఆలుబకరా పండ్లు మొద లగుపండ్లయందు బెంజోయికామ్లము (Benzoic acid) గలదు. ఆమ్లపిత్తము గలవారికి, శిలా మేహము సికతా మేహము గలవారికి, నీపండ్లు అపకారము చేయగలిగి యుండును.

వెన్న, మీగడ మొదలగు నెక్కువ క్రొవ్వుగల పదార్థములందు బ్యూటిరికామ్లము (Butyric acid)ఉండును. ఇదజీర్ణాశయమునందలి గ్రంధుల యందు దాహము గలిగించి జాఠరరసములను ఎక్కువగా ఊరించును. అందువలన ఆమ్లపిత్తము గలవారును, అతిమూత్రము గలవారును, ఇట్టి క్రొవ్వుపదార్థములను, పులిసిన చమురు పదార్థములను తినరాదు. మలముపులిసిమురుగు వాసన కొట్టినప్పుడెల్ల క్రొవ్వులను మానవలెను. శిశువులకు ఈనియమము ఇంకను బాగుగ వర్తించును.

దేహమునందు మాలిన్యములు చేరి పులియుట (కుళ్ళుట) వలన మూత్రికామ్లము (Uric acid) గలుగును. దేహమునందు మూత్రి కామ్లము చేరినయెడల ఆమవాతము, శిలా మేహము, సికతా మేహము మొదలగు వ్యాధులు గలుగును. కనుక మూత్రికామ్లము చేరకుండ దేహమును కాపాడుకొనవలెను. మాం సాహారములందెల్ల నీ మూత్రికామ్లమునుగలి గించు గుణమున్నది. కనుక మాంసాహారములు తినువారి దేహములందు పుట్టినమూత్రికామ్లమును తోసివేయుటకు మిక్కిలి శ్రమపడును. మాంసాహారులమూత్రపిండములు శాకాహారుల మూత్రపిండములకన్న చెడిపోయి యుండు నని పరిశోధనలవలన రుజువైనది.

## ధా న్య ము లు

సామాన్యముగా అందరు వాడునట్టి ధాన్యములు వరి, జొన్న, మొక్కజొన్న, సజ్జలు, రాగులు, గోధుమలు, యవలు మొదలగునవి. ఇవి గడ్డి జాతిదినుసులు. ఈధాన్యములు ముందు పుట్ట బోవుగడ్డికి బీజములుగా నుండుటవలన వీనియందు పోషకపదార్థము లున్నవి. ఇందుండు పోషక ద్రవ్యములలో ప్రధానమైనది పిండిపదార్థము. కొద్ది మాంసకృత్తును, సున్నమును, కొన్ని సేంద్రియలవణములును ఉండును. వీనిపైన పొట్టుండును. ఈపొట్టునకులోపలిభాగమును ఆని కొని సేంద్రియ లవణములును, జీవసత్తలును ఉండును. కనుక నీ లవణములు గల ఆహార పదార్థములనే మనము తినవలసియున్నాము. నాగరకత బలిసి ఫాక్టరీలు రానారంభించినప్పటి నుండి యీాదివ్యమగు, బంగారుపంటి, తవుడు బియ్యమునుండి వేరుచేయుచున్నారు. పిప్పిబియ్య మును మానవులు తినుచున్నారు. పైనున్న బంగారము పశువులకు మేపుచున్నారు. ఇట్లే మిగతధాన్యముల పైనుండు తవుడుగూడ పూర్తిగాత్రోసివేసి లోపలిపిప్పినే అందరును తిను చున్నారు. సేంద్రియలవణములును, జీవసత్త

లునుగల ఆ తవుడు పశువులకు బలమునొసంగుటకే వినియోగింపబడుచున్నది.

ధాన్యములందు (ఇనుము) లోహమున్నది. ఇందు సున్నము తక్కువగానున్నది. పొట్టుతో వాడిన గోధుమపిండియందు లోహముచాలయెక్కువగా నుండును. 30 తులముల గోదుమరొట్టెయందు మానవునకు ఒకదినమున కంతటికిని కావలసిన లోహము గలదు. తవుడు తీసివేసిన ధాన్యముల యందు లోహభాగము తగ్గిపోవును.

యవలయందు సున్నము ఎక్కువగా నుండును. ఇతరాహారముల చేర్చి తినకున్న, నిందున్న సున్నము గూడ దేహమునకు సరిపోదు –

ధాన్యములమీదనుండు తవుడు బలవర్ధకమైనది ఈ మరలు వచ్చినతరువాత అట్టితవుడు లేకుండ నాశనమగుచున్నది. ఆ తవుడే మిగిలినభాగము కంటెను నెక్కువ పోషకపదార్థములను గలిగియున్నది. ఈ తవుడు మలములను వెలువరించునని యిదివరకే చెప్పియున్నాము గదా! ఇందు పొటాసు, సున్నము మొదలగు సేంద్రియ లవణములు గలవు. రోగులకు ఈ తవుడే నేను మందుగా విధించుచున్నాను. తెలుపు (శ్వేత) కుసుమ గల స్త్రీలకు బియ్యపుకడిగి యెంతో మేలుచేయును. పొడిదగ్గుడున్నవారి కీకడుగువలన చాలమేలు గలుగును. ఇట్లనేకవ్యాధులలో నేను బియ్యపుకడుగు మందుగా వాడుచున్నాను. ఈ బియ్యముకడుగునం దింత లాభ మున్నపుడు బియ్యమును రెండుమూడు వడపులుపెట్టి ఆనీటిని వంచి పారవేయువారి తెలివిని ఎట్లు మన్నింపవలెనో తోచకున్నది. బియ్యపు కడుగును ఖర్జూరకాయనీటితోనో, చెరుకు రసముతోనో కలిపి త్రాగవచ్చును. బియ్యపు కడుగు దొరకని యప్పుడు తవుడునందు నీరుపోసి వడియగట్టి, ఆనీటిని వాడుకొనవచ్చును.

లేత మొక్కజొన్నకండెలు చాల ఆరోగ్యమును గలిగించును. అవి పచ్చివిగాని కాల్చుకొనిగాని తిన వచ్చును. మలమును వెలువరించుటలో నివి మంచిది. బాగుగా నమలి తినవలెను.

### కూరగాయలు

కూరగాయలమీది చెక్కను తీసివేయక వండుకొని తినవలెను. కొందరు పెద్దమ్మలు పొట్లకాయమీద నుండు చెక్కనుగూడ తీసివేయుచున్నారు. అది తప్పు. పొట్ల, దోస, దొండ, బీర, సొర (ఆనప) మొదలగు కూరలెల్ల చెక్కతీసి వేయకుండగనే తినవలెను. అందు కర్బను హైడ్రో జను లున్నవి. లోహము (ఇనుము) సున్నము, పొటాషు మొదలగు సేంద్రియ లవణములేగాక జీవసత్త్వలు, పిప్పిపదార్థములు నిందు ఎక్కువగా నున్నవి. చిక్కుడుగింజలు, ఒటానీలు మొదలగు వానియందు కర్బను హైడ్రోజనులకన్న మాంసకృత్తు లెక్కువగా నున్నవి.

కూరగాయలు సాధ్యమైనంతవరకు పచ్చిగనే తినవలెను. వండుట, వేల్చుటవలన వానియందలి జీవసత్త్వలు నాశన మగును. వార్చుటవలన సేంద్రియలవణములు లేకుండ పోవును. దొండ, దోస, బీర, పొట్ల మొదలగు కూరలెల్ల పచ్చివిగానున్నప్పుడే రుచిగా నుండును. కాన వానిని పచ్చివిగానే తినవలెను.

దుంపకూరలు పచ్చివిగా తినుటకు వీలులేదు. అవి తినవలసినప్పుడు వండుకొనియే తినవలెను. లేకున్న అవి రుచిగా నుండవు. అందలి పదార్థములును జీర్ణముకాదగినస్థితిలో నుండవు. ఒం గాళాదుంప పచ్చిది జీర్ణమగుటకు 10 గంటలు పట్టును. వండిన బంగాళాదుంప 5 గంటలకాలము లోనే జీర్ణమగును. ఒక రొట్టెముక్క అరుగుటకు పట్టుకాలములో సగముకాలమే ఉడికించిన బం

గాళాదుంప జీర్ణమగుటకు చాలును. గోధుమ యందుకన్న బంగాళాదుంపయందెక్కువ పోషక ద్రవ్యము లున్నవి. జె. హెచ్. కెల్లాగుగారిని గురించి యిదివరకు వ్రాసియున్నాను. గోదుమ, బియ్యము మొదలగువానియొక్క వాడుకను తక్కువజేసి బంగాళాదుంపలను ఎక్కువగా వాడిన చో ఎక్కువ బలారోగ్యములుగలిగి ఆయుర్దాయము వృద్ధియగునని వ్రాసియున్నారు. పిల్లల యందుగలుగు ఎండుమొదలగు వ్యాధులయందిది యెక్కువ మేలుచేయును. బంగాళాదుంప యందు పోటాషు, సోడా అనులవణములు గలవు. అందువలన ఆమ్లపిత్తము (acidosis) ను ఇది అద్భుతముగా తగ్గించును కాని యిదియును సంపూర్ణాహారము గాదు. ఇందు లోహము, సున్నము తగ్గియుండును. కనుక బంగాళాదుంపలు తినినప్పుడు ఆకుకూరలనుగూడ తినవలెను.

ఆకుకూరలలో కాబేజీపచ్చిదిగానే తినవచ్చును. ఇందు సున్నము గలదు. క్షయాదివ్యాధులను తగ్గించునట్టి జీవనత్తలు ఇందు గలవు. వండుట వలన సీగుణములు తగ్గిపోవును. పచ్చికాబేజీ సులువుగా జీర్ణమగును. కాలీప్లవర్ (Cawli flower) గూడ నిదేకుటుంబములోనిది. ఇందును మంచి ఆహారలవణములు గలవు. జీవనత్తలును గలవు. తోటకూర, పొన్నగంటి, చక్రవర్తి మొదలగు కూరలయందును ఈ సుగుణములు గలవు. మలబద్ధకము నవి పోగొట్టును. మేదో వృద్ధి (Obsity) అనగా ఎక్కువలావుగా నున్నవారికిది తినుటవలన లావుతగ్గును. ఆకు కూరలు చింతపండుతో కలిపివండుటకన్న, సీకాయిఆకో నిమ్మరసమో కలిపి వండుట మంచిది. చింతపండే వాడదలచినయెడల క్రొత్త చింతపండు మంచిది. ఈఆకుకూరలయందెల్లపిప్పి పదార్థము చాల యెక్కువగా నుండును.

ఆకుకూరలు చాలమంచివే. వానివిలువ లెవర సరిగా గ్రహింపజాలరు. సూర్యకాంతియందు గాలియందును నుండు మహాగొప్పదైన శక్తి అందు ధారాళముగా చేరును. ప్రకృతియందు ధాతువులు మనము జీర్ణము చేసికొనదగినస్థితి మనకు చేయును. తోటకూర, పచ్చలి, పొన్నగంటి చక్రవర్తి మొదలగు ఆకుకూరలు మొదలగు వానియందల్ల సున్నము మొదలగు లవణములున్నవి ఈలవణములు క్షారధర్మముగా నేయుత పదార్థములందును లేవు. పిండిపదార్థములనంత పిప్పి పదార్థముగూడ మరి యే ఇతర పదార్థములందును నుండదు.

చిక్కుడు, చేమ్మ, గోరుచిక్కుడు, అలచంద, బొబ్బర, అనుములు, [illegible] మొదలగు వాని యందు మాంసకృత్తులు ప్రొటీన్సు విశేషముగా గలవు. వానిని బాగుగా నుడికింపవలెను, లేకున్న అవి జీర్ణముకాక రోగమును గలిగించును. రోగులుగా నున్నవారికి ఆహారముగా నీయ రాదు. బాగుగా జీర్ణముచేయుడల [illegible] రక్త వృద్ధిని, క్రొవ్వును గలిగించు గుణమున్నది. దీని యందు లోహము (ఇనుము) గూడ చాల హెచ్చుగా నున్నది. చిక్కుడుకాయ లేతగా నున్న, తేలికగా జీర్ణమగును. గింజ ముదిరిన కొలదిని, జీర్ణమగుట కష్టము. అవి బాగుగా వండిన రుచిగానుండి జీర్ణమగును. సోయాబీను నానబెట్టి మొలకవచ్చినతరువాత తినవలెను. వానియందు మాంసకృత్తు చాలయెక్కువగా గలదు. జీవనత్తలును ఇందుచాల యెక్కువగనే యుండును. పిప్పిపదార్థముగూడ నిందు బాగుగనే కలదు. కాని జీర్ణశక్తి బాగుగనున్నవారే వీనిని తినవలెను.

## పండ్లు

ఏవిధమున చూచినను ఫలములకు సాటియగు

వస్తువు కనుపించదు. వీనియందు తినినంతనే రక్తములోచేరి బలము నొసంగు చక్కెర యున్నది. దేహమునందలి మాలిన్యములనెల్ల తోసివేయు గల క్షారములున్నవి. జీవసత్త్వలున్నవి. మురికిని కడిగివేయుగల ఆమ్లములున్నవి. జిహ్వకు రుచిని గలిగించు సువాసన యున్నది. చమురున్నది. బడలికను తీర్చు గుణ మున్నది. కావలసినంత పిప్పిపదార్థ మున్నది.

ఫలములయందున్న కర్బన హైదరిజములు (Carbo - Hydrates) చక్కెర, డెక్స్ట్రిన్, ఆమ్లములుగాను ఉండి తినినంతనే సులువుగా జీర్ణమై రక్తములో కలియును. అజీర్ణరోగుల కివి చాలమేలుచేయును ఫలములయందు లోహము (ఇనుము) గలదు. ఇది చాల త్వరగ రక్తములో గలియును. ఇంతకన్న సులువుగా జీర్ణమగు వస్తువులు లేవు.

ఆపిలు పండ్లు తినినయెడల పూర్తిగా మల విమోచనమగును. ఎక్కువగా తినని మలబద్ధకము నిది పోగొట్టును.

పియరు అనునది తియ్యనిపండు. ఇందుపుల్లని రుచి లేనేలేదు. బలవర్ధకమైనది.

నారింజ తీపికలిసిన పుల్లనిరుచి గలది. లోహ మెక్కువగా నుండును. రక్తశుద్ధిని గలిగించును. మలబద్ధకమును పోగొట్టును. భగవద్దత్తమగు ఆహారములలోనేమి, ఫలములలోనేమి నారింజ పండునకు తుల్యమగు వస్తువు లేదు. ఇంత రుచి కరమైనదియును లేదు. తినినంతనే జీర్ణమై దేహమునకు సత్తువ నొసంగును. రెండు నారింజపండ్లు తినిన ఒకరొట్టె తినినంతబలము కలుగును. ఇందు లోహము, సున్నము మొదలగు సేంద్రియ లోహలవణములు గలవు. ఫరుండ్లబ్బోవునపుడు 1, 2 నారింజపండ్లు తినినయెడల మలము పూర్తిగా వెడలిపోవుటకు సాయపడును. నిద్రలేచిన వెంటనే తినుటవలనను ఇదే మేలుకలుగును. జ్వరాదులయందు నారింజపండునకు సాటియైన యాహారము లేనేలేదు. ఉత్సాహమును గలిగించును.

బత్తాయి పండు తియ్యగనుండును ఇందులోహమునకన్న సున్న మెక్కువగా నుండును. అందువలన తియ్యగానుండును. వేడితత్వముగలవారికిని ప్రేగులయందు ఉద్రేకము గలవారికిని నిది చాల మేలుచేయును. నారింజపండునందుకన్న నెక్కువ పోషకద్రవ్యములుగలవు. జ్వరాంతమున రోగికి బలమును గలిగించుట కిచ్చు నాహారములలో దీనిని చేర్పవచ్చును.

కమలాఫలము మిక్కిలి తియ్యగానుండును. మూత్రవ్యాధులను పోగొట్టుటలో మిక్కిలి శక్తి గలది. ఇందుసున్నము ప్రధానలవణము. ఇందలి చక్కెర త్వరగా జీర్ణమై దేహమునకు పోషణ నొసంగును. గడ్డకట్టినకఫములను కరగించివెలువరించును.

అరటిపండులో ననేకరకములు గలవు. చక్కెరకేళి- దీనినే తెల్లచక్కెరకేళి యందురు. దీనియందు కర్బనుహైదరిజములు ప్రధాన ద్రవ్యములు. ఇందలి పిండిచక్కెర బాగుగా ఉమ్మి కలియునట్లు నమలిననేగాని జీర్ణముకావు. జీర్ణశక్తి లోపించి యున్నవారి కివి అజీర్ణముచేయును. బలకరమైనవి.

కర్పూరచక్కెరకేళి తెల్లచక్కెరకేళి కన్న తేలికగా జీర్ణమగును. బొంతఅరటియందలి పిండిపదార్థము చాల కష్టముమీద జీర్ణమగును. కష్టపడిపనిచేయువారివి తినవచ్చును. ఇతరులు తినిన జీర్ణముకావు. రసధాళి, ఆకుపచ్చఅరటి, యెర్రఅరటి, అమృతపాణి మొదలగు అనేకరకము

లింపు గలవు. మితముగా తినిన చాల మేలు చేయును మనవాయ్పళం అనురక మింకొకటి కలదు. ఇది సులువుగా జీర్ణమగునని చెప్పుదురు. బొప్పాయి పండు చాలతియ్యగా హితవుగా నుండును. లేతకాయలు కూరగా తినవచ్చును పండినపండు బలకరమైనది. మలమును శోధించును. మలబద్ధకరోగుల కీ పండు చాల మేలు చేయును. పాలు తక్కువగానున్న తల్లులీపండ్లను తినిన పాలుఎక్కువగును. వేడినితగ్గించును పోడి దగ్గు గలవారిదితినిన కఫము పలుచబడి వెడలి పోవును. ఇందులోను అనేకరకములు. ౬ అంగుళములు మొదలు 18 అంగుళముల వరకుపొడవు గలిగినపండ్లరకము లనేకములు గలవు

అత్తి పండు చెట్టునుండి కోసినది చాల రుచి కరముగను తేలికగను నుండును. మలమును వెలువరించు స్వభావము గలది. పోషకద్రవ్యములు ఇందులో నెక్కువగా కలవు. అవి దేహము నందు తేలికగా ప్రవేశించుస్థితిలో నున్నవి.

కిస్మిసి తియ్యగా నుండును. బలకరమైనది. కఫములనుకరగించును. ఎక్కువగాతినినఅజీర్ణము చేయును. ఆమ్లపిత్తము (acidity) గలవారికి మిక్కిలి హితవుగానుండును. జీర్ణాశయదాహము (Gastritis) గలవారి కిది హితమైన ఆహారము. మూత్రవ్యాధులందు వాడదగినది.

దాక్ష గుండెకు బలము కలిగించును లోపల నున్న పుండ్ల (Internal Sores)ను మాన్పును. జ్వరాదులయందు హితమైనది. కఫములను బలుచన జేయును. మలమును వెడలించును. జిహ్వకు హితవు గలిగించును. పైత్యమును పోగొట్టును.

అనాస మూత్రమును జారీచేయును. వేడిని తగ్గించును. కఫములను కరగించును. విరేచనము చేయును. జిహ్వకు హితవుగా నుండును. తేలికగా జీర్ణమగును. చురుకుదనమును ఉల్లాసమును గలిగించును.

## ఎండిన పండ్లు

బెల్లపు పాకము మొదలగునవి చేరనియెడల నెండినపండ్లుగూడ మేలునే చేయును. సామాన్య పద్ధతిని నెండబెట్టినవాటికన్న డిహైడ్రేషన్ (Dehydration)పద్ధతినినెండబెట్టినవి యెక్కువ నిర్మలముగా నుండును ఎట్లెండబెట్టినను అందలి కొన్ని జీవసత్తలు తగ్గిపోవును. సదా పండ్లన్నియు నెండనివే మంచివి.

## ప్రశ్నలు

౧. ఆరోగ్యకరములైన ఆమ్లము లెన్ని? అవియేవి? అనారోగ్యకరములగు ఆమ్లములెన్ని? అవియేవి! మాలికామ్లమే పదార్థములం దుండును?

౨. ఆసిటికామ్లము (acetic acid) నందుగల అపదయేమి? అది సామాన్యముగా నేరూపములో లభించును? దానికి సరియైన బదులు ద్రవ్య మేది?

౩. యూరికామ్లము ఎందు నెక్కువగా నుండును? ఆహారశాస్త్ర ప్రకారము మాంసాహారము తినదగనిపదార్థమని యెట్లు నిర్ణయింతువు?

౪. ధాన్యములలో కొన్నిరకములను పేర్కొనుము. ధాన్యములు వాడుకొనుటలో సామాన్యముగా ఏ పొరపాటు జరుగుచున్నది?

౫. బంగాళాదుంపయందు ఏ మేమి మంచి పదార్థములు గలవు? రొట్టెతో బంగాళాదుంపను పోల్చిచూచి యేది సులువుగా జీర్ణమగునో వ్రాయుము.

౬. కాబేజి మంచి ఆహార పదార్థమని యెట్లు నిర్ణయింతువు? దానిని వండి తినుట మంచిదా? వండక యేతినుట మంచిదా? ఎందువలన?

౭. ఆకుకూరల యందు ఏ మేమి దేహమున కుపయోగించు ద్రవ్యములున్నవి?

౮. కాయ ధాన్యము లన నేమి? అవి మనకు నెట్లుపయోగకారులు?

౯. నారింజపండ్లు దేహమున కెట్లుమేలు చేయును?

౧౦. విరేచనకారు లగు కొన్ని పండ్లను పేర్కొనుము?

# ప్ర కృ తి గృ హ వై ద్య ము

౧౦ వ పాఠము

## ఆహార శాస్త్రము - 3 వ భాగము

### చ ము రు ది ను సు లు

సత్తువనీయగల ఆహారములలోనెల్ల నీచమురు కాయలు మిక్కిలి శ్రేష్ఠమైనవి. ఇందున్న దేహపోషకద్రవ్యములు మ రేవస్తువునందును లేవు. ఈ చమురుకాయలు సులభముగా జీర్ణము కావని అనేకుల నమ్మకము. కాని బాగుగా నమలినచో ఇవి బాగుగనే జీర్ణమగును. ఇందు దేహమునకు అవసరములగు సేంద్రియములగు లోహము (ఇనుము) సున్నమును కలవు. మాం సమునందుకన్న ఎక్కువ మాంసకృత్తులు ఇందు కలవు. మాంసమునందు యూరికామ్లమును, యూరియాను గలిగించునట్టి చెడుపదార్థమును, గలవు. అవి యిందులేవు. మాంసమునందు త్వరగా కుళ్లును గలిగించునట్టి శిలీంధ్రము లుండును. ఇందవి యుండవు.

చమురుకాయల నుండి తయారుచేసిన వెన్న మిక్కిలి సులభముగా జీర్ణమగును. ఇందు దేహ పోషక ద్రవ్యములును ఎక్కువగనే యుండును. సీమబాదం, అక్రోటు, వేరుశెనగ, పిస్తా, కొబ్బరి, జీడిపప్పు మొదలగువానియం దెల్ల మాంసకృత్తు లుండును.

### మాంసాహారము

మాంసమునందుగల దేహపోషక ద్రవ్యము లన్నియు కాయలు, కూరలు, పండ్లు, ధాన్య ములు, చమురుకాయలు మొదలగువానియందు సులభముగనే లభించును. కాయలకు, కూరలకు, వ్యయముచేయు ధనమునకు ఎన్నియో రెట్లు ఖర్చుపెట్టినగాని మాంసాహారము లభించదు. జంతువులుతిను నాహారముయొక్క సారమే, వాని దేహములందు మాంసముగా నేర్పడును. ఆహార ములు సక్రమముగా జీర్ణమగుటకు కొంత పిప్పి పదార్థమును కొన్ని సేంద్రియములగు లోహ లవణములును నుండవలయునని మన మిదివరకే చదివియున్నాము. మాంసమునందు మాంస కృత్తు చాల ఎక్కువగనే యుండును. కాని అది జీర్ణమగుటకు కావలసిన లోహము మిక్కిలి స్వల్పముగా నున్నది. సున్న మందు లేనేలేదు.

మాంసమునందు యూరికామ్లమును గలిగించు స్వభావ మున్నది. కనుక మాంసాహారుల మూత్రపిండములు త్వరగా చెడిపోవును గనుక వారికి అతిమూత్రము, కర్కట వ్రణము, సంధి వాతము, మేహవాతపు నొప్పులు, మొదలగు నవి కలుగును. మాంసము కోసి నప్పటినుండియు నది మురుగుచునే యుండును. మాంసమునందు ఎల్లప్పుడును కొంతభాగము, జీర్ణముకాక నిల చియే పోవును. అది ప్రేగులలో మురిగి క్రుళ్ళిత్తు చుండును.

మాంసములలో నెల్ల పందిమాంసము మిక్కిలి నికృష్టమైనది. ఇది మనుజులమలమును తిని జీవించును. దీనిమాంసము నందును అదేస్వభావ ముండుట సహజమేకదా!

చేపలు మాంసమునకన్న ఏవిధమునను మంచివి కావు. మాంసమున కన్నను చేపలే ఎక్కువ త్వరగా

క్రిమిపోవును. చేపలు తినుటవలన చర్మవ్యాధులు కలుగును. ఎండ్రి పీత మొదలగు కొన్ని జంతువులు అరుగనే అరుగవు.

మాంసమును ఎక్కువగా తినువారు ఎక్కువ విషములను తినుచున్నారనే యర్థము. ఒక భూత అద్దము క్రిందనుంచి చూచినచో ఒక మాంసపు ముక్కయందు కోటానకోట్లు క్రిములను పుట్టించు సూక్ష్మజీవు లున్నట్లు గుర్తింప బడినది. అమెరికా యందలి, మిచిగాన్ నగరమునందుగల బాటిల్ క్రీక్ శానిటేరియం అను చికిత్సాలయమున కధిపతులగు జే. హెచ్. కెల్లాగ్ గారు అనేక శాస్త్రీయ మగు పరిశోధనల చేసి మాంసాహారమునందు ప్రాణహానికరములగు విషములు అనేకములు కలవని వెల్లడించిరి.

ఎప్పుడైనను కదాచిత్తుగా మాంసముతినువారు అట్లు మరణింపక పోవచ్చును. ఆరోగ్యవంతుల దేహములందు తినినమాంసములందలి విషములను సంహరించు సామర్థ్య ముండవచ్చును. వారికి మాంసాహారము అప్పటికి అపకారము చేయక పోవచ్చును. అంతమాత్రమున మాంసాహారము నిరుష్టమైనదనికాని, అందు క్రిములను గలిగించు స్వభావము లేదనిగాని, అదిదేహ పోషణకు అవసరమైనదనికాని శాస్త్రజ్ఞానము కలవా రెవ్వరును ఒప్పుకొనజాలరు.

# పాలు

పాలయందు లోహము (ఇనుము) తప్ప తక్కిన పదార్థము లన్నియుకలవు. కనుకనే కేవలము పచ్చికమేసి స్వేచ్ఛగాజీవించు ఆవులపాలు చాల మంచివి. ఆవుపాలు కాచకపూర్వమే త్రాగవలెను. కాచినగాని నిలువయుండవుగాన ఆవు పాలను కాచి, నిలువచేసికొందురు. అట్లునిలువ చేసినపాలు సులభముగా జీర్ణముకావు.

ఆవుపాలు పచ్చిగానున్నప్పుడే వెన్నతీసి త్రాగిన యెడల సులభముగా జీర్ణమగును. వెన్నతీయని పాలు ఆలస్యముగా జీర్ణమగును. పాలయొక్క వాడుక నింగ్లీషువైద్యులేకాక ప్రకృతివైద్యుల లోను చాలమంది ఒప్పుకొనియున్నారు. పాండువ, క్షయ, మొదలగు వ్యాధులయందు వాడి సుగుణములను గాంచినట్లు వ్రాసినారు. ['పాలయొక్క వాడుకలేకయే నేను ఇట్టివ్యాధులను కుదిర్చియున్నాను.' అని బెనిడిక్టు లస్టుగారు తమ యను భవమును వెలిబుచ్చిరి. పు. వెం.] పాలు త్రాగినంతనే కొందరికి వికారముకలుగును. ఎన్నిసార్లు పాలుత్రాగిన అన్నిసార్లు వికారముకలుగు చుండును. అట్టివారికి పాలను జలవంతముగా నిచ్చుటమంచిదికాదు. పాలయందు లోహము చాలతగ్గియుండును. కనుక ప్రతిదినమును కొన్ని నారింజపండ్లనుకూడ యిచ్చుచుండవలెను. పాలకును పండ్లకును మధ్య 2, 3, గంటల వ్యవధి యుండవలెను.

# సుగంధ ద్రవ్యములు

ఆహారమునందు రుచిని పుట్టించుటకుగాని, సువాసనను గలిగించుటకుగాని ఎట్టి మసాలాలను చేర్పరాదు. తాలింపులు వేయరాదు. పోపులువేయ కూడదు. అవియన్నియు జీర్ణాశయమునందు ఉద్రేకమును కలిగించును. అందువలన విదాహము కలుగును. జీర్ణసంబంధమగు ఇతరావయవములందు పీడనకలుగును. నిజమైన ఆకలి లేనప్పుడే ఆహారమునందు ఉప్పుచేర్చుకొనవలయు ననిగాని, రుచిని కలిగించుటకు తాలింపులు పోపులు మొదలగునవి వేయవలయుననిగాని కృత్రిమమగు కోర్కెకలుగును. కనుక ఉప్పు, మిరపకాయ, మిరియములు, ఆవాలు, మెంతులు, జీలకఱ్ఱ, యాలకులు, లవంగాలు, పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, మొదలగు ద్రవ్యములను ఆహార

పదార్థములయందు చేర్పరాదు. వాని వాడుక వలన వ్యాధికలుగును. అవి మానుటవలన ఆరోగ్యము కలుగును. కనుక ఆహార పదార్థములుగ నవి వర్జనీయములు.

## టీ-కాఫీ

టీయందు టానిన్ అను విషమున్నది. కాఫీయందు కాఫిన్ అను విషమున్నది. ఈవిషములు రక్తపు పోటును ఎక్కువచేయును. హృదయపు నడకను పాడుచేయును. మూత్రికామ్లమును కలిగించును. అందువలన మూత్రపిండములు పాడగును. జీర్ణశక్తి చెడిపోవును. పైత్యకోశము తిన్నగా పని చేయదు. కనుక వీనిని త్రాగుట మానవలెను. కోకోయను నింకొక పానీయ మున్నది. అందు థియోబ్రోమిన్అను విషమున్నది. ఆ విషము ఆరోగ్యమును చెడగొట్టును. ఈసంగతి తెలియని వారు కోకో నిరపాయకరమని భావించెదరు. అదితప్పు.

## జలము

కొందరు సరిపోయినంతనీటిని త్రాగరు. దేహమునందలి కదలికల కన్నిటికిని నీరు అవసరమై యున్నది. సామాన్యమగు ఆహారము తినువారెల్లరు దినమునకు 1, 2, శేర్లనీటిని త్రాగవలెనని డా. కెల్లాగ్ గారు వ్రాయుచున్నారు. నిజమునకు ఆహారపదార్థము లన్నిటియందును కొంచెమో గొప్పయో నీరుండనేయుండును. పొడిపదార్థములు తినినప్పుడు నీటిని ఎక్కువగా త్రాగవలసియుండును. ఆహారము తగ్గించి తినినప్పుడును దేహమునకు కావలసిననీరు లభించదు. అందువలన అప్పుడుకూడ ఎక్కువనీటినే త్రాగవలసియుండును. సరిపోయినంతనీటిని త్రాగినయెడల రక్తము సక్రమముగా అభిసరించును. రక్తపు పోటును నీరు తగ్గించును. నీటిని కండరములలో నిలువయుంచి దేహము వాడుకొనుచుండును. అందువలన మనము త్రాగునీరు మిక్కిలి నిర్మలముగానుండవలెను, ఉప్పగానున్నట్టియు, చేదుగానున్నట్టియు, సున్నము మొదలగు ఖనిజములు చేరియున్నట్టియు నీటిని త్రాగరాదు. అట్టినీరే తప్ప దొరకని చోటులయందు నివసించువారు మరగకాచిన నీటినితేర్చి రోగులకు ఈయవలెను.

## రోగనివారకములగు ఆహారములు

మనఆహారమందలి లోపములే అసంఖ్యాకములగువ్యాధులకు కారణములనివివరించియున్నాను. ఇది అతిశయోక్తి ఎంతమాత్రమును కాదు. కనుక ఆహారమందలి లోపములనుసవరించినంతనే రోగములును మాయమగుచున్నవి. అందువలన ప్రకృతి చికిత్సయందు ఆహార శాస్త్రమునకు ప్రాధాన్య మీయబడుచున్నది.

ఆహారమందలి లోపములు అసంఖ్యాకములుగానుండును. ప్రతివారును నేదో యొకలోపమును చేయుచునేయున్నారు. కొందరు తినవలసిన దానికన్న ఎక్కువతిందురు. మరికొందరు తక్కువ తిందురు. మరికొందరు దేహమునకు అత్యవసరములగు విటమినులు, లోహలవణములులేని ఆహారమును ఎక్కువగా తిందురు. కొందరుసకాలమున భుజింపరు. కొందరికి భోజనకాలమున ఎక్కడా లేనితొందర. కొందరు భోజనముమధ్య నీరు త్రాగుచుందురు. కొందరు కలపకూడనిపదార్థములు కలుపుకొనితిందురు. కొందరు ఎక్కువగా నిలువయుంచిన పదార్థములను తిందురు కొందరు మసాలాలు వేసిన పదార్థములు తిందురు. కొందరు చప్పని వస్తువులు తిందురు. కొందరురోజూ ఒకటే పదార్థముతో తింపరు. కొందరుజీర్ణముకాని పదార్థములు తినెదరు. కొందరు మిక్కిలి చల్లని పదార్థములు,కొందరు వేడిపదార్థములు తినెదరు.

మిక్కిలి అలసియున్నప్పుడును మనస్సు ఉద్రేకించి యున్నపుడును కొందరుతినెదరు.

ఆహారమునందలి లోపములవలన కడుపు బరువగుట, ఊదినట్లుండుట, తలనొప్పి, నీరసము కలుగును. వీనియన్నిటికిని మలబద్ధకముమూలకారణమైయుండును. ఇదివరకే మలబద్ధకమునకు చికిత్స చెప్పబడియున్నది. ఈసందర్భమున ఆభాగమును ఒకతూరితీసి చదువుడు.

మలబద్ధకమే రోగములన్నిటికిని ప్రధాన కారణమగుటవలన మనఆహారమునందు మలవిమోచన కరములగు పదార్థములనుకూడ చేర్చితినవలెను. అవియేవనగా:—

పాయలకూర, పొన్నగంటి, చక్రవర్తి, చిర్రి, బొద్ది, పాలకూర, తోటకూర, మెంతికూర, కూతురు బుడమ, టొమెటో, కాబేజి, కాలీఫ్లవర్, ద్రాక్ష, రాచఉసిరిక, గుమ్మడి, సొర, (ఆనప) బీర, పొట్ల, దోస,దొండ, లేతచిక్కుడు, ముల్లంగి, ఆల్‌బఖరా, జలదారు, పండ్లు ధాన్యములపైనుండు తవుడు.

# సన్ననివారు బలియుటకు

సన్ననివారు బలియుటకు ముందు ఆకలి జ్వలించుటకై నారింజ మొదలగు ఫలరసములను త్రాగవలెను. తరువాత ఆకలి వృద్ధియైన కొలదిని కొంచెము కొంచెముగా నానవేసిన గోధుమలో, లేక గోధుమ రొట్టెయో, క్రమ క్రమముగా పెంచుచు నిచ్చుచుండవలెను. తరువాత కొంచెము క్రొవ్వుపదార్థములనుకూడ ఇచ్చుచుండవలెను. మాంసకృత్తులను కొద్దిగా మాత్రమే యిచ్చుచుండవలెను. సున్నము, లోహము (ఇనుము) విటమినులు (జీవసత్తులు) గల ఆహారములు ఇందుకు ఎక్కువ అవసరమై యున్నవి. విశ్రాంతితోకూడిన క్షీరాహారమువలన నింతకన్న వడిగా గుణమిచ్చునని బెనిడిక్ట్ లస్టుగారు వ్రాయుచున్నారు.

# ఉపవాసము

దేహమునందు మాలిన్యములు ఎక్కువగా చేరినప్పుడు కొలదికాలము ఉపవాస ముండవలెను. అతిసారము, గ్రహణి, వాంతులు, కలరా కడుపు ఉబ్బరము మొదలగు వ్యాధులందెల్ల ఉదరమున మాలిన్యములు మురుగుచుండును గాన ఆదినములలో ఉపవసించుటవలన చాలమేలు కలుగును. అనేకులు దీర్ఘోపవాసములవలన మేలుకలుగునని నమ్మెదరు. దీర్ఘోపవాసములందు దేహమునందలి అన్ని అవయవములనుండియు ద్రవములు పిండబడి దేహయంత్రమును నడిపించును. అందు ప్రమాదములు కలుగవచ్చును. 2,3, దినములు ఉపవసించుటకు ఎవరిసహాయమును అక్కరలేదు, కాని అంతకు ఎక్కువకాలము చేయవలసినప్పుడెల్ల సమర్థుడగు ప్రకృతివైద్యునిసమీపమునందే చేయవలెను. 20 దినములకు ఎక్కువ కాలము చేయవలసినప్పుడు ఇతర సాంప్రదాయిక వైద్యుల సహాయముకూడ పొందవచ్చును. ఉపవాస కాలమున నీరు ఎక్కువగా త్రాగుచుండవలెను. ఫలరసములను త్రాగుచు చేయు ఉపవాసములవలన ఎక్కువ నమ్మకముగను ప్రమాదరహితముగను సుగుణములు కలుగుచుండుట ప్రత్యక్షానుభవమునచూచియున్నాము.ఉపవాస కాలమున ప్రతిదినమును ఎనిమా చేయుచుండవలెను. మాంసకృత్తులులేని ఆహారములు తినుచుండుటవలన ఉపవసించుటవలెనే సుగుణములు కలుగునని డా. కెల్లాగ్‌గారి నమ్మకము. మాంసకృత్తులవలననే త్వరగా క్రుళ్లు పుట్టుచుండునని ఆతని నమ్మకము. అందువలన మాంసకృత్తులు మానినప్పుడు క్రొత్తమాలిన్యములును విషములును దేహమునందు కలుగవు.

## పథ్యమునందలి కొన్ని రకములు

కొన్ని ప్రయోజనముల కొరకు కొన్ని రకముల పథ్యము లున్నవి. వాని నీక్రింద పేర్కొనుచున్నాము.

**లావును తగ్గించుటకు:** ఇప్పుడు దేశమున ననేకులు తమలావును తగ్గించుకొనవలయుననియు తాము సన్నగా నాజూకుగా యువతీ యువకుల వలె సుకుమారముగా కాన్పింప వలయు ననియు ప్రయత్నించు చున్నారు. ఆ విధమగు సలహాను కోరుచున్నారు. కాని విపరీతముగ లావు బరువు బాధింప కుండునంతవరకు ఎవ్వరును తగ్గించుటకు ప్రత్యేక ప్రయత్నము చేయరాదు. ఏలయన అట్లుచేయుటలో కొంత ఆరోగ్యము చెడిపోవచ్చును. ఉపవాస కాలమున దేహమునందలి క్రొవ్వేగాక ఇతర ధాతువులును తగ్గిపోవును.

లావును తగ్గించుటకు తిను నాహారములందు క్రొత్తగా క్రొవ్వు చేర్చునట్టి వానిని తినగూడదు. కర్బన్ హైడ్రజములను అనగా పిండిపదార్థములను, తీపిపదార్థములను, క్రొవ్వుపదార్థములను తినవలెను. ఆహారమునందు ఆకుకూరలు, కాయగూరలు, పండ్లు మజ్జిగ ఎక్కువ భాగముగా నుండవలెను. ఉపవాసము చేసినప్పటికన్న ఇట్లు చేయుటవలన సుఖముగా నుండును. ఈపద్ధతి నిరపాయకరమైనది. ఉప్పు చాలవరకు తగ్గింపవలెను. వీలుగా నున్న మానివేయవలెను. చెమట కలుగునట్లు ఎండలో తిరుగుటయో, ఆవిరి పట్టుటయో, గొంగళి చుట్టలు వేయుటయో, చేయవలసియున్నది. ఇందువలన దేహమునందలి మాలిన్యములు పోవుటకు మార్గ మేర్పడును. దేహమునకు చెమట కలిగినప్పుడెల్ల చన్నీటి స్నానము చేయుచుండవలెను.

**గ్రహణికి:** మాంసము, గ్రుడ్లు, పప్పు, దుంపలు మొదలగు వానిని మానవలెను. పండ్లరసములను ఆకుకూరలను తినవచ్చును. వానివలన సహితము గ్రహణి తగ్గనియెడల చన్నీరు త్రాగుచు ఉపవసించుట మేలు.

**ఆమ్లపిత్తమునకు:** జీర్ణాశయమునందు పులుపు ఎక్కువైనపుడు ఈవ్యాధికలుగును. భోజనము చేసినతరువాత 2, 3, గంటలకు జీర్ణకోశమునందు నొప్పియు మంటలును కలుగును. రోగనిదానముచేసిన తరువాత ఈక్రింది ఆహారములను మానవలెను:—మాంసము, మాంసముతో సంబంధించిన కూరలు, పాలు, జున్ను, పంచదార, మసాలాలు చేర్చినపదార్థములు, మిక్కిలి వేడియైన పదార్థములు, మిక్కిలి చల్లనిపదార్థములు, పుల్లనిపండ్లు, కాడ్రి, సారాయి, ఉప్పు, పొగాకు, కాఫి, ఎక్కువగా తినుట, ఎక్కువసారులు తినుట, నియమములేకుండ తినుట మానవలెను. మలబద్ధకము లేకుండునట్లు చూచుకొనవలెను.

**జీర్ణాశయవ్రణమునకు:** మాంసకృత్తులు, ఉద్రేకమును గలిగించు తాలింపులు, మసాలాలు, మొదలగునవి మానవలెను. సులువుగా జీర్ణమై మలములను వెలువరించు పదార్థములనే తినవలెను.

**అతిమూత్రమునకు:** చమురుగల కాయలను ధారాళముగా తిన వచ్చును. ఆహారము నందు ఎక్కువభాగము పిప్పిగల పదార్థములుండవలయును. ఆకుకూరలను కాయగూరలను తినుట వలన అతిమూత్రము తగ్గును. ప్రేగులయందు క్రుళ్లు పుట్టకుండా చూడవలయును. ప్రేగులయందు క్రుళ్లుకలిగినప్పుడువృక్వకము (pancreas) చెడును. అందు వలన దేహము నందలి శర్కర కాలి (పచనమై) శక్తిగా మారదు. అది మూత్రముతో కలిసి వచ్చుచుండును. తిను పంచదార,

తియ్యని పదార్థములు, తియ్యనిపండ్లు, తెల్లనిపిండి, ధాన్యములు, బంగాళాదుంపలు, మొదలగు కర్బన్ హైడ్రొజను లెల్ల తగ్గింపవలెను. మాంసము, గుడ్లు కాక మిగిలిన మాంసకృత్తులను అనగా పప్పుపదార్థములను తినవచ్చును.

గర్భిణీ స్త్రీలకు: తల్లికిని గర్భమునందున్న బిడ్డకును బలకరములగు ఆహారములు అవసరము. అవి ఏవనగా: తవుడు తీయని బియ్యము, ఫలములు, ధాన్యములనుండి తీసిన శర్కర, ఖర్జూర, ద్రాక్ష, రేగు, ఆల్‌బఖరా, జలదారు, అత్తిపండు, చిక్కుడు. చమురుగల కాయలు తినవలెను. మంచినీటిని ఎక్కువగా త్రాగవలెను. బెల్లపుపాకము, టీ, కాఫీ, తెల్లబియ్యం, పొట్టు తీసిన ధాన్యములపిండ్లు, పిండివంటలు మొదలగునవి తినరాదు.

జ్వరములకు: ఉపవాసము మిక్కిలి శ్రేష్ఠమైనది. ఆదినములలో నారింజ, కమలా, బత్తాయి, సంత్రా, సాతుకుడీ, కిచ్చిలీ, పచ్చిద్రాక్ష పప్పి కిసిమిస్, ఆల్‌బఖరా, జలదారు మొదలగుపండ్లను తినవచ్చును. పలుచని మజ్జిగ పచ్చి కూరగాయలను కూడ కొద్దిగా తినవచ్చును.

బహిరంగపు వ్రణములకు: విటమినులు అనగా జీవసత్తులుగల ఆహారములు, ఇనుము సున్నము ఎక్కువగాగల ఆహారములు ధారాళముగా తినవలెను. కూరగాయలను, పండ్లను, కర్బన్ హైడ్రొజములను తినవచ్చును. మాంసకృత్తులను మానవలెను.

## ప్రశ్నలు

౧. భేదికరములగు ఆహారములన్నిటిని పేర్కొనుము.

౨. మాంసముయొక్క గుణములను పేర్కొని అది ఎందుకు తినరాదో వివరింపుము.

3. పాలు ఆహారముగా నిచ్చునప్పుడు గమనించు విధులెవ్వి?

౪. మనిషి ఒరువును తగ్గించుటకు ఏ ఆహారములను తినవలెను?

౫. ఉపవాసమువలన ఎట్లు రోగనివారణమగును? దానిని విధించుటలో గమనించే వలసిన విధులేవి?

౬. కాఫీ, టీ, కోకోలను త్రాగినప్పుడు కలుగు హాని ఏమి?

౭. జ్వరకాలమున ఎట్టిఆహారమునుతినవలెను.

౮. అతిమూత్రరోగి తినవలసిన ఆహారమేది?

౯. జీర్ణాశయ వ్యాధులుగల రోగికి ఎట్టి ఆహారము నీయవలయును.

౧౦. ప్రకృతి చికిత్సయందు పథ్యముయొక్క స్థానమేమి?

---

☞ జవాబులు కాగితమునకు ఒకవైపుననే వ్రాయవలెను ప్రశ్నసంఖ్య జవాబులకు వేయవలెను. ప్రతికాగితమునకు వరుసనంఖ్య వేయవలెను. కాగితములన్నియు కుట్టవలెను; లేదా కట్టవలెను.

# ప్రకృతి గృహ వైద్యము

౧౧ వ పాఠము

## మర్దన చికిత్స

అనాదికాలమునుండియు దేహమునకు మర్దన చేయుటవలన లాభములు కలవని గ్రహించి ఆచరించుచున్నట్లు మనకు తెలియును. ప్రకృతి వైద్యులే కాక మందువైద్యులు కూడ ఈచికిత్సా విధానముయొక్క మాహాత్మ్యమును గ్రహించి యుండిరి. వాగ్భటమునందును సుశ్రుతమందును మర్దనచికిత్సయొక్క ప్రశంస కలదు. వాత్స్యాయనుడును మర్దనమును అభివర్ణించియున్నాడు. జె. పి. ముల్లర్, జె. హెచ్. కెల్లాగ్ మొదలగు పాశ్చాత్యపండితులును మర్దనచికిత్సను ఎక్కువగా ప్రచారముచేసియున్నారు.

ఇట్టి మర్దనచికిత్సయొక్క ప్రయోజన మేమని మీరు అడుగవచ్చును. అవి అసంఖ్యాకములు. మర్దన చేయుటవలన దేహమునందలి కండరములకు విశ్రాంతి కలుగును. రక్తాభిసరణము వృద్ధిపొందును. సముద్రపుపాచి (స్పంజి) నీటిని పీల్చుకొనునట్లు మన దేహమునందలి కండరములచే పీల్చుకొనబడిన విషములు మర్దనచేసినప్పుడు బయటికి పిండివేయబడును. మర్దనవలన నాడీశక్తియందు ఉజ్జీవనము కలుగును. నాడులయందలి గమనము వృద్ధిపొందును. ఊపిరితిత్తులు బాగుగా పనిచేయ నారంభించును. నాడులయందలి ఉద్రేకములు తగ్గిపోవును. కీళ్లయందు నిలిచిపోయిన చెడులవణములు తగ్గిపోవును. ఆరోగ్యవంతుడు రోగికి మర్దన చేయునప్పుడు ఆరోగ్యవంతుని దేహమునుండి ఒక మహత్తరమైన శక్తి (ధాతుకాంతశక్తి) రోగిదేహములోనికి ప్రవహించును. ఈసంగతి అనేకులకు తెలియదు ఈ విషయమును గురించి విశేషముగా తెలిసికొనదలచినవారు సునిశితవైద్యమును చదువవలెను.

మానవుడై జన్మమెత్తినందుకు పరులకు మేలు కలుగుటకు తాను త్యాగముచేయుటకన్న ప్రయోజన మేమున్నది? శిబి, రంతిదేవుడు, కర్ణుడు, బలి, భీష్ముడు, రామకృష్ణాది త్యాగధనుల జీవితములు పురాణప్రసిద్ధములే కదా? త్యాగము వలననే మానవజీవితము ఉన్నతిని బొందును. క్రమ క్రమముగా ఆత్మోపలబ్ధికిని త్యాగమే హేతువగును.

మర్దనచేయువానికి ఎక్కువ బాధ్యత లుండును. ఎక్కువ హక్కులుకూడ కలవు. బుద్ధిపూర్వకముగా తన దేహమునుండి కొంత ధాతుకాంతశక్తిని అతడు రోగికి వ్యాపింపజేయును. అందువలన రోగికి శాశ్వతమగు లాభము కలుగును. మర్దనచేయువారికి తాత్కాలికమగు నష్టము కలుగును కాని సూర్యకాంతియందు తిరుగుటవలనను, సత్యము వచించుటవలనను, త్యాగమహిమవలనను, పరులకు మేలుచేసితిమను సంతోషమువలనను ఆ లోటు పూర్తియగును.

అందువలన మర్దనచేయదలచినవాడు ఆరోగ్యవంతుడై బలవంతుడై యుండవలెను. శుచిగనుండవలెను. ఉల్లాసియు ఆకర్షవంతమైన మృదుస్వభావముకలవాడు నయియుండవలెను. మర్దన చేయునది స్త్రీయైనప్పుడును ఈ నియమములే చెల్లును. అట్టివారు మర్దనచేసినప్పుడే సుగుణములు నిశ్చయముగా కలుగును.

మర్దనముచేయువాడు రోగికి కుడిప్రక్కగా అభిముఖముగా నిలిచియుండును. రోగి బల్లమీద కాని, పడకకుర్చీలోకాని పరుండును. రోగికి శక్తియున్నయెడల ఎత్తుపీటమీద కూర్చుండవచ్చును. ఎట్టిఉద్రేకములును లేక రోగి శాంతముగా నుండవలెను. తనకు మర్దనవలన అద్భుతమైన సుగుణములు గలుగునను నమ్మకతో నుండవలెను. మర్దనచేయువారు తమ దేహమునందుండి ధాతుకాంతశక్తిని రోగిపై వర్షింపసిద్ధముగానిలువబడి యుండవలెను. తరువాతచాకచక్యముతోడను లాఘవముతోడనుమర్దనచేయవలయును. అప్పుడు వానిచేతివ్రేళ్ళగుండ ధాతుకాంతశక్తి రోగికి చేరును. ఇట్లు దినదినమును మర్దనచేయువారి దేహమునందలి ధాతుకాంతశక్తి మిక్కిలి సున్నితమైనదగును. దానికిమిక్కిలిత్వరగా చొరబారుశక్తి కలిగియుండును. అట్టి శక్తిగల మర్దకులు మర్దన చేసినప్పుడు రోగులకు తాత్కాలికముగా మర్దకుని స్పర్శ సుఖతరముగ నుండుటయేకాక త్వరగను రూఢిగను సుగుణములు కలుగుచుండును.

మర్దన చేసినప్పుడెల్ల రోగికిగల బాధలు తాత్కాలికముగా ఉపశమించితీరును. ప్రకృతిచికిత్సల యందైనను మర్దనకు సాటివచ్చు చికిత్సాప్రక్రియలు చాల అరుదుగనే యున్నవి. కావున ప్రకృతిచికిత్సకుడుగా నుండదలచినవారెల్ల నీ శాఖయందు నేర్పును గడింపవలయును. అప్పుడు అతడు సులువుగా రోగమును కుదుర్ప గలిగియుండును. జనులు అతనిని బహుమానింతురు. అతని కీర్తి నలుదిక్కులను వ్యాపించును. అతనిస్పర్శవలన అనేకులు సుఖింతురు. దేహముపై భాగమునపిసుకుటకు మర్దనయని పేరు. అది అనేక విధములుగా నుండును. ఒక్కొక్క బాధకు ఒక్కొక్క విధముగా మర్దన చేయవలెను. ఎట్లు చేయవలసిన మర్దన అట్లు చేసినప్పుడే సరియైన సుగుణములు కలుగును.

మర్దన ఆరువిధములు: ౧ ఉత్పాదనము ౨ పీడనము ౩ ప్రహారణము ౪ ఘర్షణము ౫ మర్దనము ౬ స్పందనము - దీనినే హర్షకమనియు నందురు. ప్రహారణము తిరిగి అయిదు విధములు: ౧ తాడనము ౨ వాద్యము ౩ ఛేద్యము ౪ ఆస్ఫాలనము ౫ సంపుటకము.

ఇందు ఒక్కొక్కవిధమగు మర్దనకు ఒక్కొక్క విధమగు ఫలము కలదు. ఏవిధమగు మర్దన చేయవలసినప్పుడు ఆవిధమగు మర్దన చేయుట వలననే మంచి ఫలములు కలుగును. ఒక్కొక్క విధమగు మర్దనవలన రోగము ఎక్కువగును. అట్టివానిని తెలిసి మానవలెను. ఆ వివరములు ముందు వ్రాసెదము.

ప్రకృతిచికిత్సకుడు మర్దనకు అనువగునొకబల్లను సంపాదింపవలెను. ఆ బల్లమీద రోగి పరుండియున్నప్పుడు మర్దనచేయువాడు ఎక్కువగావంగవలసిన అవసర ముండరాదు. మర్దనచేయుటకు వీలుకానంత ఎక్కువ ఎత్తుగను ఉండరాదు. అట్టి బల్లనే సంపాదించుకొనవలెను, లేదా చేయించుకొనవలెను. ఆ బల్లపైన ఒక గట్టి పరుపో, లేక కొన్ని మడతలువేసిన గొంగళియో పరచవలయును. దానిపై మురికియు, దుర్వాసనయు, మరకలును లేని బాగుగాఉదికిన దుప్పటినికాని జముకాణాను కాని పరచవలయును. దానిపైన పరున్నప్పుడు రోగికి హాయిగానుండును. ప్రతి రోగికి మర్దన ముగించినప్పుడెల్ల పైనున్న దుప్పటిని తీసివేయవలయును. దానిని తరువాత బాగుగా ఉతికించవలయును.

రోగి కౌపీనమును(గోచి)మాత్రము ధరించి ఆ బల్లపై పరుండవలయును.

రోగిమీాద నింకొక పలుచనిగుడ్డ కప్పవలయును. ముఖము మూయరాదు. మర్దనచేయు దేహభాగముపైనున్న వస్త్రమును మాత్రము తొలగించి ఆప్రదేశమును మర్దనచేయవలయును. తరువాత ఆ భాగమును మూసివేసి వేరొక భాగముమీాది గుడ్డను తొలగించి యిట్లే మర్దన చేయవలయును. మర్దనచేయునప్పుడు పైనకప్పిన గుడ్డ మర్దనచేయువారికి ఆటంకముగా నుండరాదు.

రోగియొక్క దేహమునందలి బలము సహనశక్తి మొదలగువానిని బాగుగా తెలిసికొనుచు మర్దన చేయవలయును. ప్రతిమర్దనప్రక్రియ ఒకానొక ఫలముకొరకు మాత్రమే చేయవలయును. గ్రుడ్డిగా చేను మేసినట్లు మర్దన చేయరాదు. వీలు చాలులేకుండ ఎట్లెట్లో మర్దనచేసి, పిసికి, మెలివేసి రోగిని మోసగింపవచ్చును. కాని ఆమోసమును రోగి త్వరలోనే గుర్తించును. దానివలన ప్రకృతిచికిత్సకునిబండారము బయటపడును.

మిక్కిలి మోటుగా మర్దనచేయరాదు. దానివలన రోగికి బాధయే కలుగునుకాని, కలుగవలసిన మంచి ఫలములు కలుగవు. కనుక రోగికి హితవగునట్లు మృదువుగా మర్దించుటయే అలవాటు చేసికొనవలెను. ఏ కండరమును పిండవద్దు. చర్మమును గిల్లవద్దు. ఇట్లొకతూరి నీవుచేసినయెడల రోగి నిన్ను చూచినప్పుడెల్ల భయపడుచుండును. క్రొత్తగా మర్దన చేయుట ఆరంభించినవారెల్ల గట్టిగా పిసికినందువలన ఎక్కువ ఫల ముండునని వారు భ్రమపడియెదరు. కాని బలహీనురాలైన స్త్రీకి నెమ్మదిగా పిసికినప్పుడే ఎక్కువ సుఖముగా నుండును. ప్రయోజనమును ఎక్కువకలుగును. ప్రాణములు అవసిపోవునట్లు పిసుకు మోటువాని మర్దనవలన బాధయేకాని ఫలమేమియునుండదు.

మర్దనచేయుటకుముందు రోగి బాగుగా విశ్రాంతి తీసికొనవలయును. దేహమే కాక మనస్సుకూడ విశ్రాంతిని పొందవలయును. తరువాత అతడు దేహమును మరచిపోవునట్లు తన యిష్టదైవమును ధ్యానింపవలయును. మనవద్దకు వచ్చు రోగు లందరును దాదాపుగా నాడులయందు ఉద్రేకముచేత బాధపడుచున్నవారే. జాగ్రత్తగా పరీక్షించినప్పుడు వారి కండరము లన్నియు నెదో పనిచేయుటకు సిద్ధముగా నున్నవాని కండరములవలె తయారుగా నుండును. అవి యన్నియు ముడుచుకొని యుండును. అవయవము లన్నియు విశ్రాంతిని పొందునట్లు దేహకండరములను సళ్లింపుమని కోరుము. అతడు అవయవము లన్నిటిని సళ్లించును. అతడు అట్లు భావించునే కాని కొన్నికండరములు ఇంకను ముడుచుకొనియే యుండును. ఇట్లే నేడు అనేకులు ధనము కొరకును, అధికారముకొరకును, నాడీశక్తిని మిక్కిలి వ్యయపరచుచున్నారు. వానిలో “నీ కండరములు బాగుగా సళ్లలేదు. అవి యింకను ముడుచుకొనియే యున్నవి. వానిని బాగుగా సళ్లింప (Relax) కున్న అపకారము జరుగును. కనుక దేహమును బాగుగా సళ్లింపుము” అని చెప్పవలయును. నీవు చేయుమర్దనవలనను నీవు ఇచ్చు ఆదేశములవలనను వానికి కండరములను సళ్లించు నేర్పు కలుగును. రోగి సుఖముగా బల్లపై పరుసన్న తరువాత నీ చేతులను చల్లని నీటితో కడిగికొనుము. రోగి వెల్లకిలపరుండును. అప్పుడు భుజములనుండి ప్రారంభించి దండచేయి, మునిచేయి, చెయ్యితో మర్దన ముగింపవలయును. తరువాత కంఠమువద్ద ప్రారంభించి ఎదురురొమ్ము, ఉదరము, బయటితొడ, పిక్కలు, పాదములతో ముగింపవలయును. తరువాత అతడు బోర్లపరుండును. అప్పుడు లోపలి

తొడలు, పిక్కలు మర్దన చేయవలయును. చిట్ట చివరకు వెన్నునంటలి కండరములను సళ్లించి మర్దనచేయవలయును.

మర్దనచేయుటలో నీక్రిందిక్రమ మవలంబింప వలయును. ఉత్సాదనము, ఘర్షణము మొదట చేయవలయును. తరువాత మృదుపీడనము, పరిపీడనము తరువాత చేయవలయును. ఆతరువాత తాడనాది ప్రహారణము చేయవలయును. దాని తరువాత స్పందనముచేసి ఉత్సాదనముతో ముగింపవలయును. మర్దన సంబంధమగు పైన పేర్కొనబడిన ప్రక్రియల వివరములు యీక్రింద నీయబడుచున్నవి:—

## ౧ ఉత్సాదనము (Stroking)

రోగియొక్క దేహముమీద అరచేతిని ఆనించి మీదకు ఎక్కనదూరము తోముటకు ఉత్సాదనమని పేరు. చేతుల చివరలనుండి భుజము వంకకును; పాదములనుండి తొడలవంకకును; ఉదరమునుండి యెగువకు అనగా హృదయమువంకకు; కుడివైపున ఆరంభించి యెడమ వైపునకును; ఎడమవైపున ఆరంభించి కుడివైపునకును మూలవాటముగా తోమవలెను. ఇట్లే వీపుపైన క్రింద ఆరంభించి మీదకు మూలవాటముగా తోమవలెను. వెన్నుపైన రుద్దునప్పుడు మూలవాటముగా రుద్దవలయునేగాని మెదడువంకకు సూటిగా నెప్పుడును తోమరాదు.

## ౨ పీడనము (Kneading)

పీడనమనగా పిసుకుట, మెలివేయుట, గట్టిగా నొక్కుటయును నగును. కండరములను అరచేతితోను వ్రేళ్లతోను గట్టిగానొక్కి పిసుకవలయును. కండరములను గట్టిగా పట్టవలయునే కాని వూటుగా పట్టరాదు. తోమునప్పుడు జారినట్లు పిసుకునప్పుడు చేయిజారరాదు. కండరములు చుట్టవలయును. పరిపీడనమందు చేతియొక్కయు కాళ్లయొక్కయు కండరములను లోపలనుండి ఎముకచుట్టును చుట్టవలయును. తడిసవస్త్రము మెలివేసినట్లు రెండుచేతులతోను కండరములను మెలివేయవలయును. అనగా ఒకేచేతితో కండరమును ఒకవైపునకు చుట్టినప్పుడు దానికి ఎదరుగానున్న చేతితో అదేకండరము రెండవవైపునకు చుట్టవలయును. ఇట్లే గతులను మార్చి పిసుకవలయును.

లఘుపీడనమందు కండరమును మునివ్రేళ్లతోను బొటనవ్రేలుతోను మృదువుగా నొక్కిపట్టి మెలివేయవలయును. ఇట్లు చేసినప్పుడు నాడులు శాంతినిపొందును. పరిపీడనమందు చాల లాభములుకలవు. పరిపీడనమువలన కండరములకు సరియైనపోషణజరుగును. అందువలన నవి బాగుగా బలపడును. ముడుచుకొనిపోయిన కండరములు బాగుగా విచివిజెందును. అండలివిషములు వెడలిపోవును. బలక్షయమును గలిగించు మాలిన్యములులేకుండ నశించును. రసమును రక్తమును బాగుగాప్రవహించును. నాడీశక్తి ఉజ్జీవనముపొందును. రోగపదార్థములు రక్తసంకీర్ణము దూరమగును.

## ౩ ప్రహారణము (Percussion)

ప్రహారణమనగా కొట్టుట. సమర్థుడగు ప్రకృతి చికిత్సకుడు సులువెరిగి కొట్టినప్పుడు సుఖముగానుండి ఆరోగ్యమును గలుగును. అతడు చేతివ్రేళ్లతో వడిగను, నెమ్మదిగను చరుచును.

ఛేద్యము (కోయుట.) (Hacking)

చేతిని వత్తిగల పెట్టి కనిష్టిక అనగా చిటికిన

వేళ్లు దాని వెంటనున్న అరచేతియొక్క దిగువ భాగము దేహముపై ఆనునట్లు వుంచి కత్తితో నరకినట్లుచిన్న చిన్న దెబ్బలను కొట్టుటకు ఛేద్యము అని పేరు.

వాద్యము (వాయించుట) (Tapping)

అరచేయి వేళ్లుఆనునట్లు వుంచి చరుచుటకు వాద్యమని పేరు.

తాడనము (Slapping)

ప్రక్కనుండి దవడమీద కొట్టినట్లు చేరచుటకు తాడనమని పేరు.

ఆస్ఫాలనము (Clapping)

అరచేతిని దొన్నెవలెవంచి మోత్రకలునట్లు చేరచుటకు ఆస్ఫాలనము అని పేరు.

సంపుటకము (Beating)

పిడికిలిని ముడిచి గ్రుద్దుటకు సంపుటకమని పేరు. ప్రహారణముచేయుట వలన నాడులయొక్క చివరలయందున్న మొద్దుతనము పోయి నూతనోజ్జీవము కలుగును.

చెమటపోయని స్వభావముగలవారికి ప్రహారణము చేయుటవలన బాగుగా చెమటబోయు స్వభావము ఏర్పడును. ప్రహారణము ఎక్కువకాలము నొప్పికలుగునట్లు చేయుటవలన నాడులయందు చైతన్యము కలుగదు సరిగదా ఉన్న చైతన్యము నశించి చచ్చుపడిపోవును. వెన్నుపాముపై చేసిన మర్దనవలన వెన్నుపాము వెంట వ్యాపించియుండి దేహమున కంతటికిని వ్యాపించియుండునట్టి నరములయందు చైతన్యము కలుగును. అందువలన దేహములోపలనుండు అవయవముల గమనము బాగుపడును. వెన్నుపాముపై రుద్దుటకు ముందు కశేరుకా సమీకరణ శాస్త్రమును ఎరిగియుండవలయును,

## ౪ ఘర్షణము (Friction)

ఒకానొక భాగముపై చేతితో గట్టిగా నొక్కిపట్టి రుద్దుటకు ఘర్షణమని పేరు. అట్లు చేయుట వలన ధాతువులయందలి మాలిన్యములు కదల పారి పోవును.

## ౫ మర్దనము (Pressure)

కండరములను దేహమునుండి కొంచెముదూరము లాగి పిసుకుటకు మర్దనమని పేరు. బొటనవేలితోను చేతివేళ్లతోను కండరములను గట్టిగా పట్టి స్వస్థానమునుండి కదలింపవలెను. తరువాత నెమ్మదినెమ్మదిగా పట్టు వదలవలయును. ఇందువలన కండరములు వికసించును. అందువలన నాడులఉద్రేకము తగ్గును.

## ౬ స్పందనము లేక హర్షకము (Vibration)

దేహభాగముపై ఒకవేలినికాని చేతియొక్క కొంత భాగమునుకాని మిక్కిలి తేలికగా ఆనించి చక్కిలిగింత పెట్టినట్లు కదలించుటకు స్పందనమని పేరు. ఇట్లుచేయుటవలన సవ్వు పుట్టును గాన దీనికి హర్షకమనియు పేరువచ్చినది. ఇట్లు చేయుటవలన సున్నితమగు నరములయందు నవశక్తి పుట్టును.

చర్మవ్యాధులయందును, గ్రంథు లున్నప్పుడును, చర్మము మంటలుగా నున్నప్పుడును, జ్వరములయందును, సంధులయందు మంటలున్నపుడును, గర్భిణీస్త్రీలకును, ఋతుమతియైనస్త్రీకిని, రక్తాభిరణమునకు సంబంధించిన తీవ్రమైనవ్యాధులున్నప్పుడును, రక్తవాహికలు తిన్నగాలేనప్పుడును, ఎముకలయందు తరుణమగువ్యాధులున్నప్పుడును, రక్తమునందువిషమున్నప్పుడును, రక్తము దేహమునుండి వెలువడిపోదగిన స్థితులయం

దును శాస్త్రీయమైన యీమర్దనచికిత్స చేయరాదు. మర్దన మొదటిదినమున చాలమృదువుగా మాత్రమే చేయవలయును. కొద్దికాలమే చేయవలయును. రోగి మర్దనకు అలవాటుపడినకొలదిని మర్దనచేయుకాలమును పెంచవచ్చును. క్రమక్రమముగా గట్టిగా మర్దనచేయవచ్చును.

ఉద్రేకస్వభావముగలవారికి సౌమ్యముగా మర్దనచేయవలయును. వాతస్వభావముగలవారికి అనగా నాడులయందు మాంద్యమున్నవారికి పరిహారణ ఘర్షణాది తీవ్రప్రక్రియలను చేయవలయును.

దేహముపై మర్దనచేయునప్పుడు హృదయము వంకకు మర్దనచేయవలయును. మర్దనచేయువాడు చేతికి కొద్దిగామాత్రమే నూనెరాచుకొనవచ్చును. ఒకానొకచోట సంకోచము (Contraction) కలిగినప్పుడు దైశికముగా మర్దనచేయవలయును. అప్పుడు సాధారణముగా పీడనము చేయవలయును.

కొన్ని దేశములయందు మర్దనశాస్త్రమును నేర్పు పాఠశాలలున్నవి అందు మూడు నెలలు తరిబీయతు పొందినవారికి సర్టిఫికెట్ యిచ్చెదరు. మన దేశమునందుకూడ అట్లు తరిబీయతుపొందినవారే మర్దనచేయుటమంచిది.

# ప్రశ్నలు

౧. చికిత్సాశాస్త్రమున మర్దనచికిత్సకు ఎట్టిస్థానముకలదు ?

౨. మర్దనచికిత్సయందలి వివిధములగు ప్రక్రియలను పేర్కొనుము.

౩. మర్దనచేయుటకు ముందు రోగిని ఎట్లు సిద్ధముచేయవలయును? మర్దనచికిత్సయందు అవలంభించవలసిన ఆరోగ్యనియమములేవి? మర్దనచికిత్సకు వుపయోగింపవలసిన బల్లయొక్క నిర్మాణము ఎట్లుండవలెను?

౪. పీడనము ఎట్లుచేయవలెను? పీడనమునకును పరిపీడనమునకును చేయుటయందు గలభేదమేమి? ఫలితములందు భేదమేమి?

౫. మర్దనచేయుటయందు ఎంతవత్తిడినీ చేయవలయును ? ఎందువలన?

౬. పరిహారణమునందలి వివిధప్రక్రియలను వివరింపుము?

౭. వుండును మర్దనచేయుదువా? ఎందువలన?

౮. మర్దనచికిత్సయందు ఏ ప్రక్రియల తరువాతనే ప్రక్రియలను చేయవలయును?

౯. దైశికమర్దనమన నేమి? అది ఎప్పుడు చేయవలయును? దైశికమర్దనమందు ముఖ్యముగా ఉపయోగింపవలసిన ప్రక్రియ ఏది?

౧౦. మొట్టమొదట మర్దన ఎట్లు చేయవలయును ?



